సంస్కృతపరిషత్ గ్రంథమాలా-49

# సంస్కృతమార్గోపదేశిక

(FIRST BOOK OF SANSKRIT)

మూలము

సర్ రామకృష్ణగోపాల భండార్కర్

M.A.,LL.D,Ph.D.K.C.I.E.&C.,&C.

సంపాదకత్వము

ప్రొఫెసర్. కె.కమల

డైరక్టర్, సంస్కృత అకాడెమీ

ఉస్మానియా విశ్వవిద్యాలయము



ప్రచురణ

సంస్కృత అకాడమీ

ఉస్మానియా విశ్వవిద్యాలయము

2001

# సంస్కృతమార్గోపదేశిక

( FIRST BOOK OF SANSKRIT )

సంస్కృత విద్యార్థులకు ప్రాథమిక దశలో ఉపకరించే

వ్యాకరణము వాక్యాభ్యాసములు

మూలము


## సర్ రామకృష్ణగోపాల భండార్కర్

M.A.,LL.D.,Ph.D.,K.C.I.E.,&C.,&C.

గ్రంథ విస్తృతిని చేసిన పరిష్కర్త

శ్రీధర్ రామకృష్ణ భండార్కర్ M.A.

అనువాదము

డాక్టర్.వి.శ్రీనివాసశర్మ

రిసెర్చ్ అసిస్టెంట్, సంస్కృత అకాడమీ

డాక్టర్.ఏ.రాములు

లెక్చరర్,నిజాం కాలేజి.

సంపాదకత్వము

ప్రొఫెసర్.కె.కమల

డైరెక్టర్, సంస్కృత అకాడమీ

ఉస్మానియా విశ్వవిద్యాలయము



ప్రచురణ

సంస్కృత అకాడమీ

ఉస్మానియా విశ్వవిద్యాలయము

©సర్వస్వామ్యసంకలితము

ప్రథమ ముద్రణము : మూలం-1864

తెలుగు-2001

వెల : రూ. 50-00

కాపీలు : 1000

డి.టి.పి. సహకారం :

డా.పి.శ్రీనివాస్

ప్రింటింగ్.

శ్రీకళాంజలి గ్రాఫిక్స్,

విరలవాడి.

పబ్లిషర్స్ :

సంస్కృత అకాడెమీ ,

ఉస్మానియా విశ్వవిద్యాలయము

# ముందుమాట

మహామహోపాధ్యాయ
ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు

డా. హౌన్ అనే పండితుడు 1862 ప్రాంతంలో ఆంగ్ల పాఠశాలలలో సంస్కృతం నేర్చుకొనే విద్యార్థులకు ఉపకరించే విధంగా సంస్కృతప్రథమ పుస్తకం ( First Book of Sanskrit ) అనే పేరుతో ఒక పాఠ్యగ్రంథాన్ని రచించినట్లు, దానిని శ్రీ రామకృష్ణ గోపాల్ భండార్కర్ పరిష్కరించినట్లు దాని ఉపోద్ఘాతం ద్వారా తెలుస్తున్నది. అయితే ఈ గ్రంథానికి భండార్కర్ పేరు తోనే ప్రసిద్ధి లభించింది. ఆంగ్ల పాఠశాలలలో చదివే విద్యార్థులను దృష్టిలో ఉంచుకొని రచించినదే అయినా కాలక్రమంలో స్వయంగా సంస్కృత భాషాధ్యయనం చేసే విద్యార్థులకు ఉపయోగించేటట్లు కొన్ని చేర్పులూ, మార్పులూ చేసినట్లు తెలుస్తున్నది. ప్రస్తుతం లభ్యం అవుతున్న రూపంలో ఇది ఇటు విద్యార్థులకు, అటు విద్యావంతులకు కూడ సమంగా ఉపకరించే గ్రంథంగా కనబడు తున్నది. ఈ విధంగా "భండార్కర్ ఫస్ట్ బుక్ "ఈ నూతన ప్రక్రియలో వెలువడిన "ఫస్ట్ బుక్ " గా కూడ సార్థక నామధేయ మైనది. దీనిని డా. వి. శ్రీనివాస శర్మ, డా. ఎ. రాములు తెలుగులోనికి అను వదించగా ప్రొఫెసర్ కె. కమల పరిష్కరించి చక్కని తుది రూపమిచ్చారు. ప్రథమానువాదకులిరువురూ హౌన్ స్థానంలోను,

ఆచార్య కమల భండార్కర్ స్థానంలోను ఉండి ఈ తెలుగు అనువాదానికి కూడ అనేక కర్తృకత్వాన్ని సంపాదించి పెట్టారు. ఈ ముగ్గురిలో ప్రతి ఒక్కరు ఇలాంటి గ్రంథాన్ని స్వతంత్రంగా వ్రాయగల సమర్థులు. అలాంటి సుధీమణులు చేసిన అనువాదం నిర్దుష్టంగా ఉంటుందని వేరే చెప్ప పని లేదు. మూలంలో లేని కర్మణి ప్రయోగాలను కూడ చేర్చడం చేత ఈ పుస్తకానికున్న ప్రయోజనం ద్విగుణీ కృతమైనది.

అయితే కాశిక పద మంజరి మొదలైన ఉన్నత శాస్త్ర గ్రంథాలను ప్రచురించిన తాదృశ గ్రంథ ప్రకాశకులకు ఉద్దిష్టమైన పరిశోధనా సంస్థ యైన సంస్కృత అకాడమీ నుండీ ఇలాంటి చిన్న గ్రంథాలు వెలువడడం అస్మాదృశులకు అబ్బుర పాటు కలిగించినా "కాచం మణిం కాంచనమేక సూత్రే గ్రథ్నన్తి నార్యః కిమివాత్ర చిత్రమ్" అని సమాధాన పడ వలసి ఉన్నది. ఆ విషయం ఎలా ఉన్నా ఒక ఉన్నత గ్రంథానికి ముగ్గురు విద్వన్మణులు చేసిన చక్కని అనువాదంగా ఈ గ్రంథానికున్న వైశిష్ట్యం నిరాకరింప శక్యంకానిది.. దీని సాహాయ్యంతో ఆంగ్ల భాషతో పరిచయం లేని తెలుగువారు సంస్కృత భాషను నేర్చుకొనడంలో కృతకృత్యులు కాగలరని నా విశ్వాసం.

హైదరాబాద్ — పుల్లెల శ్రీరామ చంద్రుడు.

12- 10 - 2001

# మున్నుడి

[illegible] శ్రీహరి , M.A.,Ph.D.
[illegible],
[illegible] విశ్వవిద్యాలయం,కుప్పం

మన దేశంలో సంస్కృతాన్ని ప్రథమంగా నేర్చుకోవడానికి [illegible]ంచే పద్ధతులు రెండున్నాయి. ఒకటి శబ్దాలు, ధాతువులు, [illegible] - వీటిని కంఠస్థం చేయడం. రెండు ఆధునిక పద్ధతుల్లో [illegible]మంగా భాషలోని పదాలను, వాటి అర్థాలను , సంధ్యాది [illegible]లను నేర్చుకుంటూ వాక్య రచనను అలవరచుకోవడం . [illegible] పద్ధతిలో కంఠస్థం చేయడమే ప్రధాన లక్ష్యం కనుక ఈ [illegible] విద్యార్థి బాల్యదశలో ఉన్నప్పుడు అనుసరించ దగినది. కంఠ[illegible] చేస్తున్నప్పుడు ఎందుకు కంఠస్థం చేస్తున్నామో, దానికి ప్రయో[illegible]మిటో తెలియక పోయినా చిన్నతనంలో ఎక్కాలు కంఠస్థం [illegible]నట్లుగా ఉత్తర కాలంలో ఈ పద్ధతి విశేషమైన ఫలితాన్ని ఇస్తుంది [illegible] రెండవ పద్ధతిని బాల్య దశలోనూ, అనంతర దశలోనూ [illegible]సరించ వచ్చును. ఇందులో విద్యార్థి కంఠస్థం చేయవలసిన [illegible] లేకుండా క్రమక్రమంగా కొన్ని శబ్ద రూపాలను, ధాతు[illegible]లను, అవ్యయాలను, పదజాలాన్ని పరిచయం చేస్తూ వాక్య [illegible] విధానాన్ని తెలియజేస్తూ భాషా ప్రవేశాన్ని కలిగించే [illegible]శం ఉంది. ఒక విధంగా ఈ రెండు పద్ధతులూ పరస్పర పరి

పూరకాలనే చెప్పాలి. రెండో పద్ధతిలో జిజ్ఞాసువులకు సంస్కృతం నేర్పడానికి రచింపబడిన గ్రంథమే ఇది.

సంస్కృతము చాలా కష్టమైన భాష అనే ఒక అపప్రథ లోకంలో ఉంది. దీనివల్ల సంస్కృతమంటేనే భయపడి దానిని నేర్చుకోవడానికి ముందుకు రాని వారెందరో. అలాంటి వారి కోసం సులభంగా సంస్కృతం నేర్పే ఉద్దేశ్యంతో ఒక చక్కని ప్రణాళికను వేసుకొని క్రమానుగుణంగా భండార్కర్ మహాశయుడు ఈ మార్గోపదేశికను రచించి సంస్కృత జిజ్ఞాసువులకు మహోపకారం చేసినాడు. ఇందులో మొత్తం ముప్ఫై ఒక్క పాఠాలున్నాయి. వీటిలో సాధారణ, విశేష శబ్ద రూపాలు, సర్వనామ శబ్ద రూపాలు, ధాతువులు,వాటి నాలుగు క్రియా రూపాలు, భావ కర్మణి రూపాలు, వ్యవహారానికి అవసరమైన కొంత శబ్ద జాలం, మొదలైన అంశాలు పరిచయం చేయ బడ్డాయి. ప్రతిపాఠం చివర అభ్యాసాలు కూర్చ బడ్డాయి. అధ్యాపకుల్లోను, విద్యార్థుల్లోను ఈ గ్రంథానికి విశేష ప్రాచుర్యం లభించింది. ఎన్ని పర్యాయాలు ఈ గ్రంథం ప్రచురించ బడిందో పరిశీలిస్తే ఈ విషయం మనకవగతమౌతుంది.

సాధారణ జ్ఞానాన్ని కలిగి ఉన్న ఒక విద్యార్థి ఈ గ్రంథాన్ని చదివి ఉపాధ్యాయుని అవసరం లేకుండానే సంస్కృతాన్ని కొంత మేరకు నేర్చుకోగలడనడంలో సందేహం లేదు. నేటి కాలంలో దూర విద్యా విధానానికి అనువుగా సిద్ధం చేయ బడిన పాఠ్య గ్రంథం

మాదిరిగా ఉందని చెప్పవచ్చు.

ఇటీవలి కాలంలో సంస్కృతానికి ఒక విధమైన ఆదరం సామాన్య జనంలో కూడా కనిపిస్తున్నది. సంస్కృత భాషను వ్యాపింప చేయడానికి దేశంలో అనేక ప్రయత్నాలు జరుగుతున్నాయి. జన సామాన్యానికి సంస్కృత భాషను సన్నిహితం చేయడానికి దేశమంతటా సంస్కృత శిక్షణా శిబిరాలు, విశ్వ విద్యాలయాల్లో సంస్కృత సంభాషణా కక్ష్యలు, మొదలైనవి ఏర్పాటు చేయబడుతున్నాయి. ఈ సందర్భంలో ఈ సంస్కృత మార్గోప దేశికకు ఎంతో ప్రాధాన్యం ఉంది.

ఈ గ్రంథం ప్రధానంగా కళాశాలా విద్యార్థులనుద్దేశించింది. కనుక కళాశాలల్లో అధిక ప్రచారంలో ఉన్న ఆంగ్ల మాధ్యమాన్ని దృష్టిలో పెట్టుకొని భండార్కర్ పండితుడు దీనిని ఆంగ్ల మాధ్యమంలో రచించినాడు. ఇటీవలికాలంలో ప్రాంతీయభాషా మాధ్యమంలో విద్యాబోధనకు ప్రాముఖ్యం రావడం మనకు తెలిసిందే. ఈ దృష్టితో సంస్కృత అకాడెమీ అధ్యక్షురాలు ఆచార్య కె.కమల గారు కళాశాలల విద్యార్థుల్లోనే కాక సమాజం లోని సామాన్యజనుల్లో కూడా సంస్కృతం వ్యాప్తి చెందాల్సి ఉన్న నేటి అవసరాన్ని గుర్తించి సంస్కృతలోకంలో ఎనలేని ప్రాచుర్యం పొందిన ఈ గ్రంథాన్ని తెలుగులోకి అనువదింపజేసి ప్రచురించడం సంస్కృతాభిమానులందరూ హర్షింపదగ్గ అంశం. పూర్వం ప్రాతః స్మరణీయులు

శ్రీ కాశీ కృష్ణాచార్యులు గారు 'బాలబోధిని' పేర రాసిన సంస్కృత వాచకాలు సంస్కృతానికి విశేష ప్రచారం కావించినాయి. అలాగే ఈ సంస్కృతానువాదం కూడా సంస్కృతభాషా ప్రచారంలో తప్పక కృతకృత్యమౌతుందని నా ప్రగాఢవిశ్వాసం.

మిత్రులు డా|| వి.శ్రీనివాసశర్మ, డా|| ఏ.రాములు గారలు ఈ గ్రంథాన్ని అనువదించి , సంస్కృతజిజ్ఞాసువులైన తెలుగువారికి ఎంతో ఉపకారం చేసినందుకు వారికి నా శుభాకాంక్షలు. తరువాతి భాగాలను కూడా వారు అనువదిస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు

రవ్వా శ్రీహరి

## ముందుమాట

ప్రొఫెసర్ కె. కమల
నిర్దేశిక, సంస్కృత పరిషత్తు
ఉస్మానియా విశ్వ విద్యాలయము
హైదరాబాద్

సంస్కృత వ్యాకరణాన్ని సులభంగా బోధించే గ్రంథాలు ఇప్పుడు తెలుగులో కావలసి వచ్చినవి. ఒక విధంగా తెలుగు దేశంలో ఇప్పుడిప్పుడే సామాన్య జనులు , విద్యార్థులు ఎక్కువగా సంస్కృతాన్ని అభ్యసించడం మొదలయింది. నాగరిక సమాజంలో మాతృభాషాభ్యాస స్థానంలో ఆంగ్లానికే ఎక్కువ ప్రాముఖ్యం ఏర్పడిన ఈ రోజులలో సంస్కృత భాషాభ్యాసము ద్వారా కొంత సంస్కృతి, సాహిత్యముల పరిజ్ఞానము, అప్రయత్నంగా విద్యార్థులకు కలుగుచున్నది. వివాహాదులలో చదివే అర్థం కాని మంత్రాలే కాకుండా ఇంకా కొంత సంస్కృతంలో ఉన్నదని ఇప్పుడు సగటు నాగరక పౌరునికి తెలిసి వచ్చింది.

ఆంగ్లేయులు భారత భూభాగాన్ని ఆక్రమించిన తరువాత 19వ శతాబ్దంలో సర్. విలియమ్ జోన్స్ అనే విద్వాంసుడు కలకత్తాలో రాయల్ ఏషియాటిక్ సొసైటీ స్థాపించి, సంస్కృతాన్ని స్వయంగా అధ్యయనం చేసి , అభిజ్ఞాన శాకుంతలాన్ని ఆంగ్లములోనికి అనువదించి యూరోపు ఖండములో సంస్కృత విద్యా ప్రచారాన్ని

చేసిన మహనీయుడు. క్రమంగా పెక్కు సంస్కృత గ్రంథాలు యూరోపియన్ భాషలలోనికి అనువదింప బడ్డాయి. యూరోపియ న్లకు భారతీయ సాహిత్యాన్ని గూర్చిన అవగాహన, గౌరవము పెరిగినవి. జోన్స్ మహాశయుడే సంస్కృత, పర్షియన్, గ్రీకు, లాటిన్ మున్నగు భాషలు ఒకే భాషాకుటుంబానికి చెందినవని ప్రతిపాదించి ఇండో-యూరపియన్ భాషల తులనాత్మక అధ్యయనానికి పునాదులు వేసినాడు. ఈ అవగాహన వలననే యూరోపుఖండం లోని బుద్ధిజీవులు సంస్కృతమువంటి భాష పుట్టిన భారత దేశాన్ని బానిస దేశమని పరిగణించడం తప్పని ముక్కు మీద వేలు వేసుకున్నారు. భారత స్వాతంత్ర్య సంగ్రామం లో సంస్కృతం ఈ విధంగా గణనీయమైన పాత్రను వహించింది.

ఆంగ్లేయులకు సంస్కృతాన్ని నేర్పించడానికి హాన్ అనే పండితుడు వ్రాసిన వ్యాకరణాన్ని విస్తృత పరచి , పరిష్కరించి శ్రీ రామకృష్ణ గోపాల్ భండార్కర్ , ఆయన కుమారుడు శ్రీధర్ భండార్ కర్ వివిధ దశలలో వ్రాసిన సంస్కృత మార్గోపదేశిక ఇప్పటి వరకు ఏబది మార్లు ముద్రింపబడిన జనరంజక గ్రంథము. ఈ మార్గోపదేశిక లో ఒక్క క్రియాపదముతో ఆరంభించి ఒక్కొక్క విభక్తి ప్రయోగాన్ని ఉదహరిస్తూ వాక్యాలు ఇవ్వబడినవి . క్రమంగా ప్రథమ, చతుర్థ, షష్ఠ, దశమ గణములలోని ఆత్మనేపద, పరస్మైపద ధాతువులకు, వర్తమాన, లజ్ భూతకాల, ఆజ్ఞార్థక, విధ్యర్థకములలో రూపాలను

చూపిస్తూ, కొంత శబ్ద జాలాన్ని ఇస్తూ, సంధి సూత్రాలన్నీ వివరించ బడినవి. అజంత, హలంత సాధారణ శబ్దాలు, సర్వ నామాలతో బాటు కారక నియమాలు వివరింప బడినవి. కర్మణి ప్రయోగాలతో బాటు కృదంతాలు వివరింప బడినాయి. గ్రంథము చివర పదపట్టిక ఉన్నది. అంచెలంచెలుగా శాస్త్రీయంగా భాషా జ్ఞానాన్ని ఆరు మాసములు అధ్యయనము చేసి, ఈ మార్గోపదేశిక వల్ల జిజ్ఞాసువు పొందగలడు.

శబ్ద మంజరినీ, ధాతు మంజరినీ కంఠస్తము చేస్తే సంస్కృతము అలవడుతుంది. కాని వయోజన, దూరవిద్యా విధానములో ఇది సులభ పద్ధతి కాదు. అంతే కాక గురుకుల పద్ధతిలో సంస్కృతాన్ని నేర్చుకొనే వారిలో కూడా అందరూ తిఙంత ప్రకరణాన్ని చదువు కోవడము లేదు. అట్లాంటి వారందరికీ క్రియా స్వరూపము, వాక్య నిర్మాణ విధానము తెలుపడానికి ఈ మార్గోపదేశిక ఉప కరిస్తుందని విశ్వసింప వచ్చును.

ఆంధ్ర దేశంలో చాలామంది విద్యార్థులు సంస్కృత వ్యాకరణాన్ని తెలుగు వివరణ ద్వారా మాత్రమే గ్రహించ గలుగు తున్నారు. వారి కొరకు సంస్కృత విద్య సామాన్య జనులలో వ్యాప్తి చెంద వలెననే భావముతో సంస్కృత పరిషత్తు ఈ మార్గోపదేశికను తెలుగులోనికి అనువదించి ప్రచురిస్తున్నది. "కాశిక" "పద మంజరి" వంటి ప్రామాణిక వ్యాకరణ గ్రంథాలను, గీతగోవిందం వంటి వివిధ

వ్యాఖ్యాన , వివిధ పాఠాంతర పరిష్కృత గ్రంథాలను సుమారు ఏబదికి పైగా ప్రచురించి ప్రతిష్ఠను సంపాదించుకొన్నది ఉస్మానియా విశ్వ విద్యాలయ ప్రాంగణంలో నెలకొన్న ఈ సంస్కృత పరిషత్తు. దీనికి సాటి అయిన పరిశోధన సంస్థ ఆంధ్రదేశంలో మరొకటి లేదనడం అతిశయోక్తి కాదు. అయితే పరిషత్తు లక్ష్యాలు రెండు- అమూల్యములయిన వ్రాతప్రతులలో దాగి ఉన్న గ్రంథాలను పాఠ పరిష్కారముచేసి ప్రకాశింప చేయడము ఒకటి, సామాన్య జనులలో సంస్కృత ప్రచారాన్ని చేయడానికి "Stories of Katha sarit-sagara ",' पारसीक लोकोक्तय: ' వంటి గ్రంథాలు ప్రచురించడము రెండవది. ' సంస్కృత మార్గోపదేశిక ' తెలుగు అనువాదము ఈ రెండవ లక్ష్యాన్ని పూరిస్తుందనే విశ్వాసంతో ఈ గ్రంథ ప్రచురణకు ప్రయత్నం జరిగింది.

ఈ అనువాదాన్ని తయారు చేసినవారు డా. ఏ. రాములు (నిజాం కళాశాల సంస్కృత లెక్చరర్ ), డా . వి. శ్రీనివాసశర్మ( పరిశోధక సహకారి - సంస్కృత పరిషత్తు ) అనే ఇద్దరు సంస్కృత విద్వాంసులు. వారికి కృతజ్ఞతలు - క్రీ. శ . 1999 వ సంవత్సరములో ఈ పని ఆరంభించినప్పటినుండి అనుకోని చిక్కుల నెదుర్కొన వలసి విలంబము జరిగింది . సంస్కృత పరిషత్తు స్థితి సంశయాస్పదమయింది. ఇన్నాళ్ళకు ఈ గ్రంథము ప్రజలలోనికి పోతున్న కారణం వలన మనస్సు తేలిక పడుతున్నది.

తెలుగు అనువాదంలో అదనంగా చతుర్దశ మాహేశ్వర సూత్రాలు - వాని ప్రయోజనం తెలుప బడింది . కర్మణి ప్రయోగ ప్రకరణంలో లట్ లకారంతో పాటు లజ్, లోట్, విధిలిజ్‌లలో కూడా కర్మణి ప్రయోగ రూపాలు, తదనుగుణంగా వాక్యాలు పొందు పరచ బడినవి.

మహా మహోపాధ్యాయ అచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు జగమెరిగిన విద్వాంసులు. పండిత పామరుల కందుబాటులో నున్న మాకందము వంటి మనస్సు వారిది. సంస్కృత పరిషత్తుకు డైరెక్టర్ గా ఉండి ఎన్నో ఉద్గ్రంథాలను ప్రచురించిన మహనీయులు వారు. వారు వ్రాసి ఇచ్చిన అభిప్రాయము భాషా జిజ్ఞాసువులకు ఆశీర్వాదమే . వారికి నమోవాకములు.

గ్రంథాన్ని ఆమూలాగ్రము పరిశీలించి , సూచనలు చేసి, తమ అభిప్రాయాన్ని కూడా జోడించి పంపించిన ఆచార్య రవ్వా శ్రీహరి గారు ( వైస్ ఛాన్సలర్ - కుప్పం ద్రవిడ విశ్వవిద్యాలయం )పేరెన్నిక గన్న వైయాకరణులు, నైఘంటికులు, భాషా శాస్త్ర వేత్తలు. వారికి స్నేహాంజలిని ఘటిస్తున్నాను.

సంస్కృత పరిషత్తు ఇప్పట్లో గ్రంథ ప్రచురణకు ఒక్క రూపాయి కూడా ఖర్చు పెట్టలేదు. ప్రాథమిక దశలో గ్రంథానికి ఉచితంగా D. T. P. వర్కు చేసి ఇచ్చిన R. K. Printers యజమానులు శ్రీ సీతారామాంజనేయులు గారికి కృతజ్ఞతలు.

ఈ ద్రవ్య లోపాన్ని పూరించడానికి మా అమ్మగారు కీ. శే. కప్పగంతుల అన్నపూర్ణమ్మ గారి ద్రవ్యము రూ. 25,000 ఈ గ్రంథ ప్రచురణకు వెచ్చించడానికి ముందుకు వచ్చిన మాసోదరులు డా. కప్పగంతుల ప్రభాకర శాస్త్రి, శ్రీ కప్పగంతుల కృష్ణమూర్తి గారి వదాన్యతకు ధన్యవాదాలు. మా అమ్మగారికి స్కూలు పాఠాలు చదవని విజ్ఞానము తెలుగు, సంస్కృత భాషలలో చాలాఉండేది. నిరంతరము విద్యా వ్యాసంగముతో కాలము గడపాలని , సంస్కృత వ్యాకరణాన్ని స్వాయత్తం చేసుకోవాలని ఆమె ఉవ్విళ్ళూరుతూ ఉండేవారు. ఈ మార్గోపదేశిక వారి స్మృతి చిహ్నంగా ప్రచురణను పొందడము సముచితమే.

ఈ గ్రంథాన్ని తిరిగి పరిష్కరించడంలో , అచ్చు వేయడంలో అండదండలుగా ఉన్న డా. ప్రాతూరి శ్రీనివాస్ కు ( సంస్కృతం లెక్చరర్ - S. V. V. S కాలేజ్, హైదరాబాద్ ) , వారి భార్య శ్రీమతి సుజాత, మాతృమూర్తి శ్రీమతి సరోజిని గార్లకు విశేషధన్యవాదాలు. ఈ గ్రంథం ఈ రూపంలో పాఠకుల ముందుంచడానికి వారే కారణము. ఇంత వరకూ మా చేతిలోని పనిని శక్తి వంచన లేకుండా చేసినాము. ఇంక ముందు గుణజ్ఞులయిన జిజ్ఞాసువులే ప్రమాణము. " హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపి వా ".

ఇట్లు

కె. కమల

## उपोद्घातः

संस्कृतभाषागहनं प्रविविक्षूणां मार्गोपदेशिकेयं पाठावलिर्ग्रथ्यते । अस्यां चैकैकस्मिन् पाठे पूर्वे प्रकृतिप्रत्ययाङ्गकार्यादीनि प्रदर्श्य पश्चाद्य -थासंभवं सुप्तिङ्कृदन्तानां रूपाणि वाक्येषु प्रयुज्योदाहरिष्यामि । तानि च वाक्यान्यङ्लभाषया विद्यार्थिनो विपरिणमेयुः । तथैवाङ्ल वाक्यानि पाठान्ते लेखिष्यमाणानि संस्कृतरूपं प्रापयेयुः । इत्थमल्पा -यासेनैव यान्यत्र विभक्त्यादिरूपाण्युपनिभन्त्स्यन्ते तान्यध्येतुः स्मृतौ दृढमवगाढानि भविष्यन्ति ।

संस्कृतं जिज्ञासूनामीप्सितसिद्धिकृत्सु रघुवंशादिकाव्येषु सत्सु किमर्थेयं यत्न इति चेदुच्यते । काचिदप्यपरिचितपूर्वा भाषा तस्या व्याकरणमनधीत्य न सम्यग्ज्ञायते । एतदेवाभिप्रेत्य व्याकरण प्रयोजनेषु लघ्वसंदेहाविति प्रयोजनद्वयं कात्यायनः परिसंचख्यौ भाष्यकृच्चेन्द्रबृहस्पत्याख्यायिकामुदाजहार । ननु तर्हि सहैव काव्येन लघुकौमुदी तत्सदृशोऽन्यो वा व्याकरणग्रन्थोऽप्यधीयतां किं पुनरनया पाठावल्येति चेन्न । तादृशानां ग्रन्थानां बालकैः प्रौढवयस्कैरपि पुरुषैः संस्कृतमजानद्भिर्दुरवबोधतया तेषामध्ययने महान् कालक्षेपो भवति गरीयांश्च परिश्रमोऽपेक्ष्यते । न तथेदृशस्य ग्रन्थस्य । तस्य सरलान्वयि वाक्यवत्त्वात्तद्गतव्याकरणसिद्धान्तानामपि वैशद्येनाभिहितत्वात् । एतल्लक्षणस्य ग्रन्थस्याभावात्संप्रति कतिपये नवविद्यार्थिनः संस्कृता -ध्ययनात्पराजयन्ते तन्मा भूदितीयं पाठावलिर्यथामति विरच्यते ।।

# ఉపోద్ఘాతము

(సంస్కృత మూలమునకు తెలుగు అనువాదము)

సంస్కృతభాషను అవగాహనచేసుకొనగోరేవారినుద్దేశించి మార్గోప దేశికగా ఈ పాఠావళి రచింపబడుతోంది. దీనిలో ఒక్కొక్క పాఠంలోను ముందుగా ప్రకృతిప్రత్యయములను గుఱించి, అంగ కార్యములను గుఱించి వివరించి పిమ్మట తగినట్లుగా సుబంత తిఙంతకృదంతరూపములను వాక్యములలో ఉపయోగించి ఉదాహరించెదను. ఆ వాక్యములను విద్యార్థులు ఆంగ్లభాషలోనికి అనువదింపవలెను. అట్లే పాఠము చివరలో వ్రాయబోవు ఆంగ్ల వాక్యములకు సంస్కృత అనువాదము కూర్చవలెను. ఈ విధముగా తక్కువశ్రమతోనే ఇచట చేర్చబడిన విభక్త్యాదిరూపములు పాఠకుని యొక్క స్మృతియందు స్థిరపడును. సంస్కృతవాక్యముల యందు వ్యుత్పత్తి, వాటి రచనయందు కొద్దిపాటి పాటవము అలవడును.

సంస్కృతజిజ్ఞాసువులకు వారి కోర్కెను తీర్చుటకు రఘు వంశాది కావ్యములుండగా ఈ యత్నమెందుకు అని అడిగినచో, ఏ భాషను ఐనను ఆ భాషావ్యాకరణమును చదువకుండా తెలుసు కొనుట కష్టము. ఇందులవననే వ్యాకరణప్రయోజనములయందు లఘువు, అసందేహము అను రెండు ప్రయోజనములను కాత్యాయ నుడు పేర్కొనెను. భాష్యకారుడు ఇంద్రబృహస్పతుల కథను

ఉదాహరించెను. అట్లైనచో కావ్యముతో పాటు లఘుకౌముదినో, అటువంటి మఱియొక వ్యాకరణ గ్రంథమునో చదివినచో సరిపోవును కదా, ఇక ఈ పాఠావళి ఎందుకు అనే ప్రశ్న ఉదయిస్తుంది. కాని అటువంటి గ్రంథములు పిల్లలకు, సంస్కృతము చదవని పెద్దవారికి కూడ అర్థము కావు . కనుక వాటిని చదువుటయందే పెద్దకాలము వ్యర్థమగును. శ్రమకూడ ఎక్కువగును. ఈ గ్రంథము విషయమున అట్లుకాదు. ఏలనన ఇచట సరళముగా అన్వయించుకొనదగు వాక్యములు ఉన్నవి . వాటిద్వారా వ్యాకరణసిద్ధాంతములు కూడ విశదముగ తెలియును కనుక. ఇటువంటి లక్షణములుకల గ్రంథములు లేకపోవుటచే కొంతమంది కొత్తవిద్యార్థులు సంస్కృతము నేర్చుకొనుటకు భయపడుచున్నారు. అట్లుకాకుండుటకై ఈ పాఠావళి యథామతి విరచింపబడుచున్నది.

శ్రీ రామకృష్ణగోపాల భండార్కర్

## ప్రథమ ముద్రణమునకు మొదటి మాట

ఈ బొంబాయి ప్రెసిడెన్సీలోని విద్యావేత్తల దృష్టిలో, విద్యాధి కారుల దృష్టిలో ఈ మధ్యనే సంస్కృతంవిద్య ఎడల గౌరవము పెరిగింది. ఇంతకుముందు పూనా నగరంలోని ప్రాచీన సంస్కృత కళాశాలను అధికారులు ఏదో పోనిమ్మని నిలువనిచ్చినారే కాని ఆదరభావంతో కాదు. తాము పరసంస్కృతి ఎడల సమభావాన్ని ప్రదర్శిస్తున్నామని నిరూపించడానికే వారీ ప్రోత్సాహాన్ని లోగడ కల్పించినారు. సంస్కృతవిద్యాభ్యాసము సంఘానికి ఉపకరిస్తుంది అన్న భావము వారికప్పట్లో ఏర్పడలేదు. ఆధునికవిద్యావిధానములో విమర్శనాత్మక, విశ్లేషణాత్మక దృక్పథాన్ని అధికారులు సంస్కృతానికి అప్పట్లో వర్తింపజేయులేదు. ప్రాచీన పద్ధతిలోనే శాస్త్రాలను బోధించడమనే పరిపాటిని అధికారులు సాగనిచ్చినారు. ఒక ముప్పది సంవత్సరాల కాలము జరిగిపోయిన తరువాత ఇప్పుడే అధికారులు ఈ సంస్కృతవిద్యావిధానాన్ని పరిశీలించి ఉత్సాహంగా నూతన బోధనప్రణాళికను సంస్కృతానికి అనువర్తింపచేయవలెనని అనుకుంటున్నారు. దీని ఫలితంగా ప్రాచీన సంస్కృత కళాశాల స్థానములో కొత్తవిద్యావిధానము ప్రవేశపెట్టబడింది. ఈ నూతన విధానము సఫలము కావాలంటే, విద్యాబోధన బాగా జరగాలంటే, కొంత మేరకు ప్రాచీన విద్యాబోధన పద్ధతిని కూడా అనుసరించవలసి

ఉంటుందని నాకు తోచింది.

సంస్కృత పుస్తకాలు జనం చదువుకోవటానికి అచ్చు వేస్తే తప్ప ఈ క్రొత్తగా లభించిన ఆదరణ, సంస్కృత జిజ్ఞాస నిలువవు. చాలా మంది విద్యార్థులు సంస్కృతం లాటిన్ కంటే కఠినమైనదని ఫిర్యాదు చేస్తూ ఆ విదేశీయభాష కోసం ప్రాచీనమైన తమ భాషను చదవటం మానేస్తున్నారు. ఈ భాషల విషయంలో వారు చేసిన ఆరోపణలో నిజముందా లేదా అనేది నాకు తెలియదు. కాని లాటిన్ కంటే సంస్కృతమే తేలిక అవుతుంది . ఎప్పుడు? కాలేజీలలో అది బోధించ బడినప్పుడు. ఆ భాషను కొత్తగా నేర్చుకునే వారికి తగిన పుస్తకాలు తేలికగా దొరికి నప్పుడు; ఈ రెండవ అవసరాన్ని పూరించడం కోసమే ఈ చిన్ని పుస్తకాన్ని ఒకటిన్నర సంవత్సరాలకు క్రితం తయారు చెయ్యడం జరిగింది. డా.హాన్ అనే వారిచే ఇది రూపొందించబడింది. కాని అవసరాన్ని బట్టి అక్కడక్కడా నేను కొన్ని మార్పులు చేయవలసి వచ్చింది. పుస్తకం పూర్తిగా పిల్లలకోసమే రూపొందించ బడినా, నాగరిక యువకులకు కూడా ఈ గ్రంథము పనికి వచ్చేటట్లు కొన్ని విషయాలు నేను చేర్చాను. నిజానికి పూర్తిగా పిల్లలకోసమే రాసిన పుస్తకాల్లో ఈ విషయాలు చేర్చకూడదు. ఈ పాఠ్యాంశం తయారు చేయడానికి ప్రతి పాఠానికీ నలుబది ఏబది సంస్కృతం, ఇంగ్లీషు మాటలు కూర్చడానికి నేనెక్కువ కష్టపడలేదు. నాకు గుర్తున్నంత వరకు సంస్కృతం

పుస్తకాల్లోని మాటలనే పాఠాల చివర, పాద టిప్పణులలోనూ పొందుపర్చాను. దాదాపు అన్ని సూత్రాలు, ప్రతి ధాతువుకూ నాలుగు క్రియారూపాలు, భావ, కర్మణి ప్రయోగములతో కూడిన రూపాలు మాత్రమేకాక కొన్ని క్రియల వ్యుత్పత్తులు కూడా వివరించాను.

పూనా 3/1864 -----R.G.B. (శ్రీ రామకృష్ణగోపాల భండార్కర్)

రెండవ ముద్రణమునకు మొదటిమాట.

ఈ పుస్తకానికి నేను ఈ రూపం ఇవ్వటం తెలివైన విద్యార్థి ఎవరి నిర్దేశకత్వమూ లేకుండా తనంత తానుగా చదువుకోగలగటం కోసమే. ఈ ఉద్దేశాన్ని ఇది నెరవేరుస్తున్నదని తెలుసుకొని నేను చాలా సంతోషిస్తున్నాను. ఇది పరిపూర్ణత్వాన్ని సంపాదించుకోవడానికి ఇంకా కొన్ని మార్పులను, చేర్పులను, పాదటిప్పణులలోనూ మరికొన్ని చోట్ల కూడా చేర్చబడినది.

రత్నగిరి 11/1866

R.G.B

ఐదవ ప్రచురణకు ముందుమాట

ఈపుస్తకం పాఠ్యాంశంగా పెట్టిన పాఠశాలల్లో నేనిచ్చిన

వేదాలను యాంత్రికంగా సంస్కృతం లోనికీ, సంస్కృతం నుండి ఆంగ్లంలోనికి అనువదింప చేయడం మాత్రమేనని ఆయా అధ్యాపకుల భావన అని నేను గ్రహించాను. వారు వ్యాకరణం జోలికి పోవటం లేదు. కొంతమంది రూపావళిలాంటి పుస్తకాలు విద్యార్థుల చేతుల్లో పెట్టి అందులోని సూత్రాలు బట్టీ పెట్టిస్తున్నారు. దానివల్ల ఈ పుస్తకం వ్రాయడంలోని ఉద్దేశమే -అంటే విద్యార్థులు ఈ పుస్తకంలో ఉన్నదాన్ని నేర్చుకోవడమే గాక భాషా జ్ఞానాన్ని పెంచుకోవాలనే ఉద్దేశ్యమే నెరవేరలేదు. ఇందులో ఇచ్చిన వాక్యాలు భాషా సూత్రాలకూ, రూపాలకూ అభ్యాసంగా ఉండి స్వయముగా పిల్లలు ఇతరత్రా ఉపయోగించు కోవాలనే ఉద్దేశ్యం కాని ఆపుస్తకం వరకే వారి విజ్ఞానం పరిమితం కాగూడదు. మళ్ళీమళ్ళీ అట్లాంటి అభ్యాసం చేయించాల్సిన బాధ్యత ఉపాధ్యాయునిది .ఈ విషయంలో ఉపాధ్యాయునికి సాయపడటానికీ, విద్యార్థి నేర్చుకున్న దాన్ని జీర్ణించు కోవటానికీ పుస్తకంలోని చివరి భాగంలో అన్నిమాటల జాబితా కూడా ఇచ్చాను.

గవర్నమెంట్ బుక్ డిపోకి క్యూరేటర్‌గా పనిచేస్తున్న నా స్నేహితుడు ఈ పుస్తకాన్ని మనదేశంలో చాలా చోట్ల ఉపయోగిస్తు న్నారనీ, రోజురోజుకి ఈ పుస్తకాన్ని ఇంకా కొత్త కొత్త ప్రదేశాలనుండి పంపమని జిజ్ఞాసువులు అడుగుచున్నారనీ చెప్పగా విని నేను చాలా సంతోషిస్తున్నాను. ఈ ప్రచురణలో నేను చేసిన కొన్ని మార్పులు

గా పుస్తక ప్రయోజనాన్ని విస్తరింపచేస్తున్నవని భావిస్తున్నాను.

ముంబాయి 9 సెప్టెంబర్, 1871 R.G.B.

ఎనిమిదవ ప్రచురణకు మొదటి మాట

ఈ ప్రచురణలో విధ్యర్థక రూపాలు అనే పాఠం చేర్చబడింది దీనివల్ల క్రియయొక్క సార్వధాతుక రూపాలనన్నిటినీ ఒకే పుస్తకంలోనే వివరించడమైనది.

పూనా 17,మే1888 S.R.B.

(శ్రీధర రామకృష్ణ భాండార్కర్ )

పన్నెండవ ముద్రణమునకు ముందుమాట

ఈ గ్రంథంలోని వివిధ పాఠములలో అభ్యాసము కొఱకు చేర్చిన వాక్యములను ఇంకా పెంచాలని రచయిత చాలా రోజులుగా అనుకుంటున్నాడు. కాలము,అవకాశము కలిసివచ్చి ఈ ముద్రణంలో అవి పెంచడం జరిగింది.

చాలామంది ఉపాధ్యాయులు పిల్లలకు వ్యాకరణ సూత్రాలు ఎలా పుట్టాయో అదంతా చెప్తే వాళ్ళుకొత్త భాషను నేర్చుకోవటం కఠిన మవుతుందనీ, దానికిబదులు కొన్ని క్రోడీకరించిన వ్యాకరణ రూపాలను వల్లెవేయిస్తే తొందరగా నేర్చుకోవడం సులభమని

భావిస్తున్నారు. కాని సంస్కృతం వంటి భాషలో వాడుకలో ఉన్న చాలా పదాలలో ఒక్కొక్క పదము ప్రత్యేకత కలది. అటువంటి వాటిని ఉదాహరణగా చెప్పినా అవి విద్యార్థికి ఉపయోగపడవు. ఎందుకంటే సంస్కృతపదాల ప్రత్యేక ప్రయోగాలు దేనికి అవే విశిష్టమైనవి. అన్ని పదప్రయోగాలు ఒక సూత్రానికే బద్ధములై ఉండవు. ( తెలుగులో విభక్తి ప్రత్యయాలను కంఠస్థము చేస్తే ఆ ప్రత్యయాలు అన్ని పదాలకు చేర్చడానికి వీలుగా ఉంటాయి, కాని సంస్కృత పద స్వరూపము అందుకు భిన్నంగా ఉన్నది. ) సంస్కృతభాష దైనందిన జీవితంలో ఉపయోగించేది కాదు. దాని వ్యాకరణాధ్యయనమువల్ల ప్రయోగాత్మక జ్ఞానమే కలుగుతుంది. (రచయిత శ్రీ ఆర్. జి. భండార్కర్' మందిరాంతక ప్రవేశిక 'అనే రెండవ వ్యాకరణ గ్రంథమునకు మూడవ ముద్రణ జరిగినప్పుడు తొలి పలుకులలో చెప్పినట్లు సంస్కృతభాషా ప్రయోజనము బహుం ముఖము., అనంతము ఐనది. ఇప్పుడిప్పుడే యూరోపులో ఊపిరి పోసు కుంటున్న భాషాశాస్త్రానికి, భాషల తులనాత్మక అధ్యయనానికి సంస్కృతభాష సూత్రబద్ధమైన నియమావళిని స్థిరమైన ప్రాతిపదికపై అందించ గలిగింది. ( యాస్కమహర్షి, పాణినిమహర్షి ప్రపంచానికి భాషాశాస్త్రాధ్యయన సూత్రాలనందించి , పునాదులు వేసిన వారు.) భాషాశాస్త్రము, తులనాత్మక భాషాధ్యయనము మానవుని జ్ఞానసంపదను విస్తరింపజేసిన శాఖలుగా విలసిల్లినవి.

భారతీయ వ్యాకరణ శాస్త్రవేత్త లందించిన సూత్రబద్ధమయిన భాషాస్వరూపనిరూపణము, ఆ నిరూపణము వెనుకనున్న శాస్త్రీయవిధానము, ఈ భాషాశాస్త్రమునకు శక్తినిచ్చి, ఇంత గొప్ప విషయములను భాషాశాస్త్రములో వివరించడానికి వీలుపడింది. కొందరు విద్వాంసులు భావించినట్లు కేవలము సంస్కృత భాషాజ్ఞానము పారదర్శకమగుట చేతనే ఈ భాషాశాస్త్రము వికసించినదనుటకు వీలులేదు. పారదర్శకత్వముతోబాటు, శాస్త్రీయ వ్యాకరణ నిర్మాణముయొక్క మూలసూత్రములపై ఆధారపడి ఒక భాష వికసించినదనడానికి వీలుండడమువలన సంస్కృత వ్యాకరణ సూత్రముల మూలంగా భాషాశాస్త్రాధ్యయనము సుగమము అయింది. నిజానికి సంస్కృతభాష గ్రీకుభాషకన్న ఎక్కువ పారదర్శకము కాదు. కాని, సంస్కృత వ్యాకరణ నిర్మాణమును చేసిన ఋషులు ఈ భాషా సూత్రములను శాస్త్రీయముగా రూపొందించి మార్గాన్ని సరళముగా తీర్చిదిద్దినారు. పాణిని కాత్యాయన - పతంజలి మునిత్రయము , యాస్కుడు, ఆ మహనీయునికన్న పూర్వమున్న నిరుక్తకారులు లేకుంటే యూరోపు నాగరక జనులు సంస్కృతభాషను గ్రహించి అధ్యయనము చేయక ముందు గ్రీకుభాషను గుడ్డిగా వల్లించినట్లే సంస్కృతాన్ని కూడా గుడ్డిగానే అధ్యయనము చేయవలసి వచ్చేది. అంటే గ్రీకుభాషా ధ్యయనముపై, అధ్యయనమార్గదర్శక సూత్రాలపై సంస్కృత

వ్యాకరణము ప్రకాశాన్ని విస్తరింపజేసి గ్రీకుభాషాధ్యయనానికి గూడా పారదర్శకత్వము ఏర్పరచింది.

ఇట్టి శాస్త్రీయవిశ్లేషణము, విజ్ఞానమే సంస్కృతవిద్యార్థులకు ఉపకరిస్తుంది. ఈ విజ్ఞానము నేడు వాడుకలోనున్న భారతీయభాషలు ఏ సూత్రములమీద పరిణామమునుచెంది వికసించినవో, ధ్వని పరిణామము, అర్థపరిణామము, రూపపరిణామము, కారకపరివర్తనము ఆయా భాషలలో ఎట్లు జరిగినవో తెలుసికొనుటకు ఉపకరిస్తుంది. కనీసము అంతటి ఎఱుక అయినా సుశిక్షితుడైన విద్యార్థికి అవసరముకదా!

ఈ గ్రంథరచయిత చెప్పినట్లుగా శాస్త్రీయవిధానములో పద నిష్పత్తిని విద్యార్థిగ్రహించడము మంచిది.ఇది యావజ్జీవము ఉపకరిస్తుంది. కేవలము నిష్పన్నరూపాలను కంఠస్థము చేయడము వలన ప్రయోజనముండదు. కంఠస్థము చేయవలసిన ధాతు రూపాలను, శబ్దరూపాలను విద్యార్థిచేత చేయించవలసిందే. ఆయా రూపాల శాస్త్రీయ విశ్లేషణమును లేతవయస్సులో ఉన్న బాలకునికి నేర్పించరుగదా! క్రమక్రమముగా ఈపుస్తకంలో వివరించిన శాస్త్రీయ పద విశ్లేషణాన్ని అనగా ప్రకృతి ప్రత్యయవిభాగాన్ని నేర్పిస్తూ సిద్ధ రూపాలను విద్యార్థిచేత కంఠస్థము చేయించ వచ్చును. రెండు మార్గాలనూ ఏకకాలంలోనే అనుసరించినా తప్పులేదు. ఆరంభదశలో విద్యార్థి కేవలము ఈ గ్రంథములో చూపించిన సిద్ధపద

[illegible] గ్రహిస్తే చాలును. వాస్తవానికి అంతకన్న ఎక్కువ గ్రహించే శక్తి అతనికి ఉండదు. ఈ గ్రంథములో మొదటి పాఠములోనే 'గుణము' అంటే ఏమిటో వివరింపబడింది. అదీ పాదటిప్పణుల లోనే జరిగింది. అయితే ప్రథమ గణములోని భూ,నీ,సృ,హృ,వంటి ధాతువులు 'భవ్,నయ్,సర్,హర్'గా మారడానికి కారణమయిన 'గుణము'ను ఇక్కడ వివరించవలసి వచ్చింది. ఆరంభదశలో ఈ 'గుణసంజ్ఞ' స్వరూపాన్ని గ్రహించడము కఠినసాధ్యమే - గ్రంథకర్త ముప్పది రెండు సంవత్సరాల క్రిందట ఈ వ్యాకరణగ్రంథమునకు తొలిముద్రణ చేసినప్పుడు వ్రాసిన ముందుమాటలో చెప్పినట్లు ఈ గుణసంజ్ఞా జ్ఞానాన్ని విద్యార్థి కొంతదూరము సుశిక్షితుడయిన తరువాత వెనుకకు వచ్చి నేర్చుకోవాలి. లేకపోతే బండిసాగదు. (తెలుగు చదువుకొని సంస్కృతాధ్యయనము నారంభించిన వారికిది అంత కష్టసాధ్యము కాదు. తెలుగు వ్యాకరణము లోనే గుణము, వృద్ధి అనే పదాల వివరణమున్నది గదా!) ఈ గుణ,వృద్ధి, యణాదేశాదిసూత్రములను గ్రహించలేని విద్యార్థిగూడా సిద్ధపద ప్రయోగములనాశ్రయించి ముందుకు పోవచ్చును. కొంతకాలమయిన తరువాత సుశిక్షితుడయి వెనుదిరిగి ఈ శాస్త్రీయ విజ్ఞానాన్ని పొందవచ్చును.

ముంబాయి 24-4-1896 S.R.B.

## పంతొమ్మిదవ ముద్రణకు తొలిపలుకు

కొంతమంది ఉపాధ్యాయుల సూచన మేరకు సంధి సూత్రాలు, వాక్యనిర్మాణానికి సంబంధించిన సూత్రాలు పాదటిప్పణిలో ఉన్న వాటిని గుదికూర్చి అనుబంధంగా ఇవ్వబడినది.

ముంబాయి 1-నవంబర్ 1914 S.R.B

## ఇరవైఎనిమిదవ ముద్రణకు తొలిపలుకు

1864లో మొదటి ముద్రణ జరిగినప్పుడు వాడుకలో ఉన్న డయాక్రిటికల్ మార్క్స్‌నే [1]ఇప్పటివరకూ ఉపయోగించడమైంది ప్రపంచమంతా ఒకే రకం మార్క్స్‌ను అనుసరిస్తున్నారు. సంస్కృతం ఇంకా కొన్ని ఇతరభాషలు ఇందువల్ల తేలికగా చదువుకొన వచ్చును. విద్యార్థులకు వీటిని పరిచయం చేయడం కోసం నేను ఈ ముద్రణలో అవి ఉపయోగించాను.

ఇండోర్.17అగస్టు,1936 A.S.భండార్కర్

---

1.డయాక్రిటికల్ మార్క్స్ అంటే సంస్కృత (నాగరి ) అక్షరాలను ఇంగ్లీషులో వ్రాయవలసివచ్చినపుడు పాటించవలసిన నియమాలు. ఉదా॰ -s -स, ś -श, ṣ -ष, a- अ, ā -आ వంటివి.

# సంక్షేపపదసూచిక

అ. - అవ్యయము.

ఆ.ప. - ఆత్మనే పదము.

ఉ ప. - ఉభయ పదము.

ఉ. పు. - ఉత్తమ పురుషము.

ఏ. వ. - ఏక వచనము.

క.ప్ర - కర్మణి ప్రయోగము.

క్రి.వి. - క్రియా విశేషణము.

చ. - చతుర్థీ విభక్తి.

చ.గ. - చతుర్థ గణము.

తృ - తృతీయా విభక్తి.

ద. గ .- దశమ గణము.

ద్వి. - ద్వితీయా విభక్తి.

ద్వి.వ. - ద్వి వచనము.

న. - నపుంసక లిఙ్గము.

ప. ప. - పరస్మై పదము.

పం. - పంచమీ విభక్తి.

పు..పుం - పుంలిఙ్గము.

ప్ర. - ప్రథమా విభక్తి.

ప్రత్య. - ప్రత్యయము.

ప్ర.గ. - ప్రథమ గణము

ప్ర.పు. - ప్రథమ పురుషము.

బహు.వ. - బహు వచనము.

మ.పు. - మధ్యమ పురుషము.

వి. - విశేషణము.

ష. షష్ఠీ విభక్తి.

ష.గ. - షష్ఠ గణము.

స. సప్తమీ విభక్తి.

స.నా. - సర్వ నామము.

సం.ప్ర. - సంబోధన ప్రథమా విభక్తి.

స్త్రీ. - స్త్రీ లిఙ్గము.

# విషయసూచిక

శ్రీ గణేశాయనమః

# వర్ణమాల

అచ్చులు.

अ అ, आ ఆ, इ ఇ, ई ఈ, उ ఉ, ऊ ఊ, ऋ ఋ, ॠ ౠ, ऌ ఌ, ए ఏ,
ऐ ఐ, ओ ఓ, औ ఔ, ం(అనుస్వారము) ః(విసర్గ),

హల్లులు (వ్యంజనములు)

కవర్గము - కంఠ్యాక్షరములు, क् క్, ख् ఖ్, ग् గ్, घ् ఘ్, ङ् ఙ్

చవర్గము - తాలవ్యములు च् చ్, छ् ఛ్, ज् జ్, झ् ఝ్, ञ् ఞ్

టవర్గము - మూర్ధన్యములు ट् ట్, ठ् ఠ్, ड् డ్, ढ् ఢ్, ण् ణ్

తవర్గము - దంత్యములు त् త్, थ् థ్, द् ద్, ध् ధ్, न् న్

పవర్గము - ఓష్ఠ్యములు प् ప్, फ् ఫ్, ब् బ్, भ् భ్, म् మ్

అంతస్థములు,
అర్ధస్వరత్వముగల హల్లులు
- తాలవ్యము य् య్
- మూర్ధన్యము र् ర్
- దంత్యము ल् ల్
- దంత్యోష్ఠ్యము व् వ్

ఊష్మములు -
- తాలవ్యము श् శ్
- మూర్ధన్యము ष् ష్
- దంత్యము स् స్
- కంఠ్యోద్ధారము ह् హ్

ప్రతి వర్గలోని చివరి మూడు అక్షరములు, य र ल व

(అంతస్థములు) మరియు ह అనేవి మృదు వ్యంజనములు. వాని లోనూ ङ,ञ,ण,न,म అనునవి అనునాసికములు. మృదువ్యంజనములు కానివి పరుష వ్యంజనములు.

| పరుష వ్యంజనములు (Hard consonants) | మృదువ్యంజనములు (Soft consonants) |
|---|---|
| क ख | ग घ ङ |
| च छ | ज झ ञ |
| ट ठ | ड ढ ण |
| त थ | द ध न |
| प फ | ब भ म |
| श ष स | य र ल व ह |

क, च, ट, त, प, ग, ज, ड, द, ब - అల్పప్రాణములు

ख, छ, ठ, थ, फ, घ, झ, ढ, ध, भ -మహాప్రాణములు

**గమనిక** - పాణినీయ అష్టాధ్యాయి లోని మాహేశ్వర సూత్రములతో పరిచయమున్నవారు ఖర్ ప్రత్యాహారములోనున్న అక్షరములను పరుష వ్యంజనములుగా మిగిలినవి మృదువ్యంజనములుగా గ్రహించవలెను. ఈ జ్ఞానము సంధి సూత్రములలో బాగుగా ఉపయోగ మగును.

సంయుక్తాక్షరములు :-

| | | |
|---|---|---|
| [illegible] - क् +क | ग्ल - ग् + ल | ठ्य - ठ् + य |
| [illegible] - क् +त | ग्व - ग् + व | ठ्र - ठ्+र |
| [illegible] - क् + त् + व | घ्न - घ् +न | ड्ग - ड् + ग |
| [illegible] - क् +न | घ्य - घ् +य | ड्म - ड् + म |
| [illegible] - क् +म | घ्र - घ + र | ड्य - ड् + य |
| [illegible] - क् +य | घ्व - घ् +य | ढ्य - ढ् + य |
| [illegible] - क् +र | ङ्क - ङ् + क | ण्ण - ण् +ण |
| [illegible] - क् +ल | च्च - च् + च | ण्म - ण् + म |
| [illegible] - क् + ष | च्छ - च् +छ | ण्य - ण् + य |
| [illegible] - क् +ष् + ण | च्छ्र - च् + छ् + र | ण्व - ण् + व |
| [illegible] - क् + ष् + म | च्छ्व - च् + छ् +व | त्त - त् + त |
| [illegible] - क् +ष् + य | च्म - च् + म | त्थ - त् + थ |
| [illegible] - क् + ष् + व | ज्ज - ज् + ज | त्य - त् + य |
| [illegible] - ग् +ध | ज्र - ज् + र | त्न - त् + न |
| [illegible] - ग् + न | ज्व - ज् +व | ल्म - ल् + म |
| [illegible] - ग् + र | प्स - प् + स | ल्य - ल् + य |
| [illegible] - द् + य | ब्ज - ब् + ज | ल्ल - ल् + ल |
| [illegible] - द् + र | ब्द - ब् + द | ल्व - ल् + व |
| [illegible] - द् + र् + य | ब्ध - ब् + ध | त्प - त् + प |
| [illegible] - द् + व | ट्ट - ट् + ट | त्प्र - त् + प् + र |

| | | |
|---|---|---|
| ग्र्य - ग् + र् + य | ट्य - ट् + य | त्फ - त् + फ |
| त्म - त् + म | प्म - प् + म | ष्क - ष् + क |
| त्य - त् + य | प्य - प् + य | ष्क्र - ष् + क + र |
| त्र - त् +र | प्र - प् +र | ष्ट - ष् + ट |
| त्र्य - त् + र् + य | प्ल - प् + ल | ष्ट्य - ष् + ट् + य |
| त्स - त् + स | ब्य - ब् + य | ष्ट्र - ष् + ट् + र |
| त्स्न - त् + स् + न | ब्र - ब् + र | ष्ट्व -ष् + ट् + व |
| त्स्य - त् + स + य | भ्ण - भ् + ण | ष्ठ - ष् + ठ |
| द्ग - द् + ग | भ्न - भ + न | ष्ठ्य - ष् + ठ् + य |
| द्द - द् + द | भ्य - भ् + य | ष्ण - ष् + ण |
| द्ध - द् + ध | भ्व - भ् + व | ष्ट्व - ष् + ट् + व |
| द्ब्र - द् + ब् + र | म्म - म् + म | ष्व - ष् + व |
| द्भ - द् + भ | म्य - म् + य | स्क - स् + क |
| द्म - द् + म | म्र - म् + र | स्ख - स् + ख |
| ष्प्र - ष् + प् + र | म्ल - म् + ल | स्त - स् + त |
| ष्म - ष् + म | म्व - म् + व | स्थ - स् + थ |
| ष्य - ष् + य | य्व - य् + व | स्प्र - स् + प् + र |
| द्व्य - द् + व् + य | र्ण्य - र् + ण् + य | स्फ - स् + फ |
| द्व्र - द् + व् +र | र्ध्व - र् + ध् + व | स्म - स् + म |
| ध्न - ध् + न | ल्क - ल् + क | स्य - स् + य |

| | | |
|---|---|---|
| ध्म - ध् + म | ल्ग - ल् + ग | स्र - स् + र |
| ध्य - ध् + य | ल्प - ल् + प | ह्ण - ह् + ण |
| ध्व - ध् + व | व्य - व् + य | ह्न - ह् + न |
| न्न - न् + न | ब्र - ब् + र | ह्म - ह् + म |
| न्म - न् + म | श्च - श् + च | ह्य - ह् + य |
| न्य - न् + य | श्न - श् + न | ह्र - ह् + र |
| न्व - न् + व | श्म - श् + म | ह्ल - ह् + ल |
| प्त - प् + त | श्र - श् + र | ह्व - ह् + व |
| प्न - प + न | श्ल - श् + ल | |

## మాహేశ్వర సూత్రములు

अइउण्,ऋऌक्, एओङ्, ऐऔच्, हयवरट्, लण्, ञमङणनम्, झभञ्, घढधष्, जबगडदश्, खफछठथचटतव्, कपय्, शषसर्, हल्

ఇవి పదునాలుగు మాహేశ్వర సూత్రములు. ఈ సూత్రముల చివరనున్న అక్షరములకు 'ఇత్' సంజ్ఞ వచ్చును. అనగా ఆ అక్షరములు లోపించును. ఉదా:- 'అఇఉణ్' అను సూత్రము చివర నున్న ణ కారమునకు లోపము వచ్చి అ,ఇ,ఉ లు మాత్రము మిగులును. రెండు,మూడు సూత్రముల మధ్యనున్న అక్షరములను గాని ఒకే సూత్రములోని అక్షరములనుగాని కలిపి చెప్పవలసి వచ్చి

నప్పుడు మాత్రము ఈ చివరనున్న హల్లులు ప్రత్యాహారములకు ఉపకరించును. ఉదా:- 'అణ్' అనగా అ,ఇ,ఉలు అని, 'అక్' అనగా అ,ఇ,ఉ,ఋ, ఌ అని, 'అచ్' అనగా అ,ఇ,ఉ,ఋ,ఌ,ఏ,ఓ,ఐ,ఔలు అని గ్రహించవలెను. అచ్చు అనుపదమునకు ఇదే అర్థము. అట్లే 'హయవరట్' అను సూత్రములోని 'హ' కారముతో ఆరంభించి, హల్ అను సూత్రములోని లకారముతో అంతమొందే 'హల్' అను ప్రత్యాహారములో హల్లులు అనగా వ్యంజనము లన్నియు చేరును. అందుకే వానికి హల్ సంజ్ఞవచ్చింది. తెలుగు భాషలోని హ్రస్వము లగు ఎ,ఒ,లు (ఎలుక,ఒకటిలోని ఎ,ఒ,లు) శకట రేఫము(ఱ) సంస్కృతభాషలో లేవు. అరసున్నలేదు- 'ళ' కారము వైదిక సంస్కృతభాషకు మాత్రమున్నది- ఉదా:- అగ్నిమీళే, అగ్నిమీడే వంటివి, కాబట్టి కాళిదాసు,మంగళము వంటిపదములు సంస్కృతము దృష్ట్యా తప్పు. కాలిదాసః, మంగలమ్ అని చెప్పవలెను.

ఈ మాహేశ్వర సూత్రములను నోటికి నేర్చుకుంటే వర్ణమాలను నేర్చుకున్నట్లే అగును. ఈ సూత్రములు ఋషిప్రోక్తములు గావున పవిత్రములు, పఠించదగినవి. పైగా అనేక సందర్భములలో, ముఖ్యముగా సంధి సూత్రములను అర్థము చేసుకొనవలసి వచ్చినప్పుడు ఈ మాహేశ్వర సూత్రముల జ్ఞానము, ప్రత్యాహారముల జ్ఞానము బాగుగా ఉపకరించును. ఉదా :- యణాదేశసంధి 'యణ్' అను ప్రత్యాహారంలో య,వ,ర,ల,లు (నాలుగు అంతస్థములు) గ్రహింపబడినవి.

## అభ్యాసము

ఈ క్రింది ప్రత్యాహారములలోని అక్షరములను గుర్తించుడు.

| | | |
|---|---|---|
| 1. అక్ अक् | 2. ఇక్ इक् | 13.ఏజ్ एज् |
| 3.అచ్ अच् | 4.హల్ हल् | 14.హశ్ हश् |
| 5.ఏచ్ एच् | 6.అట్ अट् | |
| 7.యణ్ यण् | 8.ఝల్ झल् | |
| 9.ఖర్ खर् | 10.ఙమ్ ङम् | |
| 11.జశ్ जश् | 12.శర్ शर् | |

గమనిక - కవర్గ, చవర్గ, టవర్గ, తవర్గ, పవర్గ ఈవిధముగా ఒక్కొక్క వర్గలో అయిదు అక్షరములున్నవి. వీనికి క్రమముగా సంస్కృత వ్యాకరణములో కు,చు,టు,తు,పు సంజ్ఞలు వచ్చును ( ' కు 'అనగా కఖగఘఙ అని గ్రహించవలెను) సంస్కృతవర్ణమాలలో ' \' అనునది హలంత సంజ్ఞ అనగా పొల్లు అని అర్థము 'क्' అనగా 'క్' అని గ్రహించవలెను. శ,ష,స,లు ఊష్మములు - వీనిలో 'శ' తాలవ్యము. 'ష' మూర్ధన్యము- 'స' దంత్యము అగును - అట్లే య,వ,ర,ల లు అంతస్థములు. వానిలో 'య' తాలవ్యము, 'వ' దంతౌష్ఠ్యము, 'ర' మూర్ధన్యము, 'ల'దంత్యము అగును. కంఠము, తాలువు మున్నగు ఉచ్చారణ స్థానములు.హల్లులతోబాటు అచ్చులకు గూడ వర్తించును. అచ్చుల ఉచ్చారణములో నాలుక నోటిలోని ఏ భాగమును

స్పృశించదు. ('ఋ', 'ౠ' ల ఉచ్చారణము ఆలోచించనదగినది). అందుకే హల్లులకు స్పర్శ అక్షరములు అని పేరు. ఈక్రింది పట్టిక ఆయా ఉచ్చారణస్థానములను సూచించును.

(1) 'अ,कु,ह, विसर्जनीयानां कंठः' అకారము, 'కు' అనగా కవర్గకు చెందిన హల్లులు (కఖగఘఙలు) హకారము, విసర్గలు కంఠ్యములు.

(2) 'इ,चु,य,शानां तालु' - ఇకారము, 'చు'అనగా (చఛజఝఞలు) య,శ,లు తాలవ్యములు.

(3) 'ऋटुरषाणां मूर्धा' - ఋకారము 'టు'అనగా టవర్గ (టఠడఢణలు) ర,షలు మూర్ధన్యములు.

(4) ऌतुलसानां दंताः - ఌ కారము, 'తు'అనగా త వర్గ(తథదధనలు) లకారము, సకారములు దంత్యములు.

(5) उपूपध्मानीयानां ओष्ठः - ఉకారము, 'పు' అనగా పవర్గ (పఫబభమలు) ఉపధ్మానీయము (పవర్గకు ముందుచేర్చి ఉచ్చరించవలసిన విసర్గ ఃప, ఃఫలు) ఓష్ఠ్యములు.

5(a) अमङणनानां नासिकाच - ఇవి అనునాసికములు.

(6) 'वकारस्य दन्तौष्ठम् -వ' కారము దంతములతోనూ, ఓష్ఠముతోను కలిపి ఉచ్చరించదగినది. ఇది దంతౌష్ఠము.

(7) जिह्वामूलीयस्य जिह्वामूलम् - కవర్గ హల్లుల కన్నా ముందు చేర్చి ఉచ్చరించదగిన విసర్గ జిహ్వామూలీయము - ఇది నాలుక వెనుక భాగము నుండి ఉచ్చరించదగినది - ఉదా:- దుఃఖము, యఃకశ్చన.

# మొదటి పాఠము

క్రియలు

పరస్మైపదము[1] - వర్తమానకాలము- ఏక వచన ప్రత్యయములు

ప్రథమపురుషముति,

మధ్యమపురుషముसि,

ఉత్తమపురుషముमि,

(ప్రథమగణము- శప్‌వికరణి)- వికరణము అంటే ధాతు గణము.

ధాతువులు

गम् (गच्छ[2]) వెళ్ళుట  बुध् (बोध्) తెలుసుకొనుట  रक्ष् రక్షించుట అర్థంచేసుకొనుట

---

1. సంస్కృతములో పరస్మైపదము ఆత్మనేపదమని రెండురకాలుగా ధాతువులకు ప్రత్యయాలను చేర్చే ప్రక్రియలున్నాయి. రెండురకాల ప్రత్యయాలను విడివిడిగా చేర్చుకొనేవి ఉభయపది ధాతువులు. క్రియల మూలరూపమును ధాతువు అని అంటారు. ధాతువులు పదిగణములలో విభజింపబడినవి. ప్రతిగణములోను కొన్ని పరస్మైపదమునకు చెందినవి. మరికొన్ని ఆత్మనేపదమునకు చెందినవి ధాతువులుంటాయి. ప్రతి గణమునకు ఒక వికరణ ప్రత్యయము ఉంటుంది. సంస్కృతభాషలో ద్వివచన ప్రయోగాలుంటాయి.ఇది ఈ భాషలోని ప్రత్యేకత.

2. వికరణ ప్రత్యయానికి ముందు ధాతువులలో వచ్చే మార్పులను (ఆదేశాలను) కుండలిలో సూచించాము.

नी (नय्[1]) తీసుకొనిపోవుట भू (भव्) ఉండుట,సంభవించుట, అగుట ( To become)

वद् మాట్లాడుట

पत् పడుట वस् నివసించుట सृ (सर्) కదలుట

[2]ద్వితీయ గణములోని ధాతువులు. अस् ఉండుట (to be) अद् తినుట అనునవి.

तिङ् అనగా క్రియలకు చివరచేర్చు ప్రత్యయములు అని అర్థము .ति सि मि మున్నగునవి तिङ् ప్రత్యయములు. ఈ క్రియా

---

1. ధాతులలోని చివరి అచ్చుకు, లేదా ఉపధలోని హ్రస్వమగు అచ్చునకు ప్రథమగణ సంజ్ఞ అయిన 'అ' కారము చేర్చినప్పుడు 'గుణము' వచ్చును. **గుణసంజ్ఞ** అనగా :- इ ई > ए గా, उ ऊ > ओ గా, ऋ ॠ > अर् గా మారుట., 'नी ' అనే ధాతువునకు గుణమువచ్చుటచే 'ने ' గా మారును. తరువాత ప్రథమ గణ సంజ్ఞ అయిన अ చేర్చి तिङ् క్రియా ప్రత్యయమును చేర్చాలి.సంస్కృతంలో రెండు అచ్చులు సంధి కాకుండా విడిగా పరస్పరం సన్నిహితంగా వుండవు కాబట్టి ముందున్న ధాతువుయొక్క అంశంలోని ए ओ ऐ औ లు వరుసగా अय् अव् आय् आव् లుగా మారును. తరువాత అకారము చేర్చబడును.

ఉదా ने +अ + ति = नय् + अ +ति = नयति అనురూపమేర్పడును. అచ్చులమార్పులవల్ల ధాతువునకు వచ్చే మార్పులు కుండలిలో చూపబడ్డాయి .

2. రెండవగణము చాలా కఠినమైనదైనందున రెండే ధాతువులు ఇక్కడ ఇవ్వబడ్డాయి. మిగిలినవి పూర్తిగా రెండవపుస్తకంలో చర్చించబడ్డాయి.

ప్రత్యయముల ముందు మొదటి గణంలోని ధాతువులకు अ చేర్చబడును. రెండవగణంలోని ధాతువులకు వికరణప్రత్యయము చేరదు. तिङ् ప్రత్యయములు సరాసరి చేర్చబడును.

ఉత్తమపురుషలో म् లేదా व् అనే అక్షరాలతో మొదలయ్యే ప్రత్యయములముందు అకారమునకు దీర్ఘము వచ్చును.

| | | | |
|---|---|---|---|
| वदामि । | सरसि । | गच्छति । | भवति । |
| रक्षसि । | नयामि । | अद्मि । | अत्ति । |
| पतति । | वससि । | नयति । | अस्ति । |
| बोधसि । | सरामि । | बोधामि । | |

ప్రథమగణము

चर् వెళ్ళుట, నడచుట दह् కాల్చుట पच् వండుట

जीव् జీవించుట नम् నమస్కరించుట, వంగుట

त्यज् వదిలిపెట్టుట

సంస్కృతంలోనికి అనువదించండి.

(నీవు)మాట్లాడుచున్నావు (నేను)నివసించుచున్నాను

(అతడు)కదలుచున్నాడు (అతడు)మాట్లాడుచున్నాడు

---

1.పరుష వ్యంజనములముందున్న అనునాసికములు తప్ప మిగిలిన హల్లులు వర్గములోని మొదటి అక్షరాన్ని ఆదేశంగా పొందును.

ककुभ् + प्रान्त = ककुप्प्रान्त  दृषद् + पतति = दृषत्पतति ,

अद् + ति = अत्ति

(నీవు)పడుచున్నావు

(నీవు)వెళ్ళుచున్నావు

(నేను) ఉన్నాను

(నీవు)[illegible]చున్నావు

(నీవు)కొట్టుచున్నావు

(వాడు)వదలిపెట్టుచున్నాడు

(నేను)వదలుచున్నాను

(వాడు) వడచుచున్నాడు

(నేను)నివసించుచున్నాను

(నేను) తింటున్నాను

(వాడు)తెలుసుకొనుచున్నాడు

(వాడు) నివసించుచున్నాడు

(నీవు)ఉన్నావు

(వాడు)వండుచున్నాడు

(నేను)రక్షించుచున్నాను

(నీవు)తలవంచుచున్నావు

(నేను) వండుచున్నాను

# రెండవపాఠము

బహువచనప్రత్యయములు:-ఉత్తమపురుషము मस् మధ్యమ పురుషము थ ప్రథమపురుషము.[2] अन्ति ।

| <u>**చతుర్థగణము**</u>('శ్యన్'వికరణి) | | <u>**షష్ఠ గణము**</u> (శవికరణి) |
|---|---|---|
| नश् - | నశించుట | इष्(इच्छ्)కోరుట |
| नृत् - | నాట్యముచేయుట | प्रच्छ्(पृच्छ्)అడుగుట, ప్రశ్నించుట |
| पुष् - | పోషించుట | मुच्(मुञ्च्) వదలివేయుట, విడిచిపెట్టుట |

-----------------------------------

1.सि అనే ప్రత్యయానికి ముందు अस् ధాతువులోని చివరి హల్లు లోపించును.

2. అకారముతో మొదలయ్యే ప్రత్యయము ముందున్న 'అ' లోపించును.

[illegible] మూర్ఛిల్లుట, మోహము చెందుట

विश् ప్రవేశించుట

[illegible] - లోభమును పొందుట

सृज् సృష్టించుట, వదలుట

स्पृश् - తాకుట

[illegible]గణ(నాల్గవ) ధాతువులకు य, షష్ఠ[1] (ఆరవ) గణ ధాతువులకు [illegible] అనేవి వికరణ ప్రత్యయములు (గుర్తులు). ఈ అక్షరములు तिङ् [illegible]ప్రత్యయముల ముందు చేర్చబడును.

ద్వివచన బహువచన ప్రత్యయములముందు अस् ధాతువులోని '[illegible]' కారము లోపించును.

తెలుగులోనికి అనువదించుము:

| | | |
|---|---|---|
| वदामः[2] । | नयामः । | स्थ । |
| गच्छन्ति । | भवथ । | अदन्ति । |
| बोधथ । | वसन्ति । | दहामः । |
| सन्ति । | नश्यन्ति । | स्पृशामः । |

---

1. ఈగణములో అచ్చులకు గుణమేర్పడదు. మొదటిగణములో మాత్రము గుణమేర్పడును.
2. పదముల చివరనున్న స్ అనే అక్షరము, ఆ తరువాత ఏ పదము వున్నా లేకున్నా విసర్గగా మారుతుంది. అలాగే పదాంతములోని 'ర్' తరువాత పరుష వ్యంజనము ఉన్నా ఏ అక్షరము లేకున్నా విసర్గగా మారుతుంది.

| | | |
|---|---|---|
| जीवथ । | नृत्यथ । | सृजथ । |
| नमन्ति । | मुह्यामः । | इच्छन्ति । |
| पुष्यामः । | लुभ्यन्ति । | पृच्छथ । |
| मुञ्चामः । | विशन्ति । | |

ధాతువులు

| ప్రథమ గణము | చతుర్థగణము | షష్ఠగణము |
|---|---|---|
| जि (जय्) జయించుట | अस् విసురుట | क्षिप् విసురుట |
| दृश् (पश्य) చూచుట | कुस् కౌగలించుకొనుట | तुद् పీడించుట, బాధపెట్టుట |
| धाव् పరుగెత్తుట | तुष् సంతోషించుట | |
| पा (पिब्) త్రాగుట | लुट् నేలపై దొరలుట | दिश् చూపించుట |

| ప్రథమ గణము | చతుర్థగణము | షష్ఠగణము |
|---|---|---|
| यज् పూజించుట, యజ్ఞము చేయుట | शुष् ఎండుట | सिच् (सिञ्च्) తడుపుట |
| वह् మోయుట, ప్రవహించుట | | स्मृ (स्मर्) జ్ఞప్తికి తెచ్చుకొనుట |
| | | हृ (हर्) దూరముగా తీసికొనిపోవుట |

సంస్కృతములోనికి అనువదించుము.

మీరు మాట్లాడుచున్నారు (वद्)

మేము పోవుచున్నాము(गम्)

వారు తెలుసుకొనుచున్నారు(बुध्)

మీరు తీసికొని పోవుచున్నారు(नी)

వారు (అట్లు)ఉన్నారు(अस्)

మేము నివసించుచున్నాము(वस्)

మీరు తినుచున్నారు(अद्)

మేము ఉన్నాము(भू)

వారు దహించుచున్నారు(दह्)

మేము జీవించుచున్నాము(जीव्)

వారు బాధించుచున్నారు(तुद्)

నీవు జీవించుచున్నావు(जीव्)

వారు పుష్టిగా ఉన్నారు(पुष्)

మేము నశించుచున్నాము(नश्)

వారు స్పృశించుచున్నారు(स्पृश्)

వారు నృత్యముచేయుచున్నారు(नृत्)

మేము జయించుచున్నాము (जि)

మీరు మోహముచెందుచున్నారు(मुह्)

మీరు హరించుచున్నారు (हृ)

మేము లోభమునుపొందుచున్నాము(लुभ्)

వారు చూచుచున్నారు(दृश्)

మేము విసరివేయుచున్నాము(अस्)

మేము త్రాగుచున్నాము(पा)

మీరు పూజించుచున్నారు(यज्)

వారు వహించుచున్నారు(वह्)

మేము స్మరించుచున్నాము(स्मृ)

మీరు పారవేయు చున్నారు(क्षिप्)

వారు కౌగిలించుకొనుచున్నారు(कुस्)

మేము సంతోషముగా ఉన్నాము(तुष्)

అవి ఎండుచున్నవి(शुष्)

మీరు దొరలుచున్నారు(लुट्)

మీరు తడుపుచున్నారు(सिच्)

# మూడవపాఠము

క్రియలు ద్వివచనాంతములు

ఉత్తమపురుషమువస్ మధ్యమపురుషముథస్ ప్రథమపురుషముతస్

దశమగణ ధాతువులు.

कथ् చెప్పుట चिन्त् ఆలోచించుట प्रथ् ప్రకటించుట

---

1. సాధారణంగా దశమగణంలోని ధాతువులు ఉభయ పదులు - అంటే

**गण्** లెక్కించుట   चुर्(चोर्) దొంగిలించుట  **प्रथ** ప్రథకలిగించుట

**प्री(प्रीण)**మెప్పించుట घुष्(घोष्) చాటించుట   पीड् పీడించుట, బాధించుట

**रच्** పొందుపరుచుట,రచించుట

**स्पृह्** కోరుట, ఇచ్ఛగించుట

దశమగణములోని ధాతువులకు तिङ् ప్రత్యయములకు ముందు

**अय** [2] అనే ప్రత్యయము (గుర్తు) చేరుతుంది.

తెలుగులోనికి అనువదించుము

**चोरयाव: ।**   घोषयथ: ।   नमथ: ।

---

పరస్మైపదములోను, ఆత్మనే పదములోనూ రూపములను కలిగి ఉంటాయి. దశమ గణము లోని ధాతువులయొక్క చివరి అచ్చులు అంతకు ముందున్న 'అ' కారము (कथ्, गण्, रच्, प्रथ् మొదలగునవి తప్ప) గుణమును, వృద్ధిని యథోచితముగా పొందును.

వృద్ధి సంజ్ఞ अ > आ , इ ई ए > ऐ , उ ऊ ओ > औ ,

ऋ ॠ > आर् , ऌ > आल्,

గుణమునకు - चुर - (चोर्) , घुष् - (घोष) ఉదాహరణములు

వృద్ధికి - क्षल् - (क्षाल्), तड् - ताड् అనే రూపాలు ఉదాహరణములు

2.ఒక పదమునకుగాని పదాంశమునకుగాని చివరిఅక్షరమునకు ముందున్న అక్షరము ఉపధ. ఇది హ్రస్వాచ్చు అయితే గుణము వచ్చును. चि అనే ధాతువునకు వృద్ధిరాగా "चै" గామారి आय చేరి चायय గా మారును. ति ప్రత్యయముచేర్చగా चाययति అగును, तड्+अय= ताडय ; घुष् + अय -घोषय మొదలగునవి గమనించదగిన రూపాలు.

| | | |
|---|---|---|
| पीडयथः । | स्पृहयावः । | स्तः । |
| कथयतः । | चिन्तयतः । | स्मरावः । |
| गणयावः । | प्रीणयथः । | जयथः । |
| प्रथयावः । | गच्छतः । | नश्यतः । |
| रचयतः । | नयावः । | नृत्यावः । |
| अद्वः । | विशतः । | इच्छतः । |

| ప్రథమగణము | చతుర్థగణము | షష్ఠగణము |
|---|---|---|
| अट् తిరుగాడుట పర్యటించుట | कुप् కోపగించుట | उञ्छ् ఏరుకొనితినుట ఉంఛవృత్తితోనుండుట |
| चल् తిరుగుట | क्षुभ् క్షోభించుట | कृष् దున్నుట |
| जल्प् ప్రలాపముచేయుట ఎక్కువగామాట్లాడుట | श्लिष् కాగిలించుకొనుట | स्फुर् అదురుట |
| | | **దశమగణము** |
| निन्द् నిందించుట | पूज् పూజించుట | सान्त्व् సాంత్వనము చేయుట, ఓదార్చుట |
| शंस् ప్రశంసించుట | वर्ण् వర్ణించుట | |

సంస్కృతములోనికి అనువదించుడు

మీరిద్దరు దొంగిలించుచున్నారు(चुर्)

వారిద్దరు నొప్పించుచున్నారు(तुद्)

మేమిద్దరము చెప్పుచున్నాము(कथ्)

మీరిద్దరు లెక్కించుచునారు(गण्)

వారిద్దరు చూచుచున్నారు(दृश)

మీరిద్దరు కోరుచున్నారు(इष)

మేమిద్దరమురచించుచున్నాము(रच)

వారిద్దరు ఘోషించుచున్నారు(घुष)

మేమిద్దరము చింతించు(యోచించు)చున్నాము(चिन्त)

మీరిద్దరు ప్రకాశింపజేయు చున్నారు(प्रथ)

వారిద్దరు ప్రీతిని కలిగియున్నారు(प्री)

మేమిద్దరము నిందించుచున్నాము(निन्द)

మీరిద్దరు కోపించుచున్నారు(कुप)

వారిద్దరు దున్నుచున్నారు(कृष)

మేమిద్దరము పూజించుచున్నాము(पूज)

వారిద్దరు క్షోభించుచున్నారు(क्षुभ)

మీరిద్దరు పర్యటించుచున్నారు(अट)

వారిద్దరు వర్ణించుచున్నారు(वर्ण)

మేమిద్దరము ఏరుకొనుచున్నాము(उञ्छ)

వారిద్దరు ఓదార్చుచున్నారు(सान्त्व)

మేమిద్దరము కౌగిలించు కొనుచున్నాము(श्लिष)

వారిద్దరు ప్రలాపము చేయుచున్నారు((जल्प)

మేమిద్దరము ప్రశంసించుచున్నాము(शंस)

మీరిద్దరు మాటలాడుచున్నారు(वद)

వారిద్దరు అట్లు ఉంటున్నారు(भू)

మీరిద్దరు వండుచున్నారు(पच्)

మేమిద్దరము తెలిసికొనుచున్నాము(बुध्)

వారిద్దరు తింటున్నారు(अद्)

మేమిద్దరము సంతోషించుచున్నాము(तुष्)

మీరిద్దరు లోభముతోనున్నారు(लुभ्)

వారిద్దరు దొరలుచున్నారు(लुट्)

మేమిద్దరము తాకుచున్నాము(स्पृश्)

మీరిద్దరు ప్రశ్నించుచున్నారు(प्रच्छ्)

# నాల్గవ పాఠము

క్రియలు : వర్తమానకాలము (మరికొన్ని ధాతువులు)

**ప్రథమగణము**

क्षि(क्षय्) క్షీణించుట

द्रु(द्रव्) పారుట,ద్రవించుట

रुह(रोह्) మొలకెత్తుట, పెరుగుట

स्था(तिष्ठ्) ఉండుట, ఆగుట

ह्वे (ह्वय्) పిలచుట

**చతుర్థగణము**

मद् (माद्) మదించిఉండుట , తప్పుచేయుట

शम् (शाम्) శమించుట,అణగుట

श्रम् (श्राम्) అలసట పొందుట , శ్రమించుట

**దశమగణము**

क्षल् (क्षाल्) కడుగుట

तुल् (तोल्) తూకమువేయుట

तड् (ताड्) కొట్టుట భूष् అలంకరించుట

తెలుగులోనికి అనువదించుడు

| | | | |
|---|---|---|---|
| वदसि । | मुञ्चति । | ताडयसि । | हरतः । |
| वसथ । | इच्छामि । | रोहन्ति । | जयसि । |
| बोधामः । | मुञ्चथ । | पूजयति । | पिबन्ति । |
| रक्षति । | स्पृशति । | तिष्ठामि । | पचावः । |
| पतामि । | स्मरथ । | स्पृहयथः । | ह्वयति । |
| नयन्ति । | वहतः । | क्षालयति । | पीडयन्ति । |
| अत्थ । | सिञ्चति । | क्षयतः । | यजामः । |
| सन्ति । | लुठ्यन्ति । | अद्मि । | श्राम्यामि । |
| नश्यसि । | तुष्यामि । | जीवामः । | घोषयथ । |
| नृत्यसि । | अस्यथः । | त्यजथ । | गणयति । |
| विशामः । | कथयामः । | पचन्ति । | कृषामः । |
| पृच्छथः । | शंसथ । | पुष्यामि । | द्रवन्ति । |
| चिन्तयति । | | | |

సంస్కృతములోనికి అనువదించుడు

(అతడు) పోషించుచున్నాడు (అతడు) మోహించుచున్నాడు

(నేను)నాట్యము చేయుచున్నాను (అది)క్షీణించుచున్నది

(వారు) సంతుష్టి చెందుతున్నారు (నీవు) చెప్పుచున్నావు

(అతడు)ప్రవేశించుచున్నాడు
(అతడు) తూకము వేయుచున్నాడు
(నీవు)పోవుచున్నావు
(నీవు) ఇష్టపడుచున్నావు
(మీరు)రచించుచున్నారు
(నేను) ఇష్టపడుచున్నాను
(నీవు) నొప్పించుచున్నావు
(నేను) స్మరించుచున్నాను
(మీరు)కాల్చుచున్నారు
(మేము) పిలుచుచున్నాము (ह्वे)
(మేము)హరించుచున్నాము
(అతడు) దొంగలించుచున్నాడు
(నీవు)స్పృశించుచున్నావు
(నీవు) పూజించుచున్నావు
(నీవు) ప్రీతినికలిగించుచున్నావు
(నేను) ప్రవేశించుచున్నాను

(నేను) జయించుచున్నాను
(నీవు) కోరుచున్నావు
(వారు) దొంగిలించుచున్నారు
(నేను) శ్రమించుచున్నాను
(నేను) పూజించుచున్నాను
(వాడు) ఘోషించుచున్నాడు
మేమిద్దరము) త్రాగుచున్నాము.
(అది) పెరుగుచున్నది(रुह्)
(వారిద్దరు)నివసించుచున్నారు
(వారు) కడుగుచున్నారు
(మీరు) చెప్పుచున్నారు
(వారు)కొట్టుచున్నారు
మేమిద్దరము ఉన్నాము(अस्)
(వారు) కోరుచున్నారు
మీరిద్దరు పోవుచున్నారు.

వర్తమానకాలము - (లట్)

ప్రథమగణము ('अ' చిహ్నము)

| | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమ పురుషము | बोधति | बोधतः | बोधन्ति |

| | | | |
|---|---|---|---|
| మధ్యమ పురుషము | बोधसि | बोधथः | बोधथ |
| ఉత్తము పురుషము | बोधामि | बोधावः | बोधामः |

చతుర్థ గణము( 'य' చిహ్నము)

| | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుషము | पुष्यति | पुष्यतः | पुष्यन्ति |
| మధ్యమపురుషము | पुष्यसि | पुष्यथः | पुष्यथ |
| ఉద్ధమపురుషము | पुष्यामि | पुष्यावः | पुष्यामः |

షష్ఠగణము ( 'अ' చిహ్నము)

| | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుషము | विशति | विशतः | विशन्ति |
| మధ్యమపురుషము | विशसि | विशथः | विशथ |
| ఉత్తమపురుషము | विशामि | विशावः | विशामः |

దశమ గణము ( 'अय' చిహ్నము)

| | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుషము | चोरयति | चोरयतः | चोरयन्ति |
| మధ్యమపురుషము | चोरयसि | चोरयथः | चोरयथ |
| ఉత్తమపురుషము | चोरयामि | चोरयावः | चोरयामः |

## అభ్యాసము

1. ఈ క్రింది వానిని వివరించుము.

అ. కంఠ్యములు. ఆ. తాలవ్యములు

ఇ. మూర్ధన్యములు ఈ. దంత్యములు

ఉ. ఓష్ఠ్యములు ఊ. అర్ధస్వనములు, అంతస్థములు

ఋ. మృదువ్యంజనములు ౠ. పరుష వ్యంజనములు.

2. ఈ క్రింది అక్షరములకు గుణము, వృద్ధిని గుర్తించండి.

(అ)ఇ ऐ (ఆ)ఉ ते (ఇ)ఋ ऋ (ఈ) ऌ

గమనిక:- తెలుగులో గుణము, వృద్ధి, సంధి సూత్రములతోనే నేర్చుకొనుట జరుగును - సంధి ఉన్నప్పటికిని, లేకున్నప్పటికిని ఒక అచ్చునకు గుణము, వృద్ధి వచ్చి మరొక అచ్చుగా మారుటను ఇక్కడ గమనించవలెను.

3. ఈ క్రింది గణములకు చేర్చు వికరణప్రత్యయము (గుర్తు) అక్షరములేవి ? ఆయా గణముల లక్షణములు ఏమి ?

అ. ప్రథమ గణము ఆ. చతుర్థగణము ఇ. షష్ఠ గణము

ఈ. దశమ గణము ఉ. ద్వితీయ గణము

4. వర్తమాన కాల రూపములను అభ్యాసము చేయండి.

5. ఉత్తమపురుషలోని व,म లముందు 'అ'కారమెట్టిమార్పును పొందును ?

6. అచ్చునకు ముందు వచ్చే ए,ओ, ऐ,औ లు ఎటువంటి మార్పును

పొందునో ఉదాహరించుము.

7. పరుష వ్యంజనమునకు ముందువచ్చే హల్లు ఏ మార్పును పొందునో ఉదాహరించుము.

8. పదం చివరవచ్చే स्,र् అనే అక్షరములు ఏ మార్పును చెందును?

9. పీటైనన్ని ధాతువుల వర్తమానకాలిక రూపములను చూపుము.

## ఉపసర్గలు

ధాతువులకు ముందు ఉపసర్గలు చేర్చినపుడు అవి ధాతువుల మౌలికార్థాన్ని మార్చును.ఉపసర్గలను స్వతంత్రముగా ప్రయోగించుట అరుదు. ముఖ్యమైన ఉపసర్గలీక్రింద ఇవ్వబడినవి

अति - దాటి, అతిక్రమించి [1]अतिक्राम्यति - దాటి వెళ్ళుచున్నాడు

अधि - పైన, పైగా अधिगच्छति - పైగావెళ్ళుచున్నాడు.

తెలిసికొనుచున్నాడు.అధిగమించుట దాటిపోవుట అను అర్థమురాదు)

अनु - వెంట अनुसरति - వెంటవెళ్ళుచున్నాడు

---

1.తెలుగుభాషలో క్రియాపదాలచివరలో కర్తృవాచకశబ్దముయొక్క లింగము నిర్దేశింప బడును.ఉదా-వెళ్ళుచున్నాడు,వెళ్ళుచున్నది.కాని సంస్కృతభాషలోక్రియారూపముస్త్రీ,పుం,నపుంసకలింగములలోనున్న మూడు కర్తృశబ్దములకును వర్తించును.ఉదా- रामः गच्छति, सीता गच्छति, मित्रं गच्छति

| | |
|---|---|
| अभि -సమ్ముఖమునకు, ఎదురుగా | अभिगच्छति - దగ్గరకు, ఎదురుగా వెళ్ళుచున్నాడు |
| आ - పరిమితముచేయు | आगच्छति - వచ్చుచున్నాడు |
| అంతవరకు - వెనుకకు మరలు | आरोहति - ఎక్కుచున్నాడు |
| उद् - పైకి, దాటి, శ్రేష్ఠము | उत्पतति - ఎగురుచున్నాడు |
| | उद्गच्छति -పైకిపోవుచున్నాడు |
| | उद्भवति - ఉద్భవించుచున్నాడు |
| उप -దగ్గర, తక్కువ, సమీపము | उपगच्छति -దగ్గరకువెళ్ళుచున్నాడు |
| नि - లోపల, క్రింద | निषीदति- క్రిందకూర్చుంటున్నాడు |
| परा -వ్యతిరేకముగా | पराजयते -ఓడిపోవుచున్నాడు |
| प्रति - తిరిగిచేయు | प्रतिभाषते- బదులుచెప్పుచున్నాడు |
| वि - వేరుగాచేయు, విడిపడు | विश्लिष्यति -వేరుచేయుచున్నాడు |
| सम् -కలిసివుండు | [1]सङ्गच्छते -కలియుచున్నాడు |

---

1. పదానికిగానీ, ప్రాతిపదికకు గానీ చివరనున్న "म्" సాధారణంగా హల్లుకు ముందు అనుస్వారంగా మారుతుంది. . కాని "म्" తరువాత श ष स र ह అనే హల్లులు వచ్చినప్పుడు అది తప్పక అనుస్వారమౌ తుంది. అను స్వారంగా మారనపుడు 'మ' కారము తరువాత హల్లు యొక్క వర్గమునకుచెందిన అనునాసిక వర్ణముగా మారును. అదే మకారము య,వ,ల అక్షరములకుముందు అనుస్వారముగా మారనచో అవి అనునాసికములగు య్ఁ,వ్ఁ,ల్ఁ, లుగా మారును.

# ఐదవపాఠము

ప్రథమా విభక్తి, అకారాంతశబ్దములు

సంస్కృతభాషలో నామవాచక, సర్వనామ, విశేషణములకు విభక్తి ప్రత్యయములు చేరును. వానికే 'సుబంతములు'[1] అని, వ్యవహారములో శబ్దములుఅని పేరు. రామశబ్దము ; హరిశబ్దము వంటివి.

ప్రత్యయములు

| | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| పుల్లిఙ్గము | स् | औ | जस् |
| నపుంసకలిఙ్గము | स् | ई | आनि |
| | नृपः | नृपौ[2] | नृपाः[3] |

---

1.'सुप्तिङन्तं पदम्' (అష్టా.1-4-14) 'सुप्' 'तिङ्' ప్రత్యయములు అంతము నందున్నదే 'పదము'అగును.'నీ' అనేది ధాతువు.అది పదము కాదు. దానికి 'तिङ्' ప్రత్యయము 'ति' చేరి 'नयति' అనే రూపమేర్పడు తుంది. అట్లే 'राम' శబ్దము నకు 'सुप्' ప్రత్యయము 'स्' చేరి'रामः' అనే రూపమేర్పడుతుంది. रामः' అనేది పదము.

2. अ లేదా आ తరువాత ए ऐ ओ औ లు వచ్చినపుడు ए ऐ ల స్థానములో ऐ, ओ औ ల స్థానములో औ వచ్చును. ( वृद्धिरेचि, అష్టా.6-1-88)

3. చివరి నాల్గు అచ్చులు తప్ప ఏ అచ్చుకైనా ( అ,ఇ,ఉ,ఋ ఌ లు దీర్ఘమైనా, హ్రస్వమైనా, వానికి పరంగా సవర్ణమైన అచ్చు

| फलम् | फले | फलानि |
|---|---|---|

పుల్లిఙ్గములు

| | | |
|---|---|---|
| अनल -అగ్ని | नर -మనుష్యుడు | मेघ - మేఘము |
| अश्व-గుఱ్ఱము | नृप -రాజు | राम - రాముడు |
| ईश्वर -దేవుడు | पवन -గాలి | वृक्ष -వృక్షము |
| कूर्म - తాబేలు | पुत्र -పుత్రుడు | समुद्र -సముద్రము |
| जन -జనము | बुध -పండితుడు | सूद - వంటవాడు |
| जीव -జీవుడు,జీవనము జంతువు | मूर्ख -మూర్ఖుడు | हस्त -చెయ్యి |

-----------------

వచ్చినపుడు రెంటి స్థానములో సవర్ణమైన దీర్ఘము వచ్చును.( अकःसवर्णे दीर्घः,అష్టా.6-1-101)ఇది సవర్ణదీర్ఘసంధి.

दैत्य + अरिः = दैत्यारिः

कवि + ईशः = कवीशः

पितृ + ऋणम् = पितॄणम्

ప్రథమా, ద్వితీయా విభక్తుల విషయంలో ప్రత్యయములలోని అకారము లోపించదు. ఇది తిఙ్ లకు వర్తించును.

1. अ आ లతరువాత इ उ ऋ లు (దీర్ఘ మైనా ,హ్రస్వ మైనా) వచ్చినపుడు రెండింటి స్థానములో గుణము వచ్చును.( आद्गुणः, అష్టా 6-1-87)

నపుంసకలిఙ్గములు

| | | |
|---|---|---|
| कमल -కమలము | दुःख -దుఃఖము | मुख -ముఖము |
| गृह -ఇల్లు | धन - ధనము | फल - పండు |
| सुख -సుఖము | जल - నీరు | नेत्र - కన్ను |
| मित्र - స్నేహితుడు | हृदय -హృదయము | |

తెలుగులోని అనువదించుడు.

| | | |
|---|---|---|
| नृपो [1]जयति । | सुखं प्रीणयति । | कूर्मः सरति । |
| [2]अश्वावुत्पततः । | जीवो मुह्यति । | फले पततः । |
| जना [3]वदन्ति । | हस्तौ हरतः । | धनं नश्यति । |

---

1. హ్రస్వ అకారమునకు తరువాత విసర్గ వచ్చినపుడు ఆ విసర్గ తరువాత హ్రస్వ అకారముగాని మృదు వ్యంజనముకాని (Soft consonent) వచ్చినపుడు ఆ విసర్గ 'ఉ'కారముగా మారును. ఈ ఉకారము అంతకుముందున్న హ్రస్వఅకారముతో కలిసి నపుడు గుణము వచ్చి ఓకారముగా మారును नृपः + जयति = नृपो जयति.

2. ए ओ ऐ औ అనునాల్గు అచ్చులు एच् అను ప్రత్యాహారములో చేరును. వానికి అచ్చు పరమైనపుడు అవి క్రమంగా అయ్, అవ్, ఆయ్ ఆవ్ గా మారును. एचोऽयवायावः (అష్టా.6-1-78)

3. ఆకారమునకు తరువాత వచ్చిన విసర్గకు తరువాత అచ్చుగాని సరళాక్షరము గానీ పరమైనపుడు ఆ విసర్గ లోపించును. హ్రస్వ

बाल: स्पृहयति । मुखानि द्रवन्ति । नरा गच्छन्ति ।
गृहाणि रक्षन्ति । दु:खं पीडयति । कमले नृत्यत: ।
नेत्रे पश्यत: । राम: पूजयति । मित्राणि कथयन्ति ।
मेघ: सिञ्चति । पुत्रौ तुष्यत: । सूदो विशति ।
बुधौ मुञ्चत: । जलं शुष्यति । समुद्र: शाम्यति ।
पवनो हरति । मूर्खौ कुप्यत: ।

---

.అకారమునకు తరువాత వచ్చిన విసర్గ హ్రస్వఅకారము తప్ప వేరే ఏ అచ్చు పరమైనను లోపించును. అపుడు సన్నిహితముగా వున్నప్పటికి ఆ రెండు అచ్చులకు సంధి ఏర్పడదు.

नरा: + इमे = नरा इमे, बुध: + इच्छति = बुध इच्छति

1. ఒకే పదంలోని లేదా తరువాత 'ఋ'కార 'ర'కార, 'ష'కారములకు పరమైన నకారము ణకారముగా మారును.(रषाभ्यां नो ण: అష్టా. 8-4-1)అట్లుగాక 'ఋ'కార 'ర'కార, 'ష'కారములకు 'న' కారమునకు మధ్య అట్ ప్రత్యాహారములోని అక్షరములున్నను (అ,ఇ,ఉ,ఋ,ఌ , ఏ,ఓ,ఐ, ఔ,హ,య,వ,ర,లు) కవర్గ, పవర్గలోని హల్లులు ఉన్నను ఈ ణత్వము వచ్చును.(अट् कुप्वाङ् नुम् व्यवायेऽपि, అష్టా8-4-2) అట్లే అనుస్వారము మధ్యలో ఉన్నను ణత్వము వచ్చును ఉదా: బృంహణము. తృంహణము. పదాంతము నందున్న 'న్' (నకారపొల్లు) నకు మాత్రము ణత్వమురాదు. ఉదా : నరాన్ .

## సంస్కృతములోనికి అనువదించుము

రాజులు రక్షించెదరు.

రెండు సముద్రములు క్షోభించుచున్నవి

(ఇద్దరు) పిల్లలు దొర్లుచున్నారు

బుద్ధిమంతుడు శవమును వహించియున్నాడు.

కుమారుడు ప్రీతిని కల్గించుచున్నాడు

మూర్ఖులు ప్రలాపించుచున్నారు.

గుల్మములు దుముకు చున్నవి.

మిత్రుడు అడుగుచున్నాడు.(प्रच्छ)

గాలులు వీచుచున్నవి.

ఆకులు రాలుచున్నవి.(पत्)

వాయువులు వహించుచున్నవి.

చెట్లు పెరుగుచున్నవి.

హృదయము తుష్టిగా వున్నది.

రెండు తాబేళ్ళు కదలుచున్నవి.

వంటవారు వండుచున్నారు.

జంతువులు నశించుచున్నవి.

ప్రజలు నిందించుచున్నారు.

చేయి విసరుచున్నది.(क्षिप्)

మనిషి చెప్పుచున్నాడు.

నిప్పు దహించుచున్నది.

కమలము అలంకరించుచున్నది.

కన్ను అదరుచున్నది.

నోరు మాట్లాడుచున్నది.

'ఇ'కారాంత శబ్దముల రూపములు

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| పుల్లిఙ్గము | स् | इ | अस् |

ద్వివచనంలో ई అనే అచ్చు దీర్ఘమగును, బహువచనంలోని अस् ముందు 'ఇ' కారామునకు గుణము వచ్చి 'అయ్'

ఆదేశమగును.

| | | | |
|---|---|---|---|
| | हरिः | हरी | हरयः(हरे + अस् ) |
| నపుంసకలిఙ్గము | -- | ई | इ |

అచ్చుతో మొదలయ్యే ప్రత్యయములముందు నపుంసకలిఙ్గము ప్రాతిపదికయొక్క 'ఇ' కారానికి ముందు నకార పొల్లు (న్) చేరును. ప్రథమా, ద్వితీయా బహువచన ప్రత్యయముల ముందు 'ఇ' కారము దీర్ఘమగును.

| | | |
|---|---|---|
| वारि | वारिणी | वारीणि |

పుల్లిఙ్గములు

| | | |
|---|---|---|
| अग्नि-అగ్ని | असि-కత్తి | ऋषि-ఋషి |
| अरि-శత్రువు | उदधि-సముద్రము | कपि-కోతి |
| कवि-కవి | पवि-ఇంద్రుని వజ్రాయుధము | |
| व्याधि-రోగము | गिरि-పర్వతము | हरि-విష్ణువు |
| धूर्जटि-శివుడు | पाणि-చేయి | वारि-నీరు |
| भूपति-రాజు | यति-సన్న్యాసి | |

न[1] - లేదు, కాదు.(ఇది ఒకఅవ్యయము)

తెలుగులోనికి అనువదించుము.

अरिः क्षुभ्यति । नृपतिर्यजति [2]। गिरिर्वहति ।

---

1.విభక్తి ప్రత్యయాలు చేర్చబడనివి అవ్యయములు. వీనిది స్థిరరూపము.

'సదృశం త్రిషు లిఙ్గేషు సర్వాసు చ విభక్తిషు
వచనేషు చ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయమ్'

పుం, స్త్రీ, నపుంసకలిఙ్గములలో, అన్ని విభక్తులలో ఏక, ద్వి, బహు వచన ములలో ఒకే రూపమును స్థిరముగా కలిగిన శబ్దము అవ్యయసంజ్ఞను పొందును.

2. अ లేదా आ కంటే భిన్న మైన అచ్చు తరువాత వచ్చే విసర్గలకు అచ్చుగాని మృదు వ్యంజనముగాని పరమయితే అవి 'र्' గా మారును

कपयः क्षिपन्ति । वारीणि शुष्यन्ति । व्याधयो नश्यन्ति ।
ऋषी चिन्तयतः । अग्निर्दहति । पविः पतति ।
अरिः पीडयति । कवयः शंसन्ति । असयः पतन्ति ।
पाणी हरतः । वारि नास्ति । यती चिन्तयतः ।

సంస్కృతంలోనికి అనువదించుము

శివుడు రక్షించుచున్నాడు.
యతులకు(సన్న్యాసులకు)కోరికలు లేవు.
[1]మునులు శాంతముగా ఉన్నారు.(శమ్)
కత్తి పడుచున్నది.
కోతులు పరుగెత్తుచున్నవి
ఇద్దరు శత్రువులు జయించుచున్నారు.
కవి వర్ణించుచున్నాడు (వర్ణ)
హరి కోపించుచున్నాడు.
రాజులు తీసుకొని వెళ్ళుచున్నారు.
చేయి తడుపుచున్నది.

---

ఉదా :-కవిః + జయతి = కవిర్జయతి, కవిః + అత్ర = కవిరత్ర
ర్ తరువాత ర వస్తే మొదటి రకారము లోపిస్తుంది . ముందున్న హ్రస్వమైన అచ్చు దీర్ఘమౌతుంది. ఉదా -पुनर् + रमते - पुना रमते
1.श,स,ष లముందు వచ్చే విసర్గలు అలాగే వుండును. లేదా शषस లుగా మారును.

రెండు అగ్నులు చల్లబడుచున్నవి(శమ్).

జబ్బు పీడించుచున్నది. (పీడ).

పర్వతము నిలబడియున్నది (స్థా)[1] ।

# ఆరవ పాఠము

## ద్వితీయా విభక్తి

### అకారముతో అంతమయ్యే శబ్దరూపములు

| పుంలిఙ్గములు- | ఏకవచనం, | ద్వివచనం, | బహువచనం. |
| --- | --- | --- | --- |
| | म् | औ | आन् |
| | बुधम् | बुधौ | बुधान् |

నపుంసకలిఙ్గంలో ప్రథమావిభక్తిరూపముల మాదిరిగానే ద్వితీయా విభక్తిరూపాలు ఉంటాయి.

పుంలిఙ్గములు

अगद మందు,ఔషధము　　　　पुरुष పురుషుడు

-----------------------------

1.విసర్గ తరువాత 'చ ఛ' వచ్చినచో విసర్గ 'శ' గా మారును.
విసర్గ తరువాత 'త' వచ్చినచో అది 'స' గా మారును.
విసర్గ తరువాత 'ట,ఠ' లు. వచ్చినచో విసర్గ 'ష' గా మారును.
हरिश्चरति - हरिः चरति, रामस्तरति, रामष्टीकते ।
(स्तोः श्चुना श्चुः అష్టా.8-4-40) , (ष्टुना ष्टुः అష్టా.8-4-41)

व्याघ्र పులి

प्रज्ञ పండితుడు

किङ्कर సేవకుడు

शठ మోసగాడు

ब्राह्मण బ్రాహ్మణుడు

गज ఏనుగు

शिष्य శిష్యుడు

योध యోధుడు

जनक తండ్రి

सिंह సింహము

स्तेन దొంగ

स्वर्ग స్వర్గము

ओदन అన్నము

व्याध వేటగాడు

बिडाल పిల్లి

कोश ధనాగారము, ధనరాశి

शर బాణము

भार భారము,బరువు

ग्राम గ్రామము,పల్లెటూరు

मोक्ष మోక్షము

वेद వేదము

देह దేహము

पाद పాదము

నపుంసకములు

अरण्य అడవి

वस्त्र బట్ట,వస్త్రము

पाप పాపము

तृण గడ్డి

सुवर्ण బంగారము

नगर పట్టణము

तत्त्व యథార్థము

विष విషము

पुस्तक పుస్తకము

ధాతువులు దశమగణము

दण्ड् దండించుట

भक्ष् తినుట

मार्ग् వెదకుట

తెలుగులోనికి అనువదింపుడు

ईश्वरं जनः पूजयति । कविर्बुधौ शंसति ।

नृपः शठान् दण्डयति । पुत्रो जनकं सान्त्वयति ।

रामोऽश्वमारोहति । पुस्तकं मार्गयामि ।

---

1.పదం చివర వచ్చే ఏ,ఓ లకు హ్రస్వ 'అ' కారము పరమయినపుడు ఆ 'అ'కారమునకు లోపము వచ్చును. దాని స్థానంలో ऽ లేదా z(అవగ్రహం) అనే గుర్తు సాధారణంగా వాడబడును. అవగ్రహము అనగా లోపము అని అర్థము. 'సుప్తిఙంతం పదం' అనునది పదసంజ్ఞ. సుప్ తిఙ్ అను రెండు గణముల ప్రత్యయాలు విధించిన తరువాత ఏర్పడు రూపమును పదము అని అందురు. సుప్ అనగా సు ఔ జస్ నుండి సప్తమీ విభక్తి బహు వచన ప్రత్యయము సుప్ వరకు ( సు నుండి సుప్ వరకు గ్రహిస్తే) అది సుప్ ప్రత్యయాంతము. అట్లే తిఙ్ .అనగా ధాతువులకు ఆయా కాలములలో చేరు ప్రత్యయములు. ఉదా॰ రామ+సు ='రామః' అనేది సుబంత రూపము. వద్ +అ + తి = 'వదతి' అనేది తిఙంతరూపము. అవ్యయములకు గూడ సుప్ ప్రత్యయములు చేర్చబడి, ఆ తరూవాత అవి లోపించును. అందుకే వానికి గూడ సుబంత సంజ్ఞ వచ్చును. 'రామ' అనునది పదము కాదు. ప్రాతిపదికము. రామః అనునదిపదము. అట్లే 'నీ' అనునది, 'నే' అనునది, 'నయ్' అనునది పదము కాదు.

'నయతి' అనునది పదము. నే+అ+తి =అని ఉన్నచోట 'నే' పదము కాదు కనుక నే+అ 'నయ్' గా మారును 'నయతి' అను రూపమేర్పడును. నేऽతి అను రూపమేర్పడదు.

व्याघ्रो मांसमत्ति ।

हरिर्हस्तौ क्षालयति ।

योधः शरान् क्षिपति ।

धनं लभते ।

स्तेनो धान्यं चोरयति ।

नगरं[1] गच्छामि ।

पापं वदसि ।

स्मरसि मित्राणि ।

बुधो मोक्षमिच्छति ।

व्याधयो नरान् पीडयन्ति ।

जलं पिबथ ।

सुवर्णं तोलयावः ।

ग्रामानटावः ।

फले भक्षयामि ।

कमलानि पश्यति ।

भारं वहति किङ्करः ।

प्रज्ञान् वर्णयन्ति जनाः ।

वस्त्रे त्यजति मूर्खः ।

तृणान्यत्त्य[1] श्वः ।

यतिर्देहं मुञ्चति ।

बिडालांस्ता[2]डयति पुरुषः ।

गृहं प्रविशामः ।

---

1. గమనాన్ని సూచించే ధాతువులు సాధారణంగా ద్వితీయా విభక్తిని, కొన్ని మార్లు చతుర్థిని గ్రహిస్తాయి. ఈ రెండువిభక్తులు గమనానికి లక్ష్యమైన ప్రదేశానికి వచ్చును.

1. इ,उ,ऋ,ऌ అను అచ్చులకు అసవర్ణమైన అచ్చులు పరమైనపుడు వరుసగా य,व,र,ल లు. ఆదేశమౌతాయి. (ఇదే యణాదేశ సంధి.)

2. పదం చివరవచ్చే न् తరువాత च,छ,त,थ అనే అక్షరాలు వస్తే నకార పొల్లు అనుస్వారంగానూ విసర్గగానూ మారును. తరువాత విసర్గ సందర్భాన్ని బట్టి ( స్) स् గా మారును. ఉదా - బిడాలాన్ + తాడయతి బిడాలాం+ః ( స్) తాడయతి- బిడాలాంస్తాడయతి.

## సంస్కృతములోనికి అనువదించుము

రాముడు పులులను చూచుచున్నాడు.

గుఱ్ఱములు ధనరాశులను/కోశములను మోయుచున్నవి.

బుద్ధిమంతుడు స్వర్గమును ( గూర్చి ) వెళ్ళును.

సింహములు ఏనుగులను సంహరించుచున్నవి.

అతడు పండ్లను లెక్కించుచున్నాడు.

ముని అరణ్యమునకు వెళ్ళుచున్నాడు.

యోధుడు రెండు బాణములను వదులుచున్నాడు.

దేవుడు మనుష్యులను రక్షించును.

మేము రెండు గ్రామాలలో ప్రవేశించుచున్నాము.

కొడుకు తండ్రిని సంతోష పెట్టుచున్నాడు.

మనుష్యులు తాబేళ్ళను తినుచున్నారు.

కోతులు చెట్లను ఎక్కుచున్నవి.

అతడు సేవకులను అడుగుచున్నాడు.

వారు తమ పాదములను కడుగుచున్నారు.

ఇద్దరు మూర్ఖులు విషమును త్రాగుచున్నారు.

రాజులు దొంగలను దండించుచున్నారు.

వారు పుస్తకములను క్రమంలో పెట్టుచున్నారు.

నీవు వండిన అన్నమును తినుచున్నావు.

రాముడిని అతడి స్నేహితులు తలచుచున్నారు.

ప్రజలు వారి రాజును స్తుతించుచున్నారు.

ప్రజలు ప్రాజ్ఞులను అనుసరిస్తున్నారు.

నేను సత్యమును తెలుసుకొన్నాను.

వేదాలు సూర్యుణ్ణి స్తుతించుచున్నవి.

తండ్రి తన ఇద్దరు పిల్లలను పిలుచుచున్నాడు.

మూర్ఖులు పెద్దలను నిందించుచున్నారు.

రాజు యోధునితో మాట్లాడుచున్నాడు.

ఇకారాంత శబ్దరూపములు

( ద్వితీయా విభక్తి )

| పుంలిఙ్గము | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| | म् | ( ई ) | न् |

ద్వివచనంలో, బహువచనంలోనూ 'న' కారానికి ముందు ప్రాతిపదికము చివరనున్న 'ఇ' కారమునకు దీర్ఘము వచ్చును.

| | | | |
|---|---|---|---|
| | हरिम् | हरी | हरीन् |

నామవాచకములు - పుంలిఙ్గములు

अतिथि అతిథి

अधिपति ప్రభువు

अलि తేనెటీగ, భ్రమరము

बलि దేవతలకు, పితరులకు ఇచ్చు నివేదనము

भिक्षुक బిచ్చగాడు

वायस కాకి

विधि భాగ్యము

व्रीहि ధాన్యము

**कलि** కలహము  **मणि** మణి  **रवि** సూర్యుడు

**किरि** పంది  **राशि** సమూహము, **सारथि** రథసారథి

మాట

**प्र + क्षल्** ( ద.గ. ) కడుగుట

**गण्** ( ద.గ. ) లెక్కించుట, భావించుట

**दा ( यच्छ )** ( ప్ర.గ. ) ఇచ్చుట, సమర్పించుట

**अभि + नन्द** ( ప్ర.గ. ) అభినందించుట, ఇష్టపడుట

**आ + नी** ( ప్ర.గ. ) తీసుకొని వచ్చుట

**अनु + सृ** ( ప్ర.గ. ) అనుసరించుట

**अपि** అవ్యయము  కూడ, అదియును

తెలుగులోనికి అనువదించుము

**वायसो बलिं भक्षयति ।**  नृपतिररीञ्[1] जयति ।

---

1. 'స' కార 'త' వర్గములకు 'శ'కార 'చ'వర్గములతో యోగము ఏర్పడి నపుడు 'శ'కార 'చ'వర్గములు ఆదేశమగును. ( శ్చుత్వ సంధి 'స్తోశ్చునా శ్చుః' అష్టా.8-4-40 )स् > श् , त् > च् , थ् > छ , द् > ज् ,ध >झ, . न् > ञ् అట్లే 'స' కార 'త' వర్గములకు 'ష కార 'ట'వర్గములతో యోగము ఏర్పడినపుడు 'ష'కార 'ట'వర్గములు ఆదేశమగును. ( ష్టుత్వ సంధి " ష్టునా ష్టుః " అష్టా.8-4-41 )  स् > ष् , त् > ट् ,थ> ठ, द> ड्, ध> ढ, ञ> ण

हरिं पीडयति व्याधिः ।
कमलमलीन् प्रीणयति ।
पाणी प्रक्षालयामः ।
कपिं मुञ्चामि ।
मणिं चोरयति स्तेनः ।
व्याधिं न गणायामि ।
उदधिं गच्छावः ।
व्याघ्रः किरीनत्ति ।
ईश्वरो विधिं जयति ।
व्रीहीनुञ्छन्ति भिक्षुकाः ।
कविं जनाः पूजयन्ति ।
कलीन्नाभिनन्दन्ति बुधाः ।

मेघो वारि सिञ्चति ।
रामो रविं नमति ।
असीन्वहन्ति योधाः ।
नृपतिं वर्णयन्ति कवयः ।
यतिं पृच्छन्ति शिष्याः ।
अधिपतीन्किङ्करा अनुसरन्ति ।
ऋषीं नमामः ।
सारथीनाह्वयामः ।
राशिं नयतः ।
गिरी [1] आरोहन्ति ।
अतिथीन्पूजयन्ति ब्राह्मणाः ।

సంస్కృతములోనికి అనువదించుము

కవులు మునులను స్తుతించుచున్నారు.

రాముడు కవులకు నమస్కరించుచున్నాడు.

---

1. ఈ కార ఊ కార ఏ కారాంత ద్వివచన రూపములకు ప్రగృహ్యసంజ్ఞ వచ్చును. ప్రగృహ్యములకు తరువాతి అచ్చుతో సంధి రాదు.

యతి పర్వతమునకు ( పర్వతమును గూర్చి ) వెళ్ళుచున్నాడు.

నేను రెండు కోతులను కొట్టుచున్నాను.

హరి రాసులను తీసుకొని వచ్చుచున్నాడు.

వాడు చేతిని తాకుచున్నాడు.

ఔషధములు రోగములను నివారించుచున్నవి.

వేటగాడు రెండు పందులను చూచుచున్నాడు.

హరి తన శత్రువును కొట్టుచున్నాడు.

యోధుడు ఖడ్గమును విసురుచున్నాడు.

నేను రత్నములను ఇష్టపడు/కోరు చున్నాను.

అతడు సముద్రయానము చేయుచున్నాడు.

మనుష్యుడు అగ్నిలో ప్రవేశించుచున్నాడు.

వాడు సారథులిద్దరిని అడుగుచున్నాడు.

ప్రజలు రాజులను సంతోష పెట్టుచున్నారు.

రాజులు కూడ యతులకు నమస్కరించుచున్నారు.

గుఱ్ఱములు జలమును త్రాగుచున్నవి.

మనుష్యులు బలులను ఇచ్చుచున్నారు.

# ఏడవ పాఠము

## తృతీయా విభక్తి

### 'అ'కారాంత 'ఇ'కారాంత శబ్దరూపాలు

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| పుంలిఙ్గము అకారాంతము | इन | भ्याम् | ऐस् |
| ఇకారాంతము | ना | भ्याम् | भिस् |

'అ'కారమునకు भ्याम् ముందు దీర్ఘము వచ్చును.

| | | |
|---|---|---|
| दण्डेन | दण्डाभ्यां | दण्डैः |
| मणिना | मणिभ्याम् | मणिभिः |

ప్రథమా ద్వితీయా విభక్తులలోతప్ప మిగిలినవిభక్తులలో అకారాంత నపుంసకలిఙ్గశబ్దాలు అకారాంత పుంలిఙ్గశబ్దాలతో సమానరూపములను పొందును.

| | | | |
|---|---|---|---|
| నపుంసకలిఙ్గము | आ | भ्याम् | भिस् |
| ఇకారాంతము | वारिणा | वारिभ्याम् | वारिभिः |

| | | |
|---|---|---|
| अलङ्कार అలంకారము | दण्ड కర్ర | रथ రథము |
| आतप ఎండ | देव దేవుడు | रावण రావణుడు |
| इन्द्र ఇంద్రుడు | नद నదము | नाविक నావికుడు |
| उपहार కానుక | पत्ति కాలిబంటు,పదాతి | कर చేయి |
| विधि విధి | बाण బాణము | श्लोक శ్లోకము |

कासार కొలను　　मन्त्र మంత్రము　　कौशिक విశ్వా-
यजमान యజ్ఞకర్త, యజమానుడు　यत्न ప్రయత్నము　　మిత్రుడు

నపుంసకలిఙ్గములు

अन्न అన్నము　　गोत्र కుటుంబము, వంశము　रत्न రత్నము
अर्घ्य పూజాద్రవ్యము　　चक्र చక్రము　　शरीर శరీరము
इन्धन ఇంధనము　　नख గోరు　　शास्त्र శాస్త్రము
खनित्र గునపము,గడ్డపార　　पुण्य పుణ్యము　　शीर्ष తల
यन्त्र యంత్రము　　सूक्त సూక్తము

విశేషణములు

खञ्ज కుంటి　　प्रभूत చాలా,ఎక్కువగా, అధికముగా

విశేషణాలు తమ విశేష్యాల లిఙ్గవచనవిభక్తులను కలిగి ఉంటాయి. అంటే నామవాచకాలకుండే లిఙ్గవచనవిభక్తులు ఆ నామవాచక విశేషణలకూ వర్తిస్తాయి.

" యల్లిఙ్గం యద్వచనం యా చ విభక్తిర్విశేష్యస్య
తల్లిఙ్గం తద్వచనం సా చ విభక్తిర్విశేషణస్య "

ధాతువులు

ప్రథమ గణము

खन् త్రవ్వుట,　　अव + नम् వంచుట
वि + राज् ప్రకాశించుట, వెలుగొందుట,

अव + गम् తెలుసుకొనుట, प्र + हृ కొట్టుట,

चल् కదలుట    दॄ ( दार् ) ద.గ.[1] చింపుట

అవ్యయము

सह కలసి, తోడ, తోన్

తెలుగులోనికి అనువదించుము

पुरुषः स्तेनं दण्डेन दण्डयति ।    वारिणा हस्तौ क्षालयति ।

शरीरमलंकारैर्भूषयति ।    पाणिभ्यां स्पृशति शीर्षम् ।

नाविका नदेन समुद्रं प्रविशन्ति ।    सिंहो नखैर्गजान् दारयति ।

योधो बाणैररिं जयति ।    बुधः शास्त्रैस्तत्त्वमवगच्छति ।

पादेन खञ्जः ।    अग्निना गृहं दहति ।

पुत्रैः सह[2] ग्रामं गच्छति हरिः ।    पत्तिभिर्गच्छति योधः ।

चक्राभ्यां चलति रथः ।    पादाभ्यां धावन्ति बालाः ।

खनित्रेण खनति ।    पुण्येन हरिं पश्यति ।

---

1. తొమ్మిదవ గణానికి చెందిన दॄ అనే ధాతువు దశమ గణానికి చెందినదిగా కూడ భావించవచ్చును.

2. सह అను అవ్యయము తృతీయా విభక్తిలోని సుబంతరూపముతో ప్రయుక్తమగును.

रामोऽर्घ्येण ऋषिं पूजयति । करेणाह्वयति रामं हरिः ।
कवयः श्लोकैर्नृपं वर्णयन्ति । रामः कपिभिर्जयति रावणम् ।
बुधाः सुखेन जीवन्ति । गोत्रेण कौशिकोऽस्मि ।
नेत्राभ्यां पश्यति जनः । दुःखेन मुह्यति जीवः ।
इन्धनैः पचत्योदनम् ।

సంస్కృతములోనికి అనువదించుము

రాముడు మణులతో తన శరీరమును అలంకరించుకొనుచున్నాడు.
మనుష్యులు ఆహారముతో తమ శరీరములను పోషించుకొనుచున్నారు.
మనుష్యుడు నోటితో మాట్లాడుచున్నాడు.
వారు భారములను తమ తలలతో(మీద) మోయుచున్నారు.
హరి కానుకలతో మునిని సంతోషింపచేయుచున్నాడు.
రాజులు కానుకలతో సంతోషింపచేయుచున్నారు.
రథములు యంత్రములతో కదలుచున్నవి.
బ్రాహ్మణులు సూక్తములతో దేవుని ఆహ్వానించుచున్నారు.
పవిత్రమైన కార్యమునుగూర్చి అతడు దేవుని పూజించుచున్నాడు.
అతడు శ్లోకములతో రాముని ప్రార్థించుచున్నాడు.
మనుష్యుడు తన శత్రువును కత్తితో కొట్టుచున్నాడు.

---

3. अ इ उ ऋ ऌ ల లో ఏ అచ్చైనా ऋకారానికి పూర్వంగా ఉన్నచో సంధి వైకల్పికము. ఋకారానికి పూర్వమున్న దీర్ఘమైన అచ్చు హ్రస్వంగా మారుతుంది. ( 'ఋత్యకః' అష్టా. 6-1-128 )

రాముడు సారథితో ( కలసి )వెళ్ళుచున్నాడు.

సరస్సు కలువలతో అందముగా కనబడుచున్నది.

ప్రజలు చాల మణులతో కూడ సంతృప్తిని చెందరు.

పులి మాంసముతో జీవించుచున్నది.

అతడు తన మనస్సుతో (లో) దేవుడిని స్మరించుచున్నాడు

( చింతించుచున్నాడు).

ఇంద్రుడు (తన) వజ్రాయుధముతో పర్వతములను కొట్టుచున్నాడు.

చెట్లు నీటితో పెరుగుచున్నవి.

కోతులు పండ్లతో సంతృప్తిని చెందుచున్నవి.

వసంతకాలము చెట్ల ఆకులతో అలంకరింపబడుచున్నది.

సరస్సులు సూర్యుని( సూర్యకిరణముల) వలన ఎండిపోవుచున్నవి.

తల భారముతో క్రిందికి వంగుచున్నది.

# ఎనిమిదవ పాఠము

## చతుర్థీ , పంచమీ విభక్తి రూపములు

| **అకారాంత** శబ్దములు | | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|---|
| పుంలిఙ్గములు | చతుర్థీ | य | भ्याम् | भ्यस् |
| | పంచమీ | आत् | भ्याम् | भ्यस् |

నపుంసకలిఙ్గము పుంలిఙ్గము మాదిరిగానే ఉండును.

య కారమునకు ,भ्याम् కు ముందున్న అకారము దీర్ఘమౌతుంది.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| | रामाय | रामाभ्याम् | रामेभ्यः |
| | रामात् | रामाभ्याम् | रामेभ्यः |
| ఇకారాంత శబ్దములు | हरे[1] + ए = हरये | हरिभ्याम् | हरिभ्यः |
| పుంలిఙ్గములు, | हरे + अस् = हरेः[2] | हरिभ्याम् | हरिभ्यः |
| నపుంసకలిఙ్గములు | वारिणे | वारिभ्याम् | वारिभ्यः |
| | वारिणः | वारिभ्याम् | वारिभ्यः |

పుంలిఙ్గములు

अश्वपति ఒకవ్యక్తి పేరు — द्वीप ద్వీపము — लोक ప్రజలు, ప్రపంచము

आचार्य గురువు — निष्क బంగారము

कृषीवल రైతు(కాపు) — पर्वत పర్వతము — वध చావు

कृष्ण కృష్ణుడు — पाप పాపి — वराह పంది

सार्थ యాత్రికుల సమూహము — विनय వినయము

शिखर శిఖరము, శృంగము — क्रोध కోపము — प्रासाद ప్రాసాదము

क्रोश రెండు మైళ్ళు — भृत्य సేవకుడు

---

1. పుంలిఙ్గ శబ్దాల చివరనున్న इ उ అనే అచ్చులకు చతుర్థీ, పంచమీ, షష్ఠీ ఏకవచన ప్రత్యయముల ముందు గుణము వచ్చును.

2. हरे + अस् ఇక్కడ अस् అను ప్రత్యయములోని అకారమునకు ए, ओ ల తరువాత లోపము వచ్చును.

तिल నువ్వులు　　माष మినుములు　　मोदक లడ్డు

सेनापति సేనాపతి　　याचक బిచ్చగాడు　　सैनिक సైనికుడు

నపుంసకలిఙ్గములు

अज्ञान అజ్ఞానము　　जाड्य సోమరితనము　　मौन మౌనము, నిశ్శబ్దము

योजन ఎనిమిది మైళ్ళు　　ज्ञान జ్ఞానము

आकाश ఆకాశము　　आसन ఆసనము　　तारक నక్షత్రము

राज्य రాజ్యము

उद्यान ఉద్యానవనము　　पद అడుగు　　वन వనము

कल्याण క్షేమము, మంచి, కల్యాణము　　पल्वल చిన్నగుంట　　शत వంద

कुसुम పుష్పము　　भोजन భోజనము　　स्वकृत्य తన విధి, తాను చేయదగినది

सिंहासन సింహాసనము　　क्षेत्र క్షేత్రము, భూమి

విశేషణము

मूक మాట్లాడని. మూంగ

ధాతువులు

अधि + गम (ప.గ.)పొందుట

उद् + भू (ప.గ.)పుట్టుట, ఫలించుట

प्रति + दा (ప.గ.)తిరిగి ఇచ్చుట, మార్చి ఇచ్చుట

आ + गम् ( ప్ర.గ.)తిరిగి వచ్చుట

उद् + स्था (तिष्ठ)( ప్ర.గ.) పైకి లేచుట, భజ( ప్ర.గ.) సేవించుట
ఉదయించుట

प्रति + दा ( ప్ర.గ.)మార్చుట, పరివర్తన చేయుట, బదులు ఇచ్చుట

उप + दिश (ష . గ .) నేర్పుట, ఉపదేశించుట , చదువు చెప్పుట

धृ (ద.గ.) పట్టుకొనుట, ధరించుట, ఋణపడి ఉండుట[1]

అవ్యయములు

नमस्[2] నమస్కారము विना లేకుండా स्वस्ति శుభము

తెలుగులోనికి అనువదించుడు

हरिर्ब्राह्मणेभ्यो निष्कान् यच्छति । मनुष्यो ग्रामाय गच्छति ।
कल्याणाय हरिं भजति । फलेभ्यो गच्छति ।

---

1. ఋణపడివుండుటయను అర్థంలో धृ అనే ధాతువు ప్రయోగించి నపుడు ఎవరికి ఋణపడినారో ఆవ్యక్తిని సూచించే పదానికి చతుర్థీ విభక్తి వచ్చును .नृपाय जन: करं धारयति.

2. नम:,स्वस्ति అనే అవ్యయాలతో చతుర్థీవిభక్తి विना తో ద్వితీయా, తృతీయా, పంచమీ విభక్తుల ప్రయోగము వచ్చును.

हरये[1] नृपतिःकुप्यति ।

नगरादा[2] गच्छति ।

अतिथिभ्योऽन्नं यच्छति ।

आसनेभ्य उत्तिष्ठन्त्याचार्याः ।

रवेर्लोकः सुखमधिगच्छति ।

शिष्याय शास्त्रमुपदिशति ।

शिखरात्पतन्ति गजाः ।

भृत्यं क्रोधाद्रामस्ताडयति ।

नमो देवेभ्यः ।

पल्वलेभ्यो वराहा उत्तिष्ठन्ति ।

निष्कान् धारयति रामाय हरिः ।

मोदकेभ्यो बालः स्पृहयति ।

अश्वात्पतति ।

तिलेभ्यः प्रतियच्छति माषान् ।

वधाद्विनारिर्न शाम्यति ।

प्रासादाज्जनं पश्यति नृपः ।

कलिभ्यो दुःखान्युद्भवन्ति ।

द्वीपाद्वीपमटति सार्थः ।

नगरं वनाद्योजनम् ।

स्वस्ति हरये ।

विनयः सुखाय भवति ।

సంస్కృతములోనికి అనువదించుడు

రాముడు భోజనము కొరకు ఇంటికి వెళ్ళుచున్నాడు .

---

1.क्रुध् द्रुह् ईर्ष्या असूय् అనే అర్థాన్నిచ్చు ధాతువులు ప్రయోగించినప్పుడు ఆ భావాలను ఎవరిపట్ల కలిగి వుంటారో ఆ వ్యక్తివాచకశబ్దానికి చతుర్థీవిభక్తి వచ్చును.

2. మృదువ్యంజనంతోగాని , పదము మొదట వచ్చు అచ్చుతోగాని కలిసిన హల్లు( అనునాసికము తప్ప ) తన గణముయొక్క మూడవ అక్షరాన్ని ఆదేశంగాపొందుతుంది.(జస్త్వ సంధి - ఝలాం జశ్ ఝశి అష్టా.8-4-58)

చెట్లనుండి పండ్లు క్రింద పడుచున్నవి.

నేను యాచకులకు ధనము ఇచ్చుచున్నాను.

అశ్వపతికి ( ని గూర్చి ) హరి వందరూపాయలు ఋణపడి ఉన్నాడు.

వివేకి విముక్తికై దేవుని పూజించుచున్నాడు.

సైన్యాధిపతి సైనికులను గ్రామమునుండి గ్రామమునకు కొని[1] పోవుచున్నాడు.

బ్రాహ్మణులు రాజులనుండి ధనమును పొందుచున్నారు.

పర్వతము సముద్రమునుండి రెండుక్రోసుల దూరము ఉన్నది.

హరి పుష్పములకొరకు ఉద్యానవనము వెళ్ళుచున్నాడు.

పాపఫలితమే దౌర్భాగ్యము.(పాపమువలన ఫలము దౌర్భాగ్యము)

దేవతలు స్వర్గమునుండి పాపులను త్రోసివేయుచున్నారు.

రాముడు తన విధులను విడిచి తప్పుదారి పట్టుచున్నాడు.

ఆ రెండు కుప్పలనుండి బియ్యమును తెచ్చుచున్నాడు.

పిల్లలు ఆచార్యులనుండి జ్ఞానమును పొందుచున్నారు.

రాజులు (తమ) రాజ్యములను శత్రువులనుండి రక్షించుచున్నారు.

రాజు సింహాసనమునుండి సైన్యాధిపతితో మాట్లాడుచున్నాడు.

జాడ్యము వలన అతడు ఒక అడుగు గూడ కదలలేడు.

నమ్రతతో అతడు నిశ్శబ్దంగా ఉంటాడు.

---

1. కొన్ని ధాతువులు ద్వికర్మకములు.ఉదా - నీ, ప్రచ్ఛ్, మున్నగునవి.
ఈ ధాతువుల సమానార్థకములగు ధాతువులు గూడ ద్వికర్మకములే .

నేను ఉద్యానవనమునుండి తిరిగి వచ్చుచున్నాను.

రైతు ధాన్యము కొరకు భూమిని దున్నుచున్నాడు.

పుత్రుడు తండ్రినుండి ధనమును పొందుచున్నాడు.

మూర్ఖులు అజ్ఞానముతో ప్రలాపములు చేయుచున్నారు.

వరాహములు కొలనుల ( కొలనులో ) నుండి నీరు త్రాగుచున్నవి.

నక్షత్రములు ఆకాశమునుండి రాలుచున్నవి.

కవులకు స్వస్తి అగుగాక.

## తొమ్మిదవ పాఠము

షష్ఠీ సప్తమీ సంబోధన ప్రథమా విభక్తుల ప్రత్యయములు

| | | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|---|
| అకారాంత శబ్దములు | | | | |
| పుంలిఙ్గము | షష్ఠీ | स्य | ओस् | नाम् |
| | సప్తమీ | इ | ओस् | षु |

నపుంసకలిఙ్గము పుంలిఙ్గము మాదిరిగానే వుంటుంది.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ఇకారాంత శబ్దములు షష్ఠీ | अस् | ओस् | नाम् |
| సప్తమీ | औ | ओस् | षु |

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| షష్ఠీ | रामस्य | रामयोः | रामाणाम् |

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| సప్తమీ | रामे | रामयोः | रामेषु |
| సం.ప్రథమా | हे राम | हे रामौ | हे रामाः |
| షష్ఠీ | हरेः | हर्योः | हरीणाम् |
| సప్తమీ | हरौ | हर्योः | हरिषु |
| సం.ప్రథమా | हरे | हरी | हरयः |
| [illegible]ంతశబ్దములు. షష్ఠీ | वारिणः | वारिणोः | वारीणाम् |
| నపుంసకలిఙ్గము సప్తమీ | वारिणि | वारिणोः | वारिषु |
| సం.ప్రథమా | वारि, वारे | वारिणी | वारीणि |

పుంలిఙ్గములు

अवकाश స్థలము

आचार ప్రవర్తన

खड्ग ఖడ్గము

ग्रीष्म ఎండకాలము

चन्द्र చంద్రుడు

दीप దీపము

सुमन्त्र రామునిరథసారథి

प्रसाद దయ, అనుగ్రహము

धनिक ధనవంతుడు

धर्म విధి,ధర్మము

निधि నిధి

पराक्रम పరాక్రమము

पालक రక్షించువాడు

प्रकाश వెలుతురు

धनपति ధనదేవత, కుబేరుడు

यक्ष కుబేరుని సేవకుడు

वर्ण రంగు,కులము

वास నివాసము

वीर వీరుడు

वृष ఎద్దు

श्वापद మృగము

నపుంసకలిఙ్గములు

औषध మందు

प्रमाणवचन ప్రామాణికవచనము

सौन्दर्य సౌందర్యము

हर्म्य దివ్యభవనము

हिम మంచు

लाङ्गल తోక

युद्ध యుద్ధము

कारण కారణము

चरित జీవనచరిత్రము

चित्त చిత్తము (మనస్సు, బుద్ధి, అహంకారముల కలయిక )

यूथ జంతువులగుంపు

वैर శత్రుత్వము

घृत నెయ్యి

విశేషణములు

आह्लादक సంతోషకరమైన

गर्ह्य దూషింపదగిన

श्रेष्ठ సర్వోత్తమైన, దివ్యమైన

प्रशस्य స్తుతించదగిన

दीर्घ పొడవైన

प्रथम మొట్టమొదటి

चण्ड వేడిగా ఉన్న,ఉగ్రమైన

ధాతువులు

क्षम् (क्षाम्)( చ.గ.) క్షమించుట, మన్నించుట

प्र + रुह् (ప్ర.గ)పెరుగుట.

उप+विश् కూర్చొనుట

అవ్యయము

क्व ఎక్కడ

తెలుగులోనికి అనువదించుము

नराणां पालको नृपः ।

समुद्रस्य जलं लवणम् ।

ईशस्य प्रसादेन जीवामि ।                    शास्त्राणां तत्त्वं प्रज्ञो बोधति ।

वीरयोर्युद्धं भवति ।                    वारीणां निधिरुदधिः ।

कासारे कमलान्युद्भवन्ति ।                    गजानां यूथं चरति ।

ग्रीष्मे सूर्यस्य प्रकाशश्चण्डो भवति । वर्णानां ब्राह्मणः श्रेष्ठः ।

ऋषीणां वचनं प्रमाणम् ।                    शकानां चरितं गर्ह्यम् ।

कवयो लोकेषु वीराणां पराक्रमान् प्रथयन्ति ।

करे पुस्तकं क्वास्ति ।

नगरे जना वसन्ति ।                    रामस्य पुत्रा ग्रामं गच्छन्ति ।

आचार्याः शिष्याणां धर्मं कथयन्ति । वनेषु श्वापदाः सन्ति ।

मनुष्याणामगदेन व्याधयो नश्यन्ति । आसनेषूपविशन्ति ।

रामस्य सारथिः सुमन्त्रो वनं रथं नयति[1] ।

गिरेः शिखराद्वृक्षः पतति ।

चन्द्रस्य प्रकाशो जनानामाह्लादको भवति ।

गिरिषु वसन्ति सिंहाः ।

अरीणां सैनिकान् नृपतिर्जयति ।

योधस्य पाणौ खड्गोऽस्ति ।

धूर्जटौ यतीनां चित्तमस्ति ।

---

1. ఇక్కడ కూడా नी ధాతువు ద్వికర్మకముగా ప్రయుక్తమయినది.

సంస్కృతములోనికి అనువదించుము.

హరికుమారుల ప్రవర్తన స్తుతించుటకు యోగ్యమైనదిగా వున్నది.

ఇండ్లలో దీపములున్నవి.

యక్షులు కుబేరుని యొక్క సేవకులు.

రెండు కోతుల తోకలు పొడవుగా ఉన్నవి.

కవులలో కాళిదాసు మొదటివాడు.

మనుష్యుని సేవకులు గ్రామమునకు వెళ్ళుచున్నారు.

రాజులు రాజగృహములలో నివసించుచున్నారు.

ధనవంతులు భవనములలో నివసించుచున్నారు.

మనుష్యులలో రాముడు గొప్పవాడు.

కాసారముల నీరు ఉప్పగా నున్నది.

పర్వతముల శిఖరములయందు మంచు ఉన్నది.

దొంగ బ్రాహ్మణుని ధనమును దొంగిలిచ్చుచున్నాడు.

నేను ఉద్యానవన సౌందర్యమును చూచి సంతోషించితిని.

(అతడు) చెట్టుయొక్క ఆకును తీసుకొని వచ్చుచున్నాడు.

నావికుల యొక్క వైరమే యుద్ధమునకు కారణము.

మూర్ఖునికి ఔషధము లేదు.

ఓ హరీ!నీ వినయముతో జనులు సంతోషించిరి.

మేఘములు ఆకాశములో కదులును.

యతుల యొక్క నివాసములు అరణ్యములు.

సముద్రములో అనేక రత్నములున్నవి.

ఉద్యానవనంలో పూవులు చెట్ల నలంకరించి యున్నవి.

[illegible]యైన మానవుడు తన బుద్ధిలో కోపమునకు తావివ్వడు.

ప్రభువు పాపులయొక్క పాపములను క్షమించును.

కలువలు నీటిలో పెరుగును.

## అభ్యాసము

### नृप - పుంలిఙ్గము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్రథమా | नृपः | नृपौ | नृपाः |
| ద్వితీయా | नृपम् | नृपौ | नृपान् |
| తృతీయా | नृपेण | नृपाभ्याम् | नृपैः |
| చతుర్థీ | नृपाय | नृपाभ्याम् | नृपेभ्यः |
| పంచమీ | नृपात् | नृपाभ्याम् | नृपेभ्यः |
| షష్ఠీ | नृपस्य | नृपयोः | नृपाणाम् |
| సప్తమీ | नृपे | नृपयोः | नृपेषु |
| సం.ప్ర | नृप! | नृपौ | नृपाः |

### कलि పుంలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | कलिः | कली | कलयः |
| ద్వితీయా | कलिम् | कली | कलीन् |

| | | | |
|---|---|---|---|
| తృతీయా | कलिना | कलिभ्याम् | कलिभिः |
| చతుర్థీ | कलये | कलिभ्याम् | कलिभ्यः |
| పంచమీ | कलेः | कलिभ्याम् | कलिभ्यः |
| షష్ఠీ | कलेः | कल्योः | कलीनाम् |
| సప్తమీ | कलौ | कल्योः | कलिषु |
| సం.ప్ర | कले | कली | कलयः |

वन నపుంసకలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | वनम् | वने | वनानि |
| ద్వితీయా | वनम् | वने | वनानि |
| తృతీయా | वनेन | वनाभ्याम् | वनैः |
| చతుర్థీ | वनाय | वनाभ्याम् | वनेभ्यः |
| పంచమీ | वनात् | वनाभ्याम् | वनेभ्यः |
| షష్ఠీ | वनस्य | वनयोः | वनानाम् |
| సప్తమీ | वने | वनयोः | वनेषु |
| సం.ప్ర | वन | वने | वनानि |

सुरभि విశేషణము. పుంలిఙ్గ - స్త్రీలిఙ్గ - నపుంసకలిఙ్గములు

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | सुरभि | सुरभिणी | सुरभीणि |
| ద్వితీయా | सुरभि | सुरभिणी | सुरभीणि |
| తృతీయా | सुरभिणा | सुरभिभ्याम् | सुरभिभिः |

| | | | |
|---|---|---|---|
| చతుర్థీ | सुरभिणे | सुरभिभ्याम् | सुरभिभ्य: |
| పంచమీ | सुरभिण: | शुरभिभ्याम् | सुरभिभ्य: |
| షష్ఠీ | सुरभिण: | सुरभिणो: | सुरभीणाम् |
| సప్తమీ | सुरभिणि | सुरभिणो: | सुरभिषु |
| సం.ప్ర | सुरभि,सुरभे | सुरभिणी | सुरभीणि |

అభ్యాసము

1. ఈ క్రింద ఇవ్వబడిన అక్షరముల యొక్క సంధులను పేర్కొంటూ వాటి సూత్రములను వివరిస్తూ ఉదాహరణ లివ్వండి.

1. అ, ఇ, ఉ, ఋ, ౡ లకు సవర్ణములు పరమయినప్పుడు.

2. అ, ఆ లకు ఇ, ఉ, ఋ, ౡ పరమయినప్పుడు.

3. అ, ఆ, లకు ఏ, ఐ, ఓ, ఔ లు పరమయినప్పుడు.

4. ఇ ఉ ఋ ౡ లకు ఏ అసమాన అచ్చులైనా పరమయినప్పుడు.

5. పదాంతమునందున్న ఏ, ఓ లకు హ్రస్వ 'అ' పరమయినప్పుడు.

6. ద్వివచనాంతమైన ఈ ఊ ఏ లకు ఏదైనా అచ్చు పరమయినప్పు డు ,లేదా అ, ఇ, ఉ, ఋ, ౡ లకు ఋ కారము పరమయినప్పుడు.

7. పదాంతమైన - మ్ కు వచ్చు మార్పు ఏది ?

8. దంత్యములైన 'స, త, థ, ద, ధ, న' లకు తాలవ్యములైన 'శ, చ, ఛ, జ, ఝ, ఞ' లతో యోగము కలిగినప్పుడు.

9. స, త, థ, ద, ధ, న లకు మూర్ధన్యములైన ష, ట, ఠ, డ, ఢ, ణ లతో యోగము కలిగినప్పుడు.

10 కవర్గాదులలోని అనునాసికం తప్ప ఏదేని హల్లుకు మృదు వ్యంజనము గాని , అచ్చు గాని పరమయినప్పుడు.

11. ర్ ను అనుసరిస్తున్న ర్.

12.' న్' ఎప్పుడు' ణ్' గా మారుతుంది?

13. ఏ పరిస్థితులలో విసర్గ ఓ,ర్,స్,శ్,ష్ లుగా మారుతుంది? ఎప్పుడు విసర్గకు లోపము వస్తుంది?

14.పదాంతములోని 'స్' ఎప్పుడు అనుస్వారంగాను విసర్గ గాను మారును?

15. క్రిందనున్న క్రియాపదములు అవ్యయములు ఏ విభక్తులను నియమిస్తాయి?

అ. గతిని సూచించే క్రియలు.

ఆ. క్రోధము, ద్రోహము, ఈర్ష్య, అసూయలను సూచించే క్రియలు.

ఇ. స్పృహ్ ధాతువు, ఋణపడుట అనే అర్థాన్ని తెలిపే 'ధృ' ధాతువు.

ఈ. సహ, నమః, స్వస్తి, వినా అనే అవ్యయాలు.

16.కొన్ని ద్వికర్మధాతువులను పేర్కొనుము

17. 'అ' కారాంత 'ఇ' కారాంత పుంలిఙ్గ శబ్దములను తగు సంఖ్యలో వ్రాసి అభ్యాసము చేయండి.

కొన్నిముఖ్యమైన అవ్యయములు

अतः అందువల్ల कथम् ఎట్లు,ఎందుకు तदा అప్పుడు

| | | |
|---|---|---|
| अत्र ఇక్కడ | कदा ఎప్పుడు | पुनर् మరల |
| अद्य ఈరోజు | किन्तु కాని | पुरा పూర్వము |
| अधुना ఇప్పుడు | कुतः ఎందువల్ల | यत्र ఎక్కడ |
| यतः ఏకారణమువలన | अपि కూడ | कुत्र, क्व ఎక్కడ |
| इति అని | च మరియు | यथा ఏవిధంగానైతే |
| इत्थम् ఈవిధంగా | चिरम् చాలాకాలము | यदा ఎప్పుడైతే |
| इव వలె | ततः ఆ తరువాత, అక్కడినుండి, | एव అంతమాత్రమే, అంతే. |
| श्वस् రేపటి రోజు | | |
| सुष्ठु మంచిగా,బాగుగా | अतः అందువలన. | |
| तत्र అక్కడ | एवम् ఈవిధంగా | तथा ఆవిధంగా |
| वा [1] లేదా,లేక. | सदा ఎల్లప్పుడు | हे ఓ |
| वृथा వ్యర్థంగా | सर्वत्र అన్నిచోట్ల | ह्यस् నిన్నటి రోజు |

---

1. రెండుపదములను ఒకదాని వెంట మరొకదానిని చేర్చి, ఆ రెండింటిని గూర్చి చెప్పవలసి నప్పుడు లేదా రెండు మూడు పదములను కలిపి చెప్పవలసివచ్చినపుడు च ,वा అను అవ్యయములు చేర్చబడును. హరిశ్చ గోవిందశ్చ లేదా హరిర్గోవిందశ్చ జల్పతః.

# పదవపాఠము

ఆత్మనేపది ధాతువులు - వర్తమానకాలము

ఏకవచనము

| ప్రథమ పురుష, | మధ్యమపురుష, | ఉత్తమపురుష |
| --- | --- | --- |
| ते | से | इ |
| वन्दते | वन्दसे | वन्दे |

ధాతువులు

ప్రథమగణము

ईक्ष् చూచుట, లెక్కలోనికి తీసుకొనుట, శ్రద్ధవహించుట सेव् సేవచేయుట रभ् మొదలు పెట్టుట, ప్రారంభించుట.

वेप् కంపించుట अप + ईक्ष् కోరుకొనుట रम् రమించుట

आशंस् ఆశించుట प्र + ईक्ष् చూచుట यत् ప్రయత్నించుట

शङ्क् శంకించుట परि + ईक्ष् పరీక్షించుట लभ् పొందుట

शिक्ष् నేర్చుకొనుట कम्प् కంపించుట, వణకుట वन्द् నమస్కరించుట

शुभ्(शोभ्) అలంకరించుట, శోభించుట

प्र + काश् ప్రకాశించుట वृत्(वर्त्) వుండుట, వర్తించుట.

श्लाघ् కొనియాడుట, శ్లాఘించుట रुच्(रोच्) ఇష్టపడుట, రుచించుట

भाष् మాట్లాడుట वृध्(वर्ध्) వృద్ధినొందుట सह् సహించుట

षष्ठगणము

मृ[1] (म्रिय्) మరణించుట विद् (विन्द्) పొందుట

చతుర్థ గణము

जन्(जा) జన్మించుట युध् యుద్ధముచేయుట

దశమగణము

अव + धीर् నిందించుట, నీచముగాచూచుట मृग्[2] వెదకుట

नि + सूद्(निषूद्)నాశనముచేయుట.

నామవాచకములు

| | |
|---|---|
| अध्ययन న.అధ్యయనము | पारितोषिक న.బహుమానము |
| प्रबल వి.బలమైన, గట్టిదైన | असंख्येय వి.లెక్కలేనన్ని |
| प्रायः అ.సామాన్యంగా | असत्य న.అబద్ధము |
| बिम्ब న.మండలము,బింబము | अस्त्र అస్త్రము (మంత్ర |
| चाप పుం.చాప | పూర్వకముగా ప్రయోగించు ఆయుధము. |
| अर्चन న.పూజ | (అస్-విసరివేయుట.) |

---

1.6వ గణానికి చెందిన ऋ కారాంత ధాతువుల చివరి ఋకారము रि గా మారును.కావికరణప్రత్యయం అయిన अ కారముతో కలిసి ఇది रिय గా మారును. उदा - दृ> द्रिय , पृ >प्रिय.

2.ఈ ధాతువు ఆత్మనేపదియే. ఈ సందర్భంలో అచ్చుకు (ఋకారమునకు) గుణము రాదు.దశమగణధాతువులు ఉభయపదులు.

भय న.భయము
भक्त పుం.భక్తుడు
उद्गम పుం.పుట్టుకొనివచ్చుట, దృష్టిగోచరమగుట
उद्यम పుం.ప్రయత్నము
मणिकार నగలవ్యాపారి
ध्यान న.ధ్యానము
मास పుం.నెల
क्लेश పుం.నొప్పి,మితిమీరినబాధ
लाभ పుం.లబ్ధిపొందుట
दण्ड పుం.శిక్ష
वात పుం.వాయువు
दुराचार పుం.చెడుప్రవర్తన
विश्वामित्र పుం.ఒక ముని పేరు
शासन న.ఆజ్ఞ, శాసనము.
सदाचार పుం.మంచి ప్రవర్తన
नारायण పుం.మనుష్యుని పేరు.
शुक्लपक्ष పుం.శుక్లపక్షము.
न्याय పుం.తత్త్వశాస్త్రభాగము, న్యాయశాస్త్రము(తర్కము)
नाश పుం.నాశనము,నష్టము
स्नेह పుం.వాత్సల్యం, మైత్రి.
स्वास्थ्य న.స్వస్థత,ఆరోగ్యము

తెలుగులోనికి అనువదించుము

देवं वन्दे ।
भयं शङ्कसे।
भयाद्वेपते हृदयम् ।
सूर्यः प्रकाशते ।
व्याधो म्रियते ।
असत्यं भाषसे ।
हरेरुद्यमं श्लाघे ।
पुस्तकानि मृगयसे ।

वीरोऽरिं निषूदयते । मोदको बालकाय रोचते[1] ।

कट: कुत्र वर्तते । मणीन्परीक्षते मणिकार: ।

पुत्रस्य लाभेन मोदते । बुधो मोक्षं लभते ।

हे राम! सुष्ठु शोभसे विनयेन । ज्ञानात्सुखं जायते ।

नारायणे रामस्य स्नेहो वर्धते । जनानां कल्याणाय नृपो यतते।

आचार्यं शिष्य: सेवते । विश्वामित्रादस्त्राणि शिक्षते राम: ।

सदाचारेण मनुष्य: स्वास्थ्यं लभते ।पुत्रस्य दुराचारात्सुखं नाशंसे ।

देवानामर्चनमारभे । ईश्वरस्य ध्याने रमे ।

प्रबलेनापि वातेन पर्वतो न कम्पते ।

సంస్కృతములోనికి అనువదించుము

నేను న్యాయశాస్త్రాధ్యయనము ఆరంభించాను

(మీరు) నొప్పిని సహించుచున్నారు.

కృష్ణుడు పిల్లలతో ఆడుచున్నాడు.

చెట్టు కంపించుచున్నది.

(నీవు) రాజును సేవించుము.

---

1. రుచ్ అనే ధాతువును ఆ అర్థాన్నిచ్చే ఇతర ధాతువులను ప్రయోగించి నపుడు ఆ వస్తువు ఇష్టమగువ్యక్తిని తెలుపు శబ్దము చతుర్థీ విభక్తిలో ప్రయోగించబడును.

('రుచ్యర్థానాం ప్రీయమాణః' అష్టా.1-4-33)

(నేను) ధనమును పొందినాను.

అతడు ఋషులకు నమస్కరించుచున్నాడు.

(ఒక) యోధుడు తన శత్రువులతో పోరాడుచున్నాడు.

(నీవు) ఒకే బహుమానమును కోరుచున్నావు.

(నేను) స్నేహితుల క్షేమము యెడల (సంతోషించుచున్నాను)

అభినందించుచున్నాను.

మూర్ఖుడు రాజుయొక్క ఆజ్ఞను అలక్ష్యము చేయుచున్నాడు.

(నేను) ఒక కోతిని చూచుచున్నాను.

రాముడు అసంఖ్యాకమైన సంపదలతో వెలుగొందుచున్నాడు.

దేవుని భయం వలన (అతడు) అబద్ధమును మాట్లాడడు.

చంద్రబింబము శుక్లపక్షమున కాంతితో వృద్ధినొందును.

(ఒక) పాపి తనమిత్రులను కూడ శంకించును.

(ఒక) చెట్టు పండ్లతో అందముగా కనబడుచున్నది.

పాపము యొక్క ఫలితము ఆత్మనాశనము.

అతడురత్నములను వెదకుచున్నాడు.

సామాన్యంగా మానవుడు ధనము కొరకు ప్రయత్నించుచున్నాడు.

భక్తుడు దేవుని పూజను ఇష్టపడుతాడు.

నేను శిక్షయొక్క భయము వలన వణుకుచున్నాను.

నేను ఆచార్యుని నుండి ధర్మమును నేర్చుకొను చున్నాను.

కవి రాజును శ్లాఘించు చున్నాడు.

నేను శత్రువులయొక్క బాణములతో చచ్చెదను.

# పదకొండవపాఠము

ద్వివచనము, బహువచనము.

| | ప్రథమపురుషము | మధ్యమపురుషము | ఉత్తమపురుషము. |
|---|---|---|---|
| ద్వివచనము. | इते | इथे | वहे |
| బహువచనము | अन्ते | ध्वे | महे |

'అ'కారాదియగు ప్రత్యయమునకు ముందుగా వచ్చు 'అ' కారము లోపించును. ప్రథమ, షష్ఠగణముల చిహ్నం 'అ' కారము

वन्द् +अ + अन्ते = वन्दन्ते ।

పరస్మైపదములో వలెనే 'వ'కార,' మ' కారాదులగు ప్రత్యయముల ముందున్న 'అ' కారమునకు దీర్ఘము వచ్చును.

वन्द् +अ +वहे =वन्दावहे, वन्द् +अ +महे=वन्दामहे.

| | | | |
|---|---|---|---|
| ద్వివచనము | वन्देते | वन्देथे | वन्दावहे |
| బహువచనము | वन्दन्ते | वन्दध्वे | वन्दामहे |

ఆత్మనేపది ధాతువులు

ప్రథమగణము

कत्थ् ముఖస్తుతిచేయుట, పొగడుట क्षम् క్షమించుట

प्र + गल्भ् ప్రగల్భములు, डी (डय्) ఎగురుట

గొప్పలు చెప్పుట

भिक्ष् యాచించుట

याच् భిక్ష మెత్తుట (యాచించుట)

स्पन्द् అదురుట, స్పందించుట

स्मि (स्मय्) నవ్వుట

वि + स्मय् ఆశ్చర్యపడుట

स्वाद् రుచిచూచుట

చతుర్థగణము

अनु + रुध् అణగినడచుకొనుట

దశమగణము

अभि + वाद् నమస్కరించుట, గౌరవించుట.

నామవాచకములు

अपराध పుం.నేరము

वसन्त పుం.వసంతకాలము

दिवा అవ్య.పగలు

आम्र న.మామిడి

वातायन న.కిటికీ,సోరణగండ్లు

तण्डुल పుం.బియ్యము

अभ्युदय.పుం.అభివృద్ధి,అభ్యుదయము

वाक्य న. వాక్యము

द्रव्य న.ధనము

आराधन న.ఆరాధనము

निर्देश పుం.మార్గదర్శకత్వం,నిర్దేశము

उद्योग పుం.యత్నం, ఉద్యోగము

विहग పుం.పక్షి

वैयात्य నపుం.మొరటుతనము

भोग పుం. సుఖానుభవం, విషయాసక్తి

शस्त्र న.ఆయుధము

नृत्य న.నాట్యము

भङ्ग పుం.చెరపడం, పగలడం

उपालम्भ పుం.ఎత్తిపొడుపు మాట నిర్లక్ష్యవర్తనము

विविध వి.అనేకవిధములైన

कपट న.మోసము (వంచన)

**मयूर** పుం. నెమలి

**गात्र** న.అవయవము

**संसार** పు. ప్రపంచము

**गायक** పుం.పాటగాడు,గాయకుడు

**गुण** పుం.యోగ్యత గుణము

**स्वीय** విణ.తనదైన

सङ्गीत న. సంగీతము

वचनीयన. ఆక్షేపించదగినది

गान న.పాట

सत्य న.సత్యము

चातुर्य వి.చాతుర్యము

हितकर వి.హితకరము

తెలుగులోనికి అనువదించుము

मोदकान् स्वादन्ते ब्राह्मणाः ।

स्वीयान् गुणान् कथ्येथे।

वृथा प्रगल्भध्वे ।

कपटं शङ्केथे ।

मूर्खाणां वैयात्यं न सहामहे।

आचार्यस्य निर्देशमनुरुध्यध्वे ।

रामस्य नयने स्पन्देते ।

कृष्णस्य चातुर्येण विस्मयन्ते जनाः।

दिवा तारकाणि न प्रकाशन्ते ।

सत्यं हितकरं च वाक्यं भाषन्ते प्रज्ञाः।

शासनस्य भङ्गं न क्षमन्ते नृपतयः ।

वातेन वृक्षाः कम्पन्ते ।

धनिकं द्रव्यं याचेते भिक्षुकौ ।

उद्योगाद्धनं लभध्वे ।

बुधा मोक्षं विन्दन्ते ।

मित्राणामभ्युदये नरा मोदन्ते ।

वृक्षेषु कुसुमानि वर्तन्ते ।

भृत्यानामपराधान् क्षमामहे ।

आकाशे विहगा डयन्ते ।

देवस्याराधनाय गानमारभामहे।

पापा न वचनीयमीक्षन्ते ।

मोक्षाय यतन्ते बुधाः ।

गायकात् सङ्गीतं शिक्षावहे ।

देवान् भोगान् भिक्षन्ते नराः ।

సంస్కృతములోనికి అనువదించుము.

(మేము) వసంతకాలమునందు ఫలములను పొందుచున్నాము.

(నీవు) అసత్యమును మాట్లాడుచున్నావు.

పర్వతములు చలించుట లేదు.

నక్షత్రములు ప్రకాశించుచున్నవి.

నీవు నాట్యము నేర్చుకొనుచున్నావు.

నారాయణుని యొక్క ఇద్దరు మిత్రులు క్షేమంకొరకు ప్రయత్నించుచున్నారు.

మేమిద్దరము రాజును సేవించుచున్నాము.

మీరిద్దరు మామిడి పండ్లను రుచి చూచుచున్నారు.

మేము భవనంపైన నెమలిని చూచుచున్నాము.

పులులు చెట్ల ఆకులను గడ్డిని ఆస్వాదించవు.

మేమిద్దరము ఋషికి నమస్కరించుచున్నాము.

సుఖదుఃఖములు ప్రపంచంలో ఉన్నవి.

మీరిద్దరు కారణములేకుండా కలహించుచున్నారు.

ఇద్దరూ పిల్లలు ఉద్యానవనంలో క్రీడించుచున్నారు.

మేమిద్దరము హరివలన మంచిని కోరుచున్నాము.

మీరిద్దరు మీస్నేహితులయొక్క తప్పులను క్షమించుచున్నారు.

వారు పూజ్యుని యొక్క గుణములను ప్రశంసించుచున్నారు.

పాపము వలన దుఃఖము కలుగుచున్నది.

మానవులు చనిపోవుదురు.

బిచ్చగాళ్లు అన్నము కొరకు యాచించుచున్నారు.

చిలుకలు వాతాయనమువైపు ఎగురుచున్నవి.

మనుష్యులు ప్రయత్నములయొక్క ఫలితమును పొందుచున్నారు.

మూర్ఖుని యొక్క వివిధ అంగములు వృద్ధిచెందును. బుద్ధి పెరగదు.

మేమిద్దరము శత్రువుల ఉపాలంభనమును సహించుచున్నాము.

వీరులు శత్రువులను బాణములతో చంపుచున్నారు.

# పన్నెండవపాఠము

## ధాతువులు - విశిష్టప్రయోగాలు.

### కర్మణి[1], భావే ప్రయోగాలు

ధాతువునకు य అను ప్రత్యయమును చేర్చడం వలన కర్మణి ప్రయోగరూపాలు ఏర్పడును. కర్మణిప్రయోగంలో ధాతువుకు

---

1.కర్మణి ప్రయోగరూపాల విషయంలో ఆయాగణాలకు చెందిన వికరణ ప్రత్యయము చేర్చనక్కరలేదు. అన్ని ధాతువుల నుండి కర్మణి ప్రయోగాల రూపాలను ఒకేవిధంగా ఏర్పరచవచ్చును. కఠినమైన కొన్ని ధాతువుల కర్మణి ప్రయోగ రూపాలను తెలుసు కోవడం ప్రారంభములో విద్యార్థికి సులభము కాదు. . ఆదేశాలుగాక మూలధాతువులు ఉదా-गम्, स्था మొదలగు వానికి మాత్రమే కర్మణి ప్రయోగానికి సంబంధించిన 'य' ప్రత్యయంచేర్చడం జరుగుతుంది. ఉదా -गम्यते, स्थीयते (అకర్మక ధాతువులకు కర్మణి ప్రయోగాలను భావే ప్రయోగాలని అంటారు.

ఆత్మనేపదప్రత్యయాలు మాత్రమే చేర్చబడును. त्यज् + य + ते= त्यज्यते, त्यज्यसे,त्यज्ये మొదలుగునవి. ఒక ధాతువు" ఋ" కారాంతమై అది సంయుక్తాక్షరమునకు పరముగా లేనప్పుడు ఆ 'ఋ' కారము కర్మణిప్రయోగంలో रि గా మారును.

ఉదా - कृ > क्रियते

ధాతువు చివర వచ్చు హ్రస్వ 'ఇ 'కార, 'ఉ 'కారములు 'య' కారము ముందు దీర్ఘమౌతాయి.ఉదా - जि >जी = जीयते, श्रु> श्रूयते

ధాతువులు

| | | |
|---|---|---|
| प्र + अर्थ అడుగుట | आ + दिश् ఆదేశించుట | रुद् ఏడ్చుట |
| कृ చేయుట | पठ् ప్ర.గ.ప.ప. చదువుట | श्रु వినుట |
| ज्ञा తెలుసుకొనుట | पा(पी) త్రాగుట | हन् చంపుట |
| स्था (स्थी) నిలబడుట | दा[1] (दी) ఇచ్చుట | |

నామవాచకములు

| | |
|---|---|
| आदेश పుం.ఆదేశము | ध्वनि పుం.శబ్దము |
| काष्ठ న.కట్టె, కఱ్ఱ | पौर పుం.నాగరికుడు, పౌరుడు |

---

తెలుగు భాషలో భావే ప్రయోగాలు లేవు, కర్మణి ప్రయోగాలు కూడా తక్కువ. )

1.కర్మణి ప్రయోగములలో ధాతువులకు వచ్చు మార్పులను కుండలిలో చూపించడం జరిగింది.

**घाप** పుం.బాణము　　**प्राज्ञ** పుం.తెలివికలవాడు

**छात्र** పుం.విద్యార్థి, శిష్యుడు

తెలుగులోనికి అనువదించుము

| | |
|---|---|
| निष्का ब्राह्मणेभ्यो दीयन्ते । | नृपतेरादेशः क्रियते । |
| अग्निना काष्ठं दह्यते । | शठौ पुरुषैस्ताड्येते[1] । |
| आचार्यैर्धर्म उपदिश्यते । | भृत्यैः सेव्यसे । |
| मित्रैस्त्यज्ये । | जनैर्दृश्यामहे । |
| व्याधिभिः पीड्यध्वे । | प्रेक्ष्यसे जनेन । |
| पुत्रैः पूज्येथे । | धान्यस्य राशयो नीयन्ते । |
| तत्त्वं बुध्यते प्राज्ञैः । | नृपेणारयो जीयन्ते । |
| बालकै[2] रुद्यते । | सारथी हन्येते । |

---

1. పరవగణంలో కర్తరి ప్రయోగంలో ఏధాతువుల చివరి అచ్చులు, గుణ వృద్ధి పరిణామాలను పొందుతాయో అవి కర్మణి ప్రయోగంలో 'యకార చిహ్నము' ముందు అదే మార్పు పొందుతాయి.

2. अ,आ, తప్ప తదితరములైన అచ్చులు విసర్గకు ముందు వచ్చినచో, విసర్గ తరువాత ఒక అచ్చుగాని, మృదువ్యంజనముగాని వచ్చినచో ఆ విసర్గ र् గామారును. ర్ కు ర్ పరమయినప్పుడు మొదటి ర్ కు లోపము వచ్చి, అంతకుముందున్న అచ్చు హ్రస్వమయినచో దానికి దీర్ఘము వచ్చును.

ऋषयो जनेन वन्द्यन्ते । सूर्येण प्रकाश्यते ।

ईश्वरेण भूयते । लोकैः प्रशस्यध्वे[1] ।

शिष्यैर्नम्यावहे । मोदकाः स्वाद्यन्ते बालैः ।

छात्रैः श्लोकाः पठ्यन्ते । ओदनः पच्यते सूदैः ।

देवो वन्द्यते ।

( అభ్యాసము - పై వాక్యములను కర్తరి ప్రయోగము లోనికి మార్చండి)

సంస్కృతములోనికి అనువదించుము

శత్రువు బాణముతో చంపబడినాడు.

శిశువు యొక్క చేతులు నీటిచే కడగబడినవి.

(నీవు) కవులచే ప్రశంసింపబడితివి.

(నీవు) మనుష్యుల చేత వెతకబడితివి.

(నేను) సేవకులతో సేవించబడితిని.

(మేము) దేవునిచే రక్షింపబడితిమి.

(మీరిద్దరు) ప్రజలచేత తెలిసికొన బడితిరి.

ఏనుగులు ఆరోహింపబడుచున్నవి.

మేమిద్దరము నాగరికులచే అర్థింపబడితిమి.

ఈప్రపంచము యోగులచే త్యజింపబడినది.

---

1. కర్మణి ప్రయోగం చేసినప్పుడు ధాతువునకు ఉపధలో వున్న న్ గాని, అనుస్వారం గాని 'య' కార చిహ్నమునకు ముందు లోపించును. దీనికి అపవాదం కొన్ని చోట్లకలదు प्रशंसति प्रशंस्यते ।

శరీరము ఆహారముతో పోషింపబడినది.

గోవుగుజ్జములు దొంగలచేత దూరముగా తీసుకొని పోబడుచున్నవి.

సస్యరాశులు కూర్చి పేర్చ బడుచున్నవి.

విష్ణుని యొక్క శరీరము (హారములచే) ఆభరణములచే అలంకరింపబడినది.

నీరు చెట్లపై చల్లబడుచున్నది.

వివేకవంతుని యొక్క గుణములు కవులచే ప్రశంసింపబడినది.

శబ్దము వినబడుచున్నది.

దొంగలు రాజుచే దండింపబడుచున్నారు..

ఫలములు హరిచే తినబడినవి.

రెండు బాణములు వదలబడునవి.

నీవు రాజులచే ఆదేశింపబడితివి.

మానవులచేత ఎల్లప్పుడు సంతోషము కోరబడినది.

సముద్రజలములు త్రాగబడుటలేదు.

దేవతలు మంచి ప్రవర్తనతో ప్రీతినిపొందిరి.

సేనాధిపతిచే సైనికులు లెక్కింప బడుచున్నారు.

సామాన్యఫలితము - పరీక్ష

स्मि ఆ. ప. - నవ్వుట

వర్తమానకాలము

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర.పు. | स्मयते | स्मयेते | स्मयन्ते |

| | | | |
|---|---|---|---|
| మ.పు. | स्मयसे | स्मयेथे | स्मयध्वे |
| ఉ.పు. | स्मये | स्मयावहे | स्मयामहे |

కర్మణిప్రయోగం -श्रु వినుట

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర.పు. | श्रूयते | श्रूयेते | श्रूयन्ते |
| మ.పు | श्रूयसे | श्रूयेथे | श्रूयध्वे |
| ఉ.పు | श्रूये | श्रूयावहे | श्रूयामहे |

అభ్యాసము

1.కర్మణి ప్రయోగములో ఆరవగణంలో ధాతువులకు చివరలో వున్న ऋ కారమునకు ఎట్టి మార్పు వచ్చును ? ఇటువంటి మార్పు మరొక చోట ఎచట వచ్చును?

2. కర్మణి ప్రయోగచిహ్నమైన य కారమునకు చేర్చుటకు పూర్వము ధాతువు చివరలోవున్న ప్రస్వమైనఅచ్చునకు ఎట్టి మార్పువచ్చును? स्था-दा-पा ధాతువులలోని చివరి అకారము కర్మణి ప్రయోగంలో ఎట్టి మార్పు చెందును? పదవగణంలోని ధాతువులను కర్మణిప్రయోగం లోకి మార్చినపుడు ఏమిచేయవలెను?.

3. वृध् ( ప్ర. గ ) - मृ (ష. గ ) వంటి ఆత్మనేపదధాతువులు వర్తమాన కాలరూపములను సాధ్యమైనన్ని వానిని చూపించుము.

4. रच् ధాతువు దానితో సమానార్థకాలైన ధాతువులు ఏవిభక్తితో ప్రయుక్తములగును. ఉదాహరణము ఇమ్ము.

5. गम् - दृश् - स्था మున్నగు ధాతువుల కర్మణి ప్రయోగములను సాధ్యమైనన్నింటిని వ్రాసిచూపించవలెను.

6. నిపాతములలో च,वा ఈ రెండింటియొక్క ప్రయోగములను చూపించుము.

పరిశిష్టము

## కర్మణి ప్రయోగములు -భావే ప్రయోగములు

పై పాఠములో కర్మణి, భావే ప్రయోగములు వర్తమాన కాలము ( లట్ )లోచూపించ బడినవి. అనద్యతన భూతకాలము (లఙ్ ), ఆజ్ఞార్థకము( లోట్ ), విధ్యర్థకము( విధి లిఙ్ ) ఈ మూడు ల కారము లలో గూడా కర్తరి ప్రయోగములు ఆత్మనే పద, పరస్మై పదములలో మునుముందు చూపించ బడుచున్న. దానికి అనుగుణముగా అభ్యాస ములు, వాక్య ప్రయోగములు కూడా ఇవ్వబడుచున్నవి. ఈ మూడు ల కారముల కర్మణి ప్రయోగ స్వరూపము కూడా విద్యార్థికి తెలిసి ఉండుట కొరకు ఇక్కడ ఆ రూపాల పట్టిక పొందు పరచడమైనది.

వర్తమాన కాల కర్మణి ప్రయోగము వలెనే ఈ మూడు ల కారములలో గూడ "య" అనే గుర్తును చేర్చవలెను. ఆ యా వికరణ ప్రత్యయము ( అ, ఉ, అ,అయ్ ) లను చేర్చగాదు. ఆ యా ల కారములలో ఆత్మనేపదప్రత్యయములను చేర్చవలెను. అనద్యతన

భూతకాలంలో కర్తరిప్రయోగములో వలెనే ధాతువునకు ముందు "అ"కారమును చేర్చవలెను. ధాతువులలో యథాపూర్వము గమ్, నీ, స్థా, ముద్, దా, భూ, సృ,హృ వంటి మూల రూపములనే కర్మణి ప్రయోగములో గ్రహించ వలెను. గచ్ఛ్, నయ్, తిష్ఠ్ మోద్, యచ్ఛ్, భవ్, సర్, హర్ వంటి పరివర్తిత రూపములను గ్రహించ రాదు.

1. అనద్యతన భూతకాలము ( లఙ్ )

अ + गम् + य +त -

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర . పు | अगम्यत(त) | अगम्येताम् (इताम् ) | अगम्यन्त (अन्त) |
| మ. పు | अगम्यथा:(था:) | अगम्येथाम्(इथाम्) | आगम्यध्वम्(ध्वम्) |
| ఉ. పు | अगम्ये(इ) | अगम्यावहि(वहि) | अगम्यामहि(महि) |

2.ఆజ్ఞార్థకము -( లోట్ )

गम्+ य + ताम् -

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర . పు | गम्यताम्(ताम्) | गम्येताम्(इताम्) | गम्यन्ताम्(अन्ताम्) |
| మ . పు | गम्यस्व(स्व) | गम्येथाम्(इथाम्) | गम्यध्वम्(ध्वम्) |
| ఉ . పు | गम्यै(ऐ) | गम्यावहै(आवहै) | गम्यामहै(आमहै) |

5.విధ్యర్థకము. (విధి లిఙ్)

गम् + य+ ईत-

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర.పు | गम्येत(ईत) | गम्येयाताम्(ईयाताम्) | गम्येरन्(ईरन्) |
| మ.పు | गम्येथा:(ईथास्) | गम्येयाथाम्(ईयाथाम्) | गम्येध्वम्(ईध्वम्) |
| ఉ.పు | गम्येय(ईय) | गम्येवहि(ईवहि) | गम्येमहि(ईमहि) |

గమనిక :- ఏచోట ధాతువునకు వికరణ ప్రత్యయములు చేరునో దానిని "సార్వధాతుకము"అనియు, అట్లు వికరణ ప్రత్యయములు చేరని ప్రయోగమును "ఆర్ధధాతుకము" అని గ్రహించ వలెను. కర్మణి ప్రయోగములు "ఆర్ధధాతుకము" లు.

అభ్యాసము

स्था, दा, त्यज्, जीव्, मुद्, जन्, गण्, चुर्, अनु+भू, अधि+गम्, उद्+भू, वि+जि, परि+नी ధాతువులకు పై మూడు లకారములలో కర్మణి ప్రయోగరూపములను వ్రాయుడు.

గమనిక - ఉపసర్గలో కూడుకొని ఉన్న ధాతువును అనద్యతన భూతకాలములో ప్రయోగించినప్పుడు ఆ ల కారములో ధాతువుకు ముందు చేర్చ వలసిన"అ"కారమును ముందు గా చేర్చి ,దానికి ముందు ఉపసర్గ చేర్చవలెను. ఉపసర్గ + 'అ"కారము +ధాతువు

ఉదా :- अधि + अ + गम् +य+त = अध्यगम्यत

తెలుగులోనికి అనువదించుడు

धान्यस्य राशयोऽनीयन्त । मार्गमादिश्यथाः ग्राम्यजनैः ।

रामेण रावणः अहन्यत। भक्तेन प्राथ्यर्त देवः ।

मया त्वं उपाक्रियथाः । शब्द इव अश्रूयत ।

भृत्यैरसेव्ये । श्लोकैः यूयं प्राशंस्यध्वम् ।

अनिन्द्यावहि धूर्तैः विना कारणम् ।

प्राज्ञैरपि तत्त्वं नाबुद्ध्यत ।

पृथ्वीराजेन बाह्वोर्बलेन पृथिवी अजीयत ।

आवां रक्षकदलेन चोरेभ्यः अरक्ष्यावहि ।

इदमासनमास्यताम् ।

प्रियैः रम्यन्तां कान्ताः ।

कृषीवलैः कृषिकर्मारभ्यताम् ।

पितृभ्यां पुत्राणामविनयः न सह्यताम्।

युवां मुनेः क्रोधाग्निना मा दह्येथाम्।

अहं पण्डितैः उपादिश्यै।

वयं तु शठैर्न प्रतार्यामहे ।

अलकापुरी यक्षेश्वराणां वसतिः मेघेन गम्येत ।

वानरैः सेतोः बन्धनं क्रियेत ।

यूयं अमेरिकादेशीयैः प्रशंस्यध्वम् ।

वयं तु भारतीयैः न प्रशंस्येमहि ।

कम्प्यूटर्यन्त्रं आज्ञप्यतां चालकैः ।

यन्त्रभाषारूपेणापि संस्कृतस्य उपयोगः अभिवर्ध्यताम् ।

अस्माभिः कालः एवं याप्यताम् ।

विपत्तावपि धीरेण न मुह्येत धर्मो वा न परित्यज्येत ।

युवां बालकौ मार्गे मा प्रतार्येयाथाम् । ( प्रतारण న.వంచన)

संस्कृतपरिषत् विदुषां संस्कृतप्रेमिणां च साहाय्येन अग्रे प्रस्थीयेत ।

సంస్కృతములోనికి అనువదించుడు

నిన్నటి రోజు ఆహారము ఇంటిలోనికి తీసుకొనిపోబడెను.

మధువనములో వానరములచేత ఫలములు భక్షింపబడెను

మీ ఇద్దరి చేత కొబ్బరినీరు త్రాగబడెను.

మొన్నటిరోజు రెండుచెట్లు గాలికి ఉన్మూలింపబడెను( పెరికి వేయబడెను).

గ్రీష్మర్తువులో గోదావరిలో ఇద్దరు బాలురచేత ఈతకొట్టబడెను.

మీరు యజమానిచేత దండించబడితిరి.

మేము గతమాసములో ముష్కరులచేత వంచింపబడితిమి.

నన్నయభట్టుచేత త్రిమూర్తులు స్తుతింపబడిరి.

'పరమేశా ! గంగనిమ్ము ' అని శివుడు శ్రీనాథునిచే ప్రార్థింపబడెను.
కవి చేత అంధుడు కౌరవపతి యని పరిహసింప పడు గాక!
చిత్రకారునిచే సుందర చిత్రము చిత్రించ బడుగాక
గురువులు శిష్యులచేత వందనము చేయబడెదరు గాక !
వికటకవి వేములవాడ భీమకవి చేత మోదకములు కప్పలుగా మార్చబడెను.
హాస్యకవి తెనాలిరామకృష్ణుని చేత ప్రౌఢప్రబంధము రచించబడెను.
మీరు ధర్మము చేత రక్షింపబడెదరు గాక !
రామరావణయుద్ధముచేత విభీషణుండు రక్షింపబడెను.
శివభక్తి ధూర్జటి పల్కులచేత దేశములో ప్రచారము చేయబడెను.
ఆధునికయుగము విశ్వనాథయుగము ' అని ప్రశంసింపబడుగాక!
ఈ కర్మఫలము మా ఇద్దరిచేత అనుభవించబడుగాక !
రెండు స్వాదుఫలములు మీ ఇద్దరిచేత ఆస్వాదించబడుగాక !
విద్యావంతుల విద్య మహత్త్వమునొందుగాక !

# పదమూడవపాఠము

ఆకారాన్త, ఈకారాన్త స్త్రీలిఙ్గ శబ్దములు - ప్రథమా, ద్వితీయా విభక్తులు.

| ఆకారాన్తము | ఏ | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్రథమా | --- | ई | अस् |

| | | | |
|---|---|---|---|
| ద్వితీయా | आम् | ई | अस् |
| ప్రథమా | रमा | रमे | रमा: |
| ద్వితీయా | रमाम् | रमे | रमा: |

ఈకారాన్తము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | --- | औ | अस् |
| ద్వితీయా | म् | औ | इस् |
| ప్రథమా | नदी | नद्यौ | नद्य: |
| ద్వితీయా | नदीम् | नद्यौ | नदी: |

స్త్రీలిఙ్గములు

अरुन्धती బ్రహ్మర్షి వశిష్ఠుని భార్య. कथा కథ
क्षमा ఓర్పు आज्ञा అనుమతి कन्या కూతురు,బాలిక
गङ्गा గంగానది नारी స్త్రీ कला కళ
जननी తల్లి पत्नी భార్య कुमारी కన్య, పడుచు
नटी ఆటకత్తె पृथ्वी భూమి मही భూమి
नदी నది प्रजा ప్రజలు,సంతతి माला దండ,మాలిక
शोभा అందము वापी బావి रजनी రాత్రి
लज्जा సిగ్గు सखी చెలికత్తె लता తీగ
सहचरी తోటిఆడది, సఖి ललना ఆడది

आत्मीय విణ. తనది, తనకు చెందినది

प्रसाद పుం.రాజగృహం

प्रासादतल న. రాజగృహపు ఉపరి భాగము, మిద్దె

आधार పుం.ఆధారము

बल న.సైన్యము

आरम्भ పుం.ఆరంభము

भार పుం.బరువు,భారము

उपवन న.ఉద్యానవనము

भूषण న.అలంకారము

कण्ठ పుం.మెడ

विश्व[1] న. ప్రపంచము

गमन న.వెళ్లుట,గమనము

सूत्रधार పుం.నాటక నిర్వాహకుడు,సూత్రధారుడు

नाटक న.నాటకము

जनक పుం.సీతతండ్రి, జనకుడు

हरिण పుం.జింక

नारद పుం.దేవర్షి,నారదుడు

ధాతువులు

सम् + गम् ఆ.ప.కలియుట

परि + नी పెళ్లి చేసుకొనుట

आ + चर् అభ్యసించుట,చేయుట

हृ హరించుట

अप + नी తొలగించుట

तृ (तर्) ప్ర.గ.ప.ప.దాటుట

तन्त्र् ద.గ.ఆ.ప.కాపాడుట,సంరక్షించుట,జాగ్రత్త వహించుట

शुच्(शोच्) ప్ర.గ.ప.ప.దుఃఖించుట

अव + तृ దిగుట

---

1. ఈ శబ్దం యొక్క విభక్తిరూపములు సర్వనామ రూపముల వలె నుండును.

తెలుగులోనికి అనువదించుము

वशिष्ठस्य पत्न्यरुन्धती । नार्यो हर्म्याणां वातायनेभ्यः पश्यन्ति

कृष्णः कलाः शिक्षते । रामो जनकस्य कन्यां परिणयति

गङ्गा समुद्रं गच्छति । क्षमा वीरस्य भूषणम् ।

नारायणो जननीमाह्वयति । उपवने नृपस्य कन्ये रमेते ।

लते स्पृशति । चन्द्रेण रजनी शोभते ।

नद्यौ सङ्गच्छेते । कुमारी सख्यौ भाषते ।

वराहाः सहचरीः शोचन्ति । लज्जां त्यजति मूर्खः ।

नटी सूत्रधारस्य भार्या । प्रजा नृपतिना रक्ष्यन्ते ।

उद्यानस्य शोभां पश्यति। ललनाः प्रासादतलमारोहन्ति ।

नृपस्याज्ञे अनुरुध्येते[1] । ब्राह्मणा महीमटन्ति ।

रामस्य कथाः श्रूयन्ते । वने प्रमदे दृश्येते ।

वापी नगरात्क्रोशौ । नृपतेर्बलस्य भरेण पृथ्वी कम्पते ।

कुसुमानां मालाः कण्ठादपनीयन्ते।

సంస్కృతములోనికి అనువదించుము

నారదుడు స్వర్గమునుండి దిగుచున్నాడు.

---

1. "ईदूदेद्द्विवचनं प्रगृह्यम् "(అష్టా 1-1-11). ప్రగృహ్యము తరువాత అచ్చు వచ్చినచో ఆ అచ్చును పూర్వాచ్చుతో సంధి రాదు.

కృష్ణుడు రాజులయొక్క కథలను చెప్పుచున్నాడు.

యువతులు ఉపవనములో ఆడుచున్నారు.

(అతడు) రెండు పూలదండలను మెడలో ధరించినాడు.

రాముని భార్య అరుంధతికి నమస్కరించుచున్నది.

మేము కన్యలిద్దరిని చూచుచున్నాము.

మృగజింకలు ఆడజింకలను అనుసరించుచున్నవి.

గ్రామంలో (రెండు) బావులున్నవి.

సూత్రధారుడు నటిని పిలుచుచున్నాడు.

హరి నదివద్దకు వెళ్లుచున్నాడు.

రామునితల్లులిద్దరు రాముని అరణ్యవాసమునుగూర్చి విలపించు చున్నారు.

స్త్రీలు బావుల(గూర్చి) కు వెళ్లుచున్నారు.

ప్రజలు రాజాజ్ఞను అనురోధించుచున్నారు.

హరి పుత్రికలు నాట్యము నేర్చుకొనుచున్నారు.

కళలు పరిశ్రమచే వృద్ధి నొందుచున్నవి.

వివేకి ఎల్లవేళల క్షమను వహించును.

విశ్వములోని అందము హృదయమును హరించును.

తల్లి తన పిల్లల క్షేమంచేత సంతోషించును.

నాటకము ప్రారంభసమయంలో సూత్రధారుడు (తన) భార్యను పిలుచుచున్నాడు.

పురుషులు స్త్రీలను రక్షించెదరు.

నక్షత్రములు రాత్రిని ప్రకాశింపచేయును.

గర్వము చేత సిగ్గు జయింపబడును.

లతలు చెట్లసహాయమును అర్థించును.

స్త్రీ కోపముతో తన సఖిని వదిలివేయుచున్నది.

రాజా ప్రజలను తన సంతానము వలె కాపాడుచున్నాడు. .

## పదునాల్గవపాఠము

నామవాచకములు - స్త్రీలిఙ్గరూపములు

తృతీయా - చతుర్థీ - పంచమీ విభక్తులయొక్క రూపములు.

| | ఏ | ద్వి | బహు |
|---|---|---|---|
| నామవాచకము తృ. | आ | भ्याम् | भिस् |
| ఆకార,ఈకారాన్తములు చ. | ए | भ्याम् | भ्यस् |
| పం. | अस् | भ्याम् | भ्यस् |

అకారాంత శబ్దములోని తృతీయైకవచన ప్రత్యయము ముందు ప్రాతిపదిక చివరనున్న 'ఆ' కారమునకు 'య' కారము ఆగమమగును. **मालया** అట్లే 'ఈ' కారాంత స్త్రీలిఙ్గ శబ్దములకు చతుర్థీ, పంచమీ, షష్ఠీ,సప్తమీ, విభక్తులలో 'య'కారము ఆగమమగును.

माला +आ + ए = मालायै, नदी + आ + ए = नद्यै

ఈక్రిందివి ఏకవచన ప్రత్యయాలుగా తెలుసుకొనవచ్చును.

| ఆకారాంతము | చ- | పం- | ష- | స- |
|---|---|---|---|---|
| | आ -यै | यास् | यास् | याम् |

| | | | |
|---|---|---|---|
| తృతీయా | मालया | मालाभ्याम् | मालाभिः |
| చతుర్థీ | मालायै | मालाभ्याम् | मालाभ्यः |
| పంచమీ | मालायाः | मालाभ्याम् | मालाभ्यः |

| | | | |
|---|---|---|---|
| ఈకారాంతములు | ई - ऐ | आस् | आस् आम् |
| తృతీయా | नद्या | नदीभ्याम् | नदीभिः |
| చతుర్థీ | नद्यै | नदीभ्याम् | नदीभ्यः |
| పంచమీ | नद्याः | नदीभ्याम् | नदीभ्यः |

స్త్రీలిఙ్గరూపములు

| | |
|---|---|
| अवन्ती నగరముపేరు, ఉజ్జయినీ | दासी దాసి |
| प्रभा వెలుతురు,ప్రభ | पूजा పూజ |
| कान्ता అనురాగవతి యైన భార్య | देवता దేవత |
| महिषी పట్టపురాణి | पञ्चवटी పంచవటి |
| वाचा వాక్కు,మాట | कोशाम्बी కోశాంబి |
| पाठशाला పాఠశాల | व्यथा బాధ |
| क्रीडा ఆట,ఆడుట | पुरी పట్టణము |
| सीता రాముని భార్య | चिन्ता ఆలోచన |
| अनुराग పుం.ప్రేమ,అనురాగము | नाग పుం.ఏనుగు |
| करभक పుం.గున్నఏనుగు | पल्लव పుం.చిగురుటాకు |
| कलह పుం.జగడం,వివాదపడుట | मौक्तिक న.ముత్యము |

**गीत** న. గీతము,పాట
**जरठ** పుం.వృద్ధుడు
**दूत** పుం.వార్తను తీసుకెళ్లువాడు,దూత
**स्वस्थ** విణ.శాంతమైన నెమ్మదియైన ఆరోగ్యముగానున్న
**रक्त** విణ.ఎరుపు
**विरूप** వి.వికారమైన
**सन्देश** పుం.వార్త,
**हित** న.హితము.

ధాతువులు

**निर् + गम्** బయటదేరుట
**प्र + दा** ఇచ్చుట
**द्युत् ( द्योत् )** ప్ర.గ.;ఆ.ప.ప్రకాశించుట
**उद् + पत्** (ప్ర.గ.ప.ప.) పైకిఎగురుట
**आ+ह्लाद्** ద.గ. సంతోషపడుట
**परि + वृ** చుట్టివచ్చుట
**नि + वृत्** మరలుట
**प्र + स्था** ప్ర.గ.ఆ.ప. బయటదేరుట
**प्र + हि**[1] పంపుట

తెలుగులోనికి అనువదించుము

देवताभ्यो बलिं यच्छति । चित्तस्य व्यथया रामो मुह्यति ।

---

1. ఈ ధాతువుయొక్క కర్మణి ప్రయోగము మాత్రమే ఇక్కడ చేర్చుకొనవలసినది.

कान्तायै सन्देशः प्रहीयते । अवन्त्या आगच्छति ।

कृष्णस्य पत्न्यै फलानि रोचन्ते[1] । दास्या सेव्यते महिषी ।

जरया क्षीयते शरीरम् । मणीनां प्रभाभिर्द्योतते प्रासादः ।

लज्जया प्रविशति गृहम् । लताभ्यां शोभते वृक्षः ।

गङ्गायाः पुरी क्रोशौ । वापीभ्यो जलं वहति ।

बालकाः पाठशालाभ्य आगच्छन्ति । चिन्तया दह्यते चित्तं नराणाम् ।

यथा कलहस्तथानुरागोऽपि वाचाया उद्भवति ।

देवस्य पूजायाः सुखं लभते ।

प्रजाभ्यो हितमिच्छन्ति नृपतयः । कौशाम्ब्या निवर्तते दूतः ।

क्रीडायै प्रविशत्युद्यानम् । सखीभिः परिव्रियते सीता ।

सहचरी भ्यामनुगम्यते नागः । पञ्चवट्या निर्गच्छति रामः ।

हरिः कन्याभ्यो मौक्तिकानां मालाः प्रयच्छति ।

स्वस्थेन चित्तेन श्रूयते महिष्या नृपतेः संदेसः ।

गजस्य करभकः सीतया पल्लवैः पुष्यते ।

---

1. "रुच्यर्थानां प्रीयमाणः" రుచ్ సమానార్థకములగు ధాతువులు ప్రయుక్తములైనచో ఎవరు ప్రీతినిపొందెదరో ఆ వ్యక్తివాచకశబ్దము చతుర్థీ విభక్తిలోవుండును.

సంస్కృతములోనికి అనువదించుము

హరి తన వాక్కుచేత తన మిత్రుని సంతోష పెట్టెను.

నదులచే నగరము చుట్టబడివున్నది (పరి+వృ)

క్షమాగుణముచే మనిషి మనసు స్వస్థతపొందును.

బుధజనులు భూమి నుండి స్వర్గమునకు వెళ్లుదురు.

వశిష్ఠుడు అరుంధతితో వచ్చెను.

రాముడు తన కుమార్తెలకు ఆభరణములు ఇచ్చెను.

అతడు తన శరీరమును మాలలతో అలంకరించుకొనును.

రాణి తన దాసిపై కోపించును .

అతడు వృద్ధుని కథల వలన ప్రీతిని పొందును.

నారాయణుని భార్యచేత అన్నం వండింపబడినది.

రాజు యొక్క ఆజ్ఞచే నేను అవంతికి వెళ్లుచున్నాను.

తల్లి విరూపులైనను తన పిల్లలను ప్రేమించును.

ఇద్దరు వీరులు రెండు పురములనుండి ఆయుధములతో బయలు దేరుచున్నారు.

జనుల ఆనందము కళలచే వృద్ధిపొందును .

సూర్యుని ఎర్రని ప్రకాశముచే ఆకాశము అలంకరింపబడుచున్నది.

దేవతలవలన మనుష్యులు సుఖప్రాప్తిని కోరెదరు.

చింతవలన క్లేశము పుట్టును.(కలుగును)

సీత తన సఖుల నుండి గీతములను నేర్చుకొనును.

సైనికులు సేనాపతియొక్క ఆజ్ఞచేత పురమునుండి బయటకు వెళ్ళిరి.

ఇద్దరి కన్యలచే హా విస్సు ఇవ్వబడినది .

పిల్లలు వారిక్రీడచేత తండ్రి హృదయమును ఆహ్లా ద పరచుదురు

(అతడు) దేవతల పూజకొరకు పుష్పములను తెచ్చును.

రాణిచేత దాసికి పారితోషికము ఇవ్వబడెను.

భూమినుండి పక్షి ఆకాశమునకు ఎగురును.

## పదునైదవపాఠము

నామవాచకములు - స్త్రీలిఙ్గ శబ్దములు

షష్ఠీ, సప్తమీ,సంబోధనా విభక్తి రూపములు.

'ఆ"కారాంత 'ఈ' కారాంత స్త్రీలిఙ్గశబ్దములు.

| | ఏక. | ద్వి | బహు |
|---|---|---|---|
| షష్ఠీ, | अस् | ओस् | नाम् |
| సప్తమీ, | आम् | ओस् | सु |

'సు ప్రత్యయము'

'ఇ' కారము తరువాతవచ్చే 'సు' 'షు'గా మారును . ओस् ముందు 'ఆ'కారము 'ఏ'కారముగా మారును.'ఆ' కారాన్త శబ్దాల సంబోధనైకవచనంలో'ఆ' కారము 'ఏ'కారమగును. ఉదా - हे रमे ఈకారాన్త శబ్దాల చివరి 'ఈ' హ్రస్వమగును. ద్వివచన బహు వచనములలో ప్రథమావిభక్తిరూపాలే వచ్చును.

| | | | |
|---|---|---|---|
| షష్ఠీ | मालाया: | मालयो: | मालानाम् |
| సప్తమీ | मालायाम् | मालयो: | मालासु |
| సం.ప్ర. | हे माले | हे माले | हे माला: |
| షష్ఠీ | नद्या: | नद्यो: | नदीनाम् |
| సప్తమీ | नद्यां | नद्यो: | नदीषु |
| సం.ప్ర. | हे नदि | हेनद्यौ | हे नद्य: |

పదములు

अति అ. ఎక్కువ
माधुर्य న.తియ్యదనం
देश పుం.దేశము
अयोध्या స్త్రీ.పట్టణముపేరు
उदक న.నీరు
रथ्या స్త్రీ.బజారు
निशा స్త్రీ.రాత్రి
इन्द्राणी స్త్రీ.ఇంద్రునిభార్య
वाणी స్త్రీ.వాణి,మాట
निशाचर పుం. రాత్రిళ్ళు తిరిగేవాడు, రాక్షసుడు
शकुन्तला స్త్రీ.శకుంతల,

दशरथ పుం.దశరథుడు
अनुष्ठान న.నెరవేర్చడం,అనుష్ఠానము
मानव పుం.మానవుడు
निरतिशय విశ.మీరరానిది, ఉత్తమము,గొప్పది
अवचय పుం.ప్రోగుచేసిన కూర్పు
वचन న.వచనము,ఉపదేశము
वल्लभ పుం.ప్రియుడు, భర్త
उज्जयिनी స్త్రీ.ఉజ్జయినీనగరము
विवाह పుం.పెండ్లి,వివాహము
परम విశ.చాలాగొప్పనైన
काम పుం.కోరిక

शिला స్త్రీ.బండరాయి

गोदावरी స్త్రీ.గోదావరీనది

शूद्रक పుం.ఒకరాజుపేరు

श्रद्धा స్త్రీ.నమ్మకం, శ్రద్ధ

छाया స్త్రీ.నీడ

जयन्त పుం.ఇంద్రునికొడుకు

प्रावीण्य న.యోగ్యత,ప్రావీణ్యము

दण्डका స్త్రీ.అడవిపేరు.

तीर న.ఒడ్డు,గట్టు

संमार्जन న.ఊడ్చుట.

बाहुल्य న.బహుళత్వము, అన్నివేళల, అనేకత్వము

दक्ष వి.జాగ్రతగల

कौमुदी స్త్రీ.వెన్నెల

प्रतिष्ठापन వి.స్థాపించుట,ప్రతిష్ఠ

पुण्य వి.పవిత్రమైన

चकोर పుం.చకోరపక్షి

प्रवर्तन న.నడవడి ,ప్రవర్తనము

प्रवाह పుం.ప్రవాహము

संघात పుం.సంఘాతము,గుంపు

संभार పుం.కావలసిన వస్తువులు, సామాగ్రి

प्रिय వి.ప్రియమైన

तृष्णा స్త్రీ.దప్పిక,లోభము

सदैव (सदा + एव)అ.ఎల్లప్పుడు

मण्डप పుం.పొదరిల్లు

मत्स्य పుం.చేప

ధాతువులు

अर्ह् (ప్ర.గ.ప.ప.) అర్హతపొందుట,తగియుండుట

सम् + ऋध् . (చ.గ.ప.ప.)వర్ధిల్లుట, వృద్ధిపొందుట.

क्रीड् (ప్ర.గ.ప.ప.)ఆడుట.

चर् (ప్ర.గ.ప.ప)చరించుట,తిరుగుట .

**फल** (ప్ర.గ.ప.ప.)ఫలించుట,నెరవేరుట.

नि + रुध् (స.గ. ప.ప.)నిరోధించుట, అడ్డుపడుట.

वि + हृ (ప్ర.గ.ప.ప)తిరుగుట, విహరించుట .

### తెలుగులోనికి అనువదించుము

अवन्त्यां शूद्रको वसति । गङ्गायां प्रभूतं जलं वर्तते ।

प्रजानां धर्मे प्रवर्तनं नृपैः क्रियते । सखि गच्छामि नद्यास्तीरम् ।

उज्जयिन्यां शिवस्य पूजासु नृत्यन्ति नार्यः ।

गोदवर्याः जले गजौ विहरतः ।

ग्रीष्मे नदीनामुदकेषु नृपाःप्रमदाभिः सह क्रीडन्ति ।

वाप्यां कमलानि प्ररोहन्ति ।

लतानां मण्डपं प्रविशन्ति ललनाः ।

कृष्णो भार्याया विनयं शंसति ।

वृक्षाणां छायासु शिलायामुपविशति ।

रथानां संमार्जनं क्रियते पौरैः ।

कन्ययोर्विवाहस्य संभाराः क्रियन्ते ।

जनन्योराज्ञामनुरुध्यते रामः ।

सख्योः परमः स्नेहः शकुन्तलायाः ।

प्रिये पुत्रो ग्रामं गच्छति ।

बुधानां वाण्यां सदैव माधुर्यं वर्तते ।

अयोध्याया नृपो दशरथः ।

कान्ताया वचनं क्रियते रामेण ।

चन्द्रो निशायाः वल्लभः ।

दास्योर्वचनेषु महिष्या निरतिशया श्रद्धा ।

कौमुद्याः शोभा चित्तं हरति ।

पाठशालानां प्रतिष्ठापनेन जनेषु ज्ञानं वर्धते ।

जरायामपि मानवानां तृष्णा न शाम्यति ।

देवतानां पूजया कामाः फलन्ति नराणाम् ।

సంస్కృతంలోనికి అనువదించుము

గంగాతీరములో వృక్షములున్నవి.

జయంతుడు ఇంద్రాణి యొక్క కుమారుడు.

రాముని యొక్క స్నేహితుడు పురమునందు నివసించును.

వెన్నెలలో చకోరము ఆహ్లాదమునొందును.

ఆమె లతనుండి పుష్పమును తెచ్చును.

హరి తనకుమార్తెల సద్గుణములను స్తుతించును.

నదుల యందు చేపలు వున్నవి.

అయోధ్యామార్గములయందు రథములను నేనుచూచెదను.

శకుంతల తన సఖుల స్నేహమునకు అర్హురాలు.

రాముని వాక్కునందు మాధుర్యము వున్నది.

సీత యొక్క కుమారులెక్కడ ఉన్నారు?

దండకారణ్యమునందు నిశాచరులుందురు.

భూమిపై ద్వీపములున్నవి.

వృక్షచ్ఛాయలో మానవులను నేను చూచుచున్నాను.

సామాన్యంగా నిశాచరులు రాత్రులయందు చరిస్తారు.

తల్లియొక్క హృదయం పుత్రికయెడల స్నిగ్ధమై వుండును.

గంగాజలములు పవిత్రములు.

రాణి ఆజ్ఞచే శరుడు దండింపబడెను.

కళల బాహుల్యముచేత దేశము అభివృద్ధిచెందును.

నదియొక్క ప్రవాహము రాళ్లసంఘాతముచేత నిరోధింపబడును.

దాసి పూజా సంభారములను తెచ్చును.

నేను లతల యొక్క పుష్పముల అవచయముకై ఉద్యానవనమునకు

అతడు రాజుయొక్క ఆజ్ఞను అనుష్ఠించుటలో దక్షుడు. పోవుదును.

## సాధారణ ఫలితములు - అనుశీలనము

### शाला ( स्त्री ) శాల

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్రథమా | शाला | शाले | शालाः |
| ద్వితీయా | शालां | शाले | शालाः |
| తృతీయ | शालया | शालाभ्यां | शालाभिः |

| | | | |
|---|---|---|---|
| చతుర్థీ | शालायै | शालाभ्यां | शालाभ्य: |
| పంచమీ | शालाया: | शालाभ्यां | शालाभ्य: |
| షష్ఠీ | शालाया: | शालयो: | शालानाम् |
| సప్తమీ | शालायां | शालयो: | शालासु |
| సం. | हे शाले | हे शाले | हे शाला: |

दासी स्त्री దాసి.

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | दासी | दास्यौ | दास्य: |
| ద్వితీయా | दासीम् | दास्यौ | दासी: |
| తృతీయ | दास्या | दासीभ्याम् | दासीभि: |
| చతుర్థీ | दास्यै | दासीभ्याम् | दासीभ्य: |
| పంచమీ | दास्या: | दासीभ्याम् | दासीभ्य: |
| షష్ఠీ | दास्या: | दास्यो: | दासीनाम् |
| సప్తమీ | दास्याम् | दास्यो: | दासीषु |
| సం. | हे दासि | हे दास्यौ | हे दास्य: |

1. सहचरी , प्रमदा , पत्नी , गौरी వంటి శబ్ద రూపాలను వ్రాయండి .

2. 'అ' కారాంతమైన విశేషణము స్త్రీలిఙ్గరూపముగా మారినపుడు సాధారణంగా ఏ స్త్రీప్రత్యయం దానితో చేరును ?

# పదునారవపాఠము

అనద్యతన భూత కాలము.लङ्

పరస్మైపదము-ప్రత్యయాలు[1]

| | ప్ర.పు | మ.పు. | ఉ.పు. |
|---|---|---|---|
| ఏక | त् | स् | अम् |
| ద్వి | ताम् | तम् | व |

అనద్యతన భూతకాలంలో ప్రత్యయములకు ముందు ధాతువులకు వికరణప్రత్యయం చేర్చబడును.

| | | | |
|---|---|---|---|
| ఏక | अबोधत् | अबोधः | अबोधम् |
| ద్వి | अबोधताम् | अबोधतम् | अबोधाव |

अस् ధాతువునకు ప్రథమ మధ్యమ పురుషలో ఏకవచన

---

1.పాణిని మహర్షి అష్టాధ్యాయిలో పది లకార సంజ్ఞలను వివరించెను लट् అనగా వర్తమాన కాలము. అట్లే लङ् అంటే అనద్యతన భూత కాలము. అని అర్థము . ఇప్పటికంటే దగ్గరలోనున్న , అనగా మనకు అనుభవము లోనికి వచ్చిన నిన్న ,మొన్నటి అనుభవాలవంటి వానిని लङ् లకారములో వివరించాలి .'అద్యతనము' అంటే ఇప్పటిది .ఇప్పుడు కలిగిన అనుభవాలు.'అద్యతనము. కానిది 'అనద్యతనము .

ప్రత్యయానికిముందు ధాతువు చివరి 'స' కారపొల్లు (స్)నకు' ఈ '
కారము ఆగమము.

ఉదా आसीत्, आसीः

अद् - ధాతువు 'लङ्' లకారముప్ర,పురుష ఏకవచనములో आदत्
గా మారును .

పదములు

| | |
|---|---|
| अज పుం.మేక | तनय పుం.కుమారుడు |
| सङ्कट న.సంకటము,కలవరము | असारता స్త్రీ.విలువలేకుండుట , సారము లేకుండుట . |
| पुरतस् అ.ముందు | सभा స్త్రీ. న్యాయస్థానము, సమావేశము |
| आशा స్త్రీ.ఆశ | महिष పుం.దున్నపోతు |
| समराङ्गण న.యుద్ధభూమి | गोष्ठ పుం.న.గోశాల |
| मुष्टि పుం.పిడికిలి | सेना స్త్రీ.సైన్యము. |
| ग्रन्थ పుం. పుస్తకము | शनैस् అ.మెల్లగా |

गै ( गाय् ) - ప్ర.గ.ప.ప. పాడుట

తెలుగులోనికి అనువదించుము

रामो रावणमजयत् । सीता गोदवर्यास्तीरमगच्छत् ।

गङ्गाया जलमपिबम् ।

ललने छायायामुपाविशताम् ।

सीतां वनेऽत्यजाव ।

गिरेः शिखरादजावपतताम् ।

हरिरश्वमारोहत् ।

देवानयजाव ।

स्तेनौ धनिकस्य धनमचोरयताम् ।

ईश्वरस्य प्रसादेन हरेः क्लेशोऽनश्यत् ।

पुरा भार्यया सहोज्ञयिन्यामवसम् ।

अयोध्यायामासीः ।

संसारस्यासारतामबोधम् ।

तदा मूर्खोऽस्मीत्यवागच्छम् ।

योधोऽरौ शरानक्षिपत् ।

पुत्राणां धर्ममकथयः ।

संकटेभ्यो जनमरक्षः ।

रथं समराङ्गणमनयम् ।

भिक्षुकेभ्यो निष्कानयच्छम् ।

अरण्ये महिषानपश्यम् ।

दशरथस्तनयमाह्वयत् ।

शिष्यावाचार्यमनमताम् ।

अवन्त्यामभवः ।

अग्निर्वनमदहत् ।

नृपस्य पुरतोऽसत्यमवदच्छठः[1] ।

సంస్కృతంలోనికి అనువదించుము

సరస్సునందలి నీరు ఎండిపోయెను.

సేనాపతి సేనను యుద్ధరంగమునకు కొనిపోయెను.

రాముని మిత్రులిద్దరు అతనిని స్మరించిరి.

---

1. పదమునకుగాని వ్యాకరణరూపమునకుగాని శకారము పరమై, ఆ శకారమునకు అచ్చుగాని అంతస్థంగాని అనునాసికంగాని పరమైనప్పుడు శకారము ఛకారముగా వికల్పంగా మారును. 'శశ్ఛోऽటి' (8-4-63)

బిడారు ఒకనగరమునుండి వేరొకనగరమునకు తిరుగుచుండెను.

నేనాగ్రంథమును ప్రకాశింపజేసితిని(ప్రకటించితిని)

మీరిద్దరు హరియొక్క ఉద్యానవనమునుండి ఫలములు

కొనిపోయితిరి.

నీవు ంమునకు ఒక కథ చెప్పితివి ².

రెండువ్యాఘ్రములు గోశాలకు పరుగెత్తెను.

కృష్ణుడు తన పాదములను క్షాలనము చేసుకొనెను.

సైనికుడు ఒక స్త్రీని శత్రువుబారినుండి కాపాడెను.

కచ్ఛపము (తాబేలు) మెల్లగా కదులుతుంది.

నేనప్పుడు సంపదమీద ఆశ ఒదులుకొని జీవించితిని.

మేము ఉభయులను, ఋషులను సాంత్వనపరచితిమి.

దేవుడు భూమిని సృష్టించెను.

---

1.నగర పదాన్ని వాడవలసివస్తే ఈక్రింది సంధిని గుర్తుంచుకోవాలి. ప్రాతిపదికముచివర వచ్చే హల్లునకు అనునాసికము పరమైతే ఆ హల్లు తనవర్గముయొక్క అనునాసికంగా వికల్పంగా మారును

, एतत् + मुरारिः =,एतन्मुरारिः, एतद्मुरारिः,

నామవాచక ప్రత్యయంలో ఈసంధి విధిగా జరుగును.

चित् + मय = चिन्मय          नगरात् + नगरम् = नगरान्नगरम् ।

2.कथ् ధాతువు ద్వికర్మకము.అకథితం అనగా అభిధేయముకానిది చతుర్థిలో లేదా షష్ఠిలో ఉండును.

మనుష్యులు ఉద్యానవనమును ప్రవేశించిరి.

నేను హరిని నిందించితిని.

మీరు ఇరువురు వనములో నివసించితిరి.

మేము ఇద్దరము రాత్రి భోజనమునకై అన్నము వండితిమి.

రాజసభలో రాణి గానము చేసెను.

నీవారముష్టిని ఆ బాలిక జింకకు తినిపించెను.

నీవు నీ భార్యను ఏ అపరాధము లేకయే త్యజించితివి.

ఏకారణము లేకయే మీరిద్దరు గ్రామమును దహించితిరి.

అతడు వృక్షాగ్రమునుండి క్రిందకుపడి నశించెను.

శిశువు ఆనందముతో నృత్యముచేసెను.

# పదునేడవ పాఠము

## అనద్యతన భూతకాలిక క్రియలు

### పరస్మైపది బహువచనము, ఆత్మనేపది ఏకవచనము

| | ప్ర.పు | మ.పు. | ఉ.పు |
|---|---|---|---|
| ప.ప.బ.వ | अन् | त | म |
| | अगच्छन् | अगच्छत | अगच्छाम |
| ఆ.ప. ఏ.వ | त | थास् | इ |

अलभत अलभथाः अलभे

అచ్చుతో మొదలయ్యే ధాతువులకు ముందు భూతకాలిక చిహ్న మయిన అకారమునకు బదులు 'ఆ' కారము చేరును.ధాతువులోని ఇకార, ఈకారములు ఐకారముగా, ఉకార,ఊకారములు ఔకారముగా, ఋకారము ఆర్ గా మారును.ఇక్కడ గుణమును బాధించి వృద్ధికార్యము వచ్చుచున్నది.

उदा: आ + ईक्ष + त = ऐक्षत ।

పదములు

आशीर्वाद పుం. ఆశీర్వాదము
गोप పుం. గొల్లవాడు
चन्द्रापीड పుం. రాజుపేరు
देवी స్త్రీ. దేవత
उज्ज्वलम् క్రి.వి. ప్రకాశము
ग्रथन న. అల్లుట, మెలిపెట్టుట
चित्रकूट పుం.చిత్రకూటపర్వతము
धार्तराष्ट्र పుం. ధృతరాష్ట్రుని కొడుకు
नृशंस వి. దుష్టమైన
पण्डित పుం. పండితుడు
पञ्जर పుం. పంజరము
पाण्डव పుం. పాండురాజు కొడుకు
बलि పుం. ఒకరాజుపేరు
माणवक పుం. ఒకవ్యక్తిపేరు.
मार्ग పుం. రహదారి.
मदिरा స్త్రీ. కల్లు
मारुत పుం. వాయువు
राक्षस పుం. రాక్షసుడు

लव పుం. రాముని కొడుకు (లవుడు) वसुधा స్త్రీ. భూమి

विराव పుం. ఏడ్పు

शृगाल పుం. నక్క

स्थान న. స్థానము, (స్థలము)

शव పుం. శవము

संचलन న. సంచలనము

अति + सृज् వదలిపెట్టుట, ఇచ్చుట

తెలుగులోనికి అనువదించుము

पाण्डवानां धार्तराष्ट्रैः सह युद्धान्यभवन् ।

आचार्या धर्ममुपादिशन् ।

रामः सीतया सह गोदावर्यास्तीरेऽरमत ।

उद्यमेन धनमलभथाः ।

व्याघ्रस्य विरावेण नार्या हृदयमवेपत ।

मित्रस्य कल्याणायायते ।

गोपा अजान् ग्राममनयन् ।

नृपस्य सभां पण्डिताः प्राविशन् ।

शवमस्पृशत् ।

माणवकं मार्गमपृच्छाम ।

देवीमभाषे ।

नृपतेः शासनमवाधीरयथाः ।

हरिणा जनकोऽसेव्यत ।

पुरुषमताडयत ।

शृगालोऽम्रियत ।

प्रासादे नार्योऽनृत्यन् ।

क्लेशो रामेणासह्यत ।

नृशंसो राक्षसोऽहन्यत ।

लवस्य विनयेनर्षयोऽतुष्यन् ।

चित्रकूटस्य शिखरेऽवसाम ।

श्रृगालं व्याघ्रं चैक्षे ।　　　　　　वित्तस्य नाशेनामुह्यन् ।

प्रभूतं धनं नृपेण ब्राह्मणेभ्योऽत्यसृज्यत ।

चन्द्रापीडस्य बलस्य संचलनेन मह्यकम्पत ।

पञ्जराद्विहगममुञ्चाम ।

సంస్కృతంలోనికి అనువదింపుము

మేము వృక్షపు ఛాయలో కూర్చొంటిమి.

ఆయన తన సేవకుల తప్పులను క్షమించెను.

గంగానది జలములో బ్రాహ్మణులు పడిపోయిరి.

అశ్వములు యుద్ధభూమికి పరుగెత్తెను.

రాముడు తన తండ్రి ఆదేశములను ( ఆజ్ఞలను ) పాటించెను.

హరి నారాయణునినుండి సంగీతము నేర్చుకొనెను.

నేను మామిడిపండ్లను రుచి చూచితిని ( ఆస్వాదించితిని ).

దూతలు అయోధ్యకు వెళ్ళిరి.

నీవు అసత్యము పలికితివి.

కృష్ణుడు తన సఖుల అభివృద్ధిపట్ల ఆనందించెను.

ఆ తరువాత నీవు కౌశాంబీ నగరములో నివసించితివి.

అతడు రాముని వీరత్వము పట్ల ఆశ్చర్యపడెను.

నీవు శత్రువుతో పోరాడితివి.

రాజాజ్ఞ మేరకు శఠుడు దండింపబడెను.

నీవు నిష్కములను లెక్కించితివి ( గణించితివి ).

ఋషి యొక్క ఆశీర్వచనము రామునికొరకు కోరబడినది.

దేవుని దయచే మీరు శత్రువులను జయించితిరి.

మదిరకు బదులు మంచినీటిని త్రాగితిమి.

అందువలన మీరు మీ పుస్తకములను మీ ఇంటికి తీసుకు వెళ్ళితిరి.

సూర్యుడు నిన్న చాల ఉజ్జ్వలంగా ప్రకాశించెను.

దొంగ రాత్రి ఇంటిలోనికి ప్రవేశించెను.

మేము సేనాపతిని ఆతని సైన్యమును చూచితిమి.

వారు రాజును యుద్ధభూమినుండి మోసుకొనిపోయిరి.

శత్రువులపై వారు బాణములను వదలిరి.

నేను పూలదండను అల్లుట మొదలుపెట్టితిని.

## పదునెనిమిదవ పాఠము

### అనద్యతన భూతకాలము

### ఆత్మనేపది రూపములు.

| | ప్రథమ | మధ్యమ | ఉత్తమ |
|---|---|---|---|
| ద్వి.వ | इताम् | इथाम् | वहि |
| బ.వ | अन्त | ध्वम् | महि |

| | | |
|---|---|---|
| अलभेताम् | अलभेथाम् | अलभावहि |
| अलभन्त | अलभध्वम् | अलभामहि |

ध्वंस् (ప్ర. గ.ఆ.ప. నశించుట

अव+मन् (చ.గ.ఆ.ప.)అవమానించుట

नि+मन्त्र (ద.గ.ఆ.ప.) పిలచుట

वि+मृश (ష.గ.ప.స.) విమర్శించుట ,ఆలోచించుట

लज्ज् (ష.గ.ఆ.ప.) సిగ్గుపడుట

रम् (ప్ర.గ.ప.ప)సంతోషించుట

स्पर्ध् (ప్ర.గ.ఆ.ప.) పోటీపడుట

स्रंस् (ప్ర.గ.ఆ.ప. జారుట

वि+हस् (ప్ర.గ.ప.ప.)వెకిలిగా నవ్వుట

పదములు

अनिष्ट న. అనిష్టము, పాపము

अवधीरणा స్త్రీ. తిరస్కారము

नायक పుం. నాయకుడు

परम् అవ్య. కాని, అట్లుకానిచో

आरोपण న. నాటుట, ఎత్తుట

उपदेश పుం. ఉపదేశము, బోధన

दर्शन న. చూపు,దర్శనము

दुष्कृत న.దుష్కృతము,

असुर పుం. అసురుడు, దేవతలశత్రువులు.

पान्थ పుం. ప్రయాణికుడు

प्राची స్త్రీ. తూర్పుదిక్కు

| | |
|---|---|
| **कबरी** స్త్రీ. కేశపాశము | **बल** న. బలము |
| **कार्य** న. క్రియ, పని | **बीज** న. విత్తనము |
| **गन्धर्व** పుం. గంధర్వుడు | **भूप** పుం. రాజు |
| **ग्रहण** న. గ్రహించుట | **रमण** పుం. ప్రియుడు, భర్త |
| **चोर** పుం. దొంగ | **वीर्य** న. నాయకత్వము, శౌర్యము, ధీరత్వము |
| **जाल** న. వల | |
| **प्राश्रिक** పుం. ప్రశ్నించువాడు | **सचिव** పుం. మంత్రి |
| **ज्योत्स्ना** స్త్రీ. వెన్నెల | **समूह** పుం. గుంపు, సమూహము |
| **त्याग** త్యాగము, వదిలివేయుట | |

తెలుగులోనికి అనువదించుము.

पाण्डवा राज्यमविन्दन्त । आचार्यान् शिष्या अभ्यवादयन्त ।
सचिवा भूपमभाषन्त । नार्याः कबर्याः पुष्पे अस्रंसेताम् ।
जनेन व्यवस्यध्वम् । रथ्यायां जनानां समूहमैक्षामहि ।
रामस्य दुःखान्यध्वंसन्त । मित्राणां त्यागेनालज्जेताम् ।
वृक्षेभ्यः शुकाः उदडयन्त । मृगावहन्येतां व्याधैः ।
जनानां सुखायायतामहि । देवैः सहासुरा अस्पर्धन्त ।
उज्जयिन्याः कदा न्यवर्तध्वमिति जनै[1]रपृच्छ्यामहि ।

---

1..प्रच्छ्(ప్రచ్ఛ్) కర్మణి ప్రయోగం पृच्छ् గా మారును.

रमणैः सह ज्योत्स्नायामरमन्त नार्यः।

अरीणां पराजयेनामोदन्त सेनापतयः।

गृहं प्राविशंश्चोराः परं नालभन्त धनम् ।

कन्या अवन्दन्त जनकम् ।

वातेन वृक्षा अकम्पन्त ।

आचार्यादस्त्राण्यशिक्षामहि ।

वीर्येण विद्यायाश्च बलेन प्राकाशन्त।

बीजस्यारोपणमारभन्त कृषीवलाः ।

नारायणस्य दुष्कृतानि नारोचन्त जनकाय ।

नानिष्टमाशङ्कामहि ।

उद्यमादृध [1]रेर्धनान्यवर्धन्त ।

धनस्य राशयो ब्राह्मणेभ्योऽदीयन्त ।

సంస్కృతములోనికి మార్చుము.

రాక్షసులతో వానరులు యుద్ధముచేసిరి.

కాశీ(పట్న)లో మేమిద్దరము పండితులతో మాట్లాడితిమి.

వారు శాంతముగా నిందను సహించిరి.

రెండు నక్షత్రములు తూర్పున ప్రకాశించినవి.

---

1.వర్గం యొక్క మొదటినాలుగు అక్షరముల తరువాత వచ్చే హ్ ఆ వర్గమునకు చెందిన నాల్గవవర్ణంగా వికల్పంగా మారును.

మీరిద్దరు రామునిచే ఆజ్ఞాపించబడితిరి.

మేము రాత్రిభోజనమునకు ఋషులను ఆహ్వానించితిమి.

అయోధ్యనుండి దూతలు ఎపుడు తిరిగివచ్చిరి?

మేము హరి అనుగ్రహించునని ఊహించలేదు.

మేము పాఠశాలవద్ద పుస్తకములను పొందితిమి.

ఇద్దరు పరీక్షకులు యిద్దరు కన్యల నృత్యమును పరీక్షించిరి .

మేమిద్దరము మీతల్లి దర్శనమునకు సంతోషించితిమి.

వారిద్దరు రాజు అంగీకరింపడేమోనని సంశయించిరి.

మేము గంధర్వకుటుంబములో పుట్టిన వారము.

పక్షులు వాటి నాయకుని ఉపదేశమును ధిక్కరించి వలలోపడినవి.

బ్రాహ్మణుల తప్పులు రాజుచే క్షమించబడినవి.

మీరిద్దరు పులిని చూచుటవలన భయంతో వణికితిరి.

మీరు ఏనుగును పట్టుకొనుటకు ప్రయత్నించితిరి.

ఇద్దరు పిల్లలు వారితల్లి లేనందున సంతోషించలేదు.

రాముని గుణములు కవులచే స్తుతింపబడినవి.

బుద్ధిబలముచేత వారు మిక్కిలి ధనమును పొందిరి.

వారిద్దరు వారి కుమార్తెకొరకు అడవిలో వెదకిరి.

రెండు మామిడి పండ్లు యిద్దరు బాటసారులచే ఆస్వాదింపబడినవి.

## సామాన్య ఫలితములు - అనుశీలనము

### नी

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్ర.పు. | अनयत् | अनयताम् | अनयन् |
| మ.పు. | अनयः | अनयतम् | अनयत |
| ఉ.పు. | अनयम् | अनयाव | अनयाम |

### द्युत्

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | अद्योतत | अद्योतेताम् | अद्योतन्त |
| మ.పు. | अद्योतथाः | अद्योतेथाम् | अद्योतध्वम् |
| ఉ.పు. | अद्योते | अद्योतावहि | अद्योतामहि |

అభ్యాసము

1.ఈ క్రింది ధాతువులకు అనద్యతన భూతకాలిక రూపములను వ్రాయుము.

अस्, अद्, ईक्ष्, मृग्, सृज्, रुच्, नि +मन्त्र्, इष्, शिक्ष्, जीव्, डी, मृजन्

2.పదాంతములోని హల్లునకు అనునాసికము పరమయినప్పుడు ఎట్టిమార్పు వచ్చును ? ఈమార్పు ఎప్పుడు నిత్యముగా వచ్చును?

3. వర్గములలోని తొలి నాలుగుహల్లులకు 'హ'కారము పరమయి

నప్పుడెట్టి మార్పు వచ్చును?

4. 'శ'కారము 'ష'కారముగా ఎప్పుడు మారును?

# పందొమ్మిదవ పాఠము

## నామవాచకములు

ఉకారాన్త ఋకారాన్త పుంలిఙ్గ నపుంసకలిఙ్గశబ్దములు.

ఉకారాన్త పులిఙ్గశబ్దాలు ఇకారాన్త పులిఙ్గ శబ్దాలవలెనే రూపాలను పొందును. ఇకారాన్త శబ్దాలలో इ,ई ए य् వచ్చినచోట ఉకారాన్త శబ్దములకు उ ऊ ओ व् అను అక్షరములు వచ్చును.

'ఉ'కారాంత 'ఋ'కారాంత నపుంసకశబ్దరూపాలు 'వారి' శబ్దరూపములను పోలియుండును. 'వారి'శబ్దములోని 'ఇ'కార స్థానంలో ఇక్కడ 'ఉ'కార 'ఋ'కారములు, 'ఈ'కారస్థానములో 'ఊ'కార 'ౠ' కారములు, 'ఏ'కార స్థానములో 'ఓ'కారము అర్ యథావిధిగా చేర్చబడును.

गुरु పుంలిఙ్గము.

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | गुरुः | गुरू | गुरवः |
| ద్వితీయా | गुरुम् | गुरू | गुरून् |

| | | | |
|---|---|---|---|
| తృతీయ | गुरुणा | गुरुभ्याम् | गुरुभिः |

मधु నపుంసకలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా, ద్వితీయా | मधु | मधुनी | मधूनि |
| తృతీయా | मधुना | मधुभ्याम् | मधुभिः |
| చతుర్థీ | मधुने | मधुभ्याम् | मधुभ्यः |

कर्तृ నపుంసకలిఙ్గము.

| | | | |
|---|---|---|---|
| ప్రథమా,ద్వితీయా | कर्तृ | कर्तृणी | कर्तॄणि |
| తృతీయా | कर्तृणा | कर्तृभ्याम् | कर्तृभिः |
| చతుర్థీ | कर्तृणे | कर्तृभ्याम् | कर्तृभ्यः |

ఋకారాంత పుంలిఙ్గ శబ్దాల ప్రథమా విభక్తిలోని ద్వివచన బహువచనాలలో ద్వితీయా విభక్తిలోని ఏకవచన, ద్వివచనాలలో చివరి ఋ కారము ఆర్ గా మారును. पितृ, जामातृ, भ्रातृ, देवृ, नृ, सव्येष्टृ మొదలైన వాటిలో చివరి ఋకారము అర్ గా మారును. అన్ని ఋకారాంత శబ్దాల ప్రథమైక వచనములో చివర ఆ కారము వచ్చి र् మరియు स् అనునవి లోపించును.ఉదా :- धातृ-धाता, नेतृ-नेता, पितृ- पिता( 'ర్' అనునది శబ్దరూపములోని అంగము. 'స్' అనునది ప్రత్యయము. ఇవి రెండును లోపించును.)

మొదటి నాల్గు విభక్తి ప్రత్యయములు.

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | स् | औ | अस् |
| ద్వితీయా | अम् | औ | न् |
| తృతీయా | आ | भ्याम् | भिस् |
| చతుర్థీ | ए | भ्याम् | भ्यस् |

नेतृ పుంలిఙ్గము నాయకుడు

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | नेता | नेतारौ | नेतारः |
| ద్వితీయా | नेतारम् | नेतारौ | नेतॄन् |
| తృతీయా | नेत्रा | नेतृभ्याम् | नेतृभिः |
| చతుర్థీ | नेत्रे | नेतृभ्याम् | नेतृभ्यः |

भ्रातृ పుంలిఙ్గము సోదరుడు

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | भ्राता | भ्रातरौ | भ्रातरः |
| ద్వితీయా | भ्रातरम् | भ्रातरौ | भ्रातॄन् |
| తృతీయా | भ्रात्रा | भ्रातृभ्याम् | भ्रातृभिः |
| చతుర్థీ | भ्रात्रे | भ्रातृभ्याम् | भ्रातृभ्यः |

పుంలిఙ్గములు

इषु బాణము  त्वष्टृ దేవశిల్పి  परशुराम పరశురాముడు

ऋतुपर्ण ఋతుపర్ణమహారాజు  कपोल చెక్కిలి  दुर्जन దుష్టుడు

गुरु గురువు, ఆదరణీయుడు  देवृ మరిది  जामातृ అల్లుడు

धातृ బ్రహ్మ  पितृ తండ్రి  पांसु దుమ్ము

तडाग చెరువు  नृ మనుష్యుడు  प्रभु పాలకుడు

तरु చెట్టు  परशु గొడ్డలి  बाहु భుజము

बिन्दु బొట్టు(చుక్క)  शत्रु శత్రువు  भर्तृ భర్త

लक्ष्मण లక్ష్మణుడు  वायु గాలి  शम्भु శివుడు

भीम భీముడు  विघ्न విఘ్నము  शिशु శిశువు

भ्रमर తుమ్మెద  विष्णु విష్ణువు  सव्येष्टृ రథసారథి

मनु మనువు  రథికుడు

विमार्ग చెడ్డదారి  रक्षितृ రక్షించువాడు

పుంలిఙ్గనపుంసకలిఙ్గములు(ఉభయలిఙ్గములు)

कर्तृ  చేయువాడు, రచయిత  गन्तृ  వెళ్లువాడు

दातृ  ఇచ్చువాడు  द्रष्टृ  చూచువాడు

द्वेष्टृ  ద్వేషించువాడు  राष्ट्र రాష్ట్రము

స్త్రీలిఙ్గములు

अमरावती ఇంద్రుని రాజధాని  जिह्वा  నాలుక

నపుంసకలిఙ్గము

अग्र పైభాగము, అగ్రము

अश्रु కన్నీరు

तालु తాలువు, అంగిలి

वसु ధనము

मधु తేనె

విశేషణములు

क्षुधित ఆకలిగొన్న

श्याम నల్లనిది,నీలమైనది

అవ్యయములు

अनेकशस् తరచుగా, చాలాసార్లు

तु = కాని(ఈ పదమును వాక్యముల ఆరంభమునందు ఉపయోగించ రాదు.)

ధాతువులు

अनु+इष् (చ.గ.ప.ప.)వెదకుట

अनु + गम् (అనుసరించుట)

गल् (ప్ర.గ.ప.ప.) కారుట,ద్రవించుట, చెమర్చుట,కరిగిపోవుట

छिद् (క.ప్ర.) కోయబడుట ఛేదింపబడుట

प्र + नी (సమకూర్చుట, రచించుట

भृ (ప్ర.గ.ఉ.ప.) నింపుట

वाञ्छ् (ప్ర.గ.ప.ప.) కోరుట,వాంఛించుట

भ्रियते (క.ప్ర.)

अनु+मन् (అంగీకరించుట, ఒప్పుకొనుట)

निर् +मा (ఉత్పత్తిచేయుట, సృష్టించుట,निर्मीयते (క.ప్ర.

प्र+हि పంపించుట प्रहीयते(క.ప్ర)

హలాదిశబ్దములకు ముందున్న 'అ' కారము, అజాదులకు ముందున్న 'అన్' అనునది వ్యతిరేకార్థద్యోతకములు. अधर्मः, अनश्वः,

తెలుగులోనికి అనువదించుము

शम्भुर्जयति । बाहू स्फुरतः ।
वायुना तरवः कम्पन्ते । भ्रमरा मधु पिबन्ति ।
नरा वसूनि वाञ्छन्ति । इन्द्रः शत्रूनजयत् ।
योधोऽरावीषू क्षिपति । चातको जलस्य बिन्दुमपि न लभते ।
विष्णवे पूजा रोचते । प्रभुभिर्भृत्या आदिश्यन्त ।
विश्वस्य कर्तारं नमामि । गुरुभ्यः शिष्यस्याविनयं कथयामि ।
सीता लक्ष्मणं देवरमन्वगच्छत्[1]।
कन्यायाः भर्तारं जामातरं वदन्ति ।
भर्त्रे संदेशः प्रहीयते । नार्याःकपोलयोर्नयनाभ्यामश्रूणि गलन्ति।

---

1.అచ్చు తరువాత వచ్చు ఛకారము చ్ఛగా మారును. పదాంతంలోగాని వ్యాకరణాంశము చివరగానీ ఉన్న అచ్చు దీర్ఘమైనప్పుడు ఈ మార్పు వికల్పంగా వస్తుంది.కాని నిషేధార్థకమగు मा అను అవ్యయమునకు, आ అను ఉపసర్గకు ఈ ఛ కారము పరమైనపుడు అది చ్ఛ గా మారుట నిత్యము.

त्वष्ट्रामरावती निरमीयत । पितरो वन्द्यन्ते पुत्रैः ।
रामो जनकस्य जामाता । पाण्डवा द्वेष्टॄन् युद्धेऽजयन् ।
भर्तारमनुसरति किङ्करः । मनुना धर्मः प्राणीयत ।
धात्रा प्रजाः सृज्यन्ते । तडागस्य जलं मार्गे गन्तृभिरपीयत ।
याचका दातारं नालभन्त ।

సంస్కృతములోనికి అనువదించుము

రాముడు అపూపమును పిల్లలకు యిచ్చెను.

ఆకాశము ధూళితోనిండినది.

పరశురాముడు తన శత్రువులను గొడ్డలితో పడగొట్టెను.

నీటి చుక్కలు మేఘమునుండి పడుచున్నవి.

రాజు సంరక్షకులను నగరమునకు పిలిచెను.

బాలుడు తన తండ్రి(యందు)తో అణిగి మణిగి వుంటున్నాడు.

అవంతి ప్రభువు తనమిత్రులతో సంభాషించెను.

బాలుడు తన నాలుకతో రుచిని చూచెను.

స్త్రీలు తమభర్తలతో ఉద్యానమునకు వెళ్లిరి.

ఋషులు మంత్రద్రష్టలు.

జనులు విష్ణువును పూజింతురు.

ఋతుపర్ణుడు తన సారథితో మాట్లాడెను.

రాముడు తన తమ్ముడైన లక్ష్మణునితో అడవికి వెళ్లెను.

రావణుని తలలు రాముని బాణములతో నరకబడినవి.

తరచుగా విఘ్నములు కలుగుతాయనిభయంతో మనుష్యులు పనిని ప్రారంభించలేదు.

భీముడు తన బాహువులతో శత్రువులతో పోరాడెను.

ఉపద్రవమును(చేయువారిని)కల్పించువారిని దేవతలుశిక్షించుదురు.

చెడుమార్గములో పోవువారిని జనులు తూలనాడెదరు.

గణము వినాశమునుండి దేశముయొక్క సంరక్షణ చేయునది.

దుష్టుని జిహ్వపై తేనె, అతని హృదయంలో విషము వుంటుంది.

వృక్షములు తమ ఛాయతో బాటసారులను ఆనందింపచేయును.

విశ్వామిత్రునితో రామ వనగమనము తండ్రిచే అంగీకరింపబడెను.

వాయువు నల్లని మేఘములను చెదరగొట్టుచున్నది.

ప్రజలు తమ ఆకలికి అన్నం పెట్టు వారిని పొగుడుదురు.

సీత తన ఆడపడచు భర్తయగు ఋష్యశృంగునకు నమస్కరించెను.

# ఇరువదియవ పాఠము

నామవాచకములు

పంచమీ , షష్ఠీ , సప్తమీ విభక్తులు

ఉకారాన్త ఋకారాంత పుంలిఙ్గ, నపుంసకలిఙ్గములు.

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ఋకారాన్త పుంలిఙ్గ పం. - | | भ्याम् | भ्यस् |

| | | | | |
|---|---|---|---|---|
| నామవాచకములు. | ష. | - | ओस् | नाम् |
| | స. | इ | ओस् | षु |

ఋకారస్థానములో उर् ను గ్రహించుటచేత పంచమీ షష్ఠీ విభక్తులలోని ఏకవచనరూపాలు ఏర్పడును. సప్తమ్యేకవచనములో इ అనే ప్రత్యయాంశమునకుముందు ऋ కారము, अर् గా మారును. షష్ఠీ బహువచనములో नाम् ప్రత్యయమందు ఋ కారానికి దీర్ఘము వచ్చును. 'నృ' అనే ప్రాతిపదికకు नाम् చేర్చునపుడే ఈ మార్పు వైకల్పికము. ఋకార స్థానంలో अर् ను గ్రహించడంతో సప్తమ్యేకవచనము సిద్ధించును. ఏకవచనద్వివచనములు ప్రథమావిభక్తిని పోలివుండును.

పుంలిఙ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| పంచమీ | नेतुः | नेतृभ्याम् | नेतृभ्यः |
| షష్ఠీ | नेतुः | नेत्रोः | नेतॄणाम् |
| సప్తమీ | नेतरि | नेत्रोः | नेतृषु |
| సం. | नेतर् | नेतारौ | नेतारः |

ఋకారాంత నపుంసకలిఙ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| పంచమీ | कर्तृणः | कर्तृभ्याम् | कर्तृभ्यः |
| షష్ఠీ | कर्तृणः | कर्तृणोः | कर्तॄणाम् |
| సప్తమీ | कर्तृणि,कर्तरि | कर्तृणोः | कर्तृषु |
| సం. | कर्तृ | कर्तृणी | कर्तॄणि |

ఉకారాంతపుంలిఙ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| పంచమా | गुरोः | गुरुभ्याम् | गुरुभ्यः |
| షష్ఠీ | गुरोः | गुर्वोः | गुरूणाम् |
| సప్తమీ | गुरौ | गुर्वोः | गुरुषु |
| సంబోధన. | गुरो | गुरू | गुरवः |

ఉకారాంతపుంసకలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| పంచమీ | मधुनः | मधुभ्याम् | मधुभ्यः |
| షష్ఠీ | मधुनः | मधुनोः | मधूनाम् |
| సప్తమీ | मधुनि,मधौ | मधुनोः | मधुषु |
| సంబోధన | मधो, मधु | मधुनी | मधूनि |

పదములు

अनुज्ञा స్త్రీ. ఆజ్ఞ

अप्रिय వి. ప్రియము కానిది

अर्जुन పుం. పాండుకుమారుడు

अलङ्घनीय విణ. దాటశక్యముగానిది, జవదాటరానిది

अलम् అ. తగినంత, చాలును. ఈ అవ్యయాన్నితరచుగా తృతీయావిభక్తితో ఉపయోగింతురు. ఉదా :- अलं विवादेन

अवस्तु న. వస్తువుకానిది, యథార్థంకానిది

अवस्त्वारोप పుం. వస్తువు కానిదానిని ఆరోపించుట

आदर పుం. గౌరవము

आरोप పుం. ఆరోపించుట

आर्य పుం. గౌరవించదగినవాడు

इच्छा స్త్రీ కోరిక

इन्दु పుం. చంద్రుడు

उत्कण्ठा స్త్రీ. వ్యాకులము

उत्साह పుం. ఉత్సాహము

कर्ण పుం. కర్ణుడు

कलङ्क పుం. మచ్చ

कारुण्य న. దయ

कुरु పుం. ఒకదేశముపేరు

कृतज्ञता స్త్రీ. కృతజ్ఞత, చేసిన మేలుతలచుట

ज्ञाति పుం.సంబంధీకుడు , పాలివాడు

तनु వి. చిన్నకొద్దిపాటి

तूल పుం. దూది, పత్తి

द्विज పు. మూడువర్ణములలో ఒకడు (బ్రాహ్మణుడు)

नृ పుం. మనుజుడు

निर्बन्ध పుం.నిర్బంధము,ఇబ్బంది

निशित విణ. పదునైన,చురుకైన

पथ्य న. పథ్యము

पशु పుం. పశువు     पात పుం. పడు, పాతము

पितृव्य పుం. తండ్రికి సోదరుడు  बन्धु పుం. బంధువు

भारतवर्षीय పుం. భారత వర్షీయుడు, భారత దేశమునకు చెందినవాడు.

लङ्घ् (ప్ర.గ.ఆ.ప.) దాటుట   श्रोतृ పుం. వినువాడు

वक्तृ పుం. మాట్లాడువాడు  वस्तु న. వస్తువు

वार्ता స్త్రీ. వార్త      विभव పుం. ధనము, ఐశ్వర్యము

वैकुण्ठ న. విష్ణువునివసించుస్థలము

साधु పుం. ఋషి, దయగలవాడు   स्रष्टृ పుం.న. సృష్టికర్త, బ్రహ్మ
వి. మంచి

रमा స్త్రీ. ఒకస్త్రీపేరు     लक्ष्मी స్త్రీ, విష్ణువుభార్య, ధనాధిదేవత

भूत న. భూతము, జంతువు     भ्रातृ పుం. అన్న

मद పుం. మైకము, మత్తు     मुख्य వి. ముఖ్యమైన

मृग పుం. జింక, వేట     मृत्यु పుం. మృత్యువు, చావు

रघु పుం. రఘువు -రఘువంశమునకు సంబంధించినవారు

राघवः राघवौ रघवः

తెలుగులోనికి అనువదించుము

तरोः पुष्पाण्यपतन् ।     शंभोः कृपया कल्याणं भवति ।

गुरूणामादेशाननुरुध्यामहे। साधवो मृत्योर्भयं न गणयन्ति ।

पितरि रामस्य परम आदरः । विश्वस्य स्त्रष्टुरिच्छाऽलङ्घनीया ।

द्वेष्टृणामुत्साहं न सहते । इन्दौ कलङ्को दृश्यते ।

रामो बन्धुषु स्नेहेन वर्तते । मधुनि माधुर्यमस्ति ।

नृषु साधुः श्रेष्ठः । दातृभ्यो धनं लभन्ते ।

कुरुभ्यो दूत आगच्छत् । पितृव्यः पितुर्भ्राता ।

वस्तुन्यवस्त्वारोपोऽज्ञानम् । बाह्वोर्बलेन पृथ्वीमजयत् ।

भीमस्य भ्रातर्यर्जुने कर्णो बाणानमुञ्चत् ।

तूलस्य राशावग्नेरिव मृदुनि मृगस्य शरीरे निशितस्य बाणस्य पातः ।

तनुषु विभवेषु ज्ञातिभिस्त्यज्यन्ते नराः । पशुष्वपि कृतज्ञता दृश्यते ।

कन्यां जामातुर्गृहं नयति ।

श्रोतृणां निर्बन्धात्कथामारभत । अप्रियस्यापि पथ्यस्य वक्तृणि

परमं कारुण्यं साधूनां भूतेषु । मित्रेऽलं क्रोधेन ।

नप्तुर्लाभेऽतीवोत्कण्ठा भारतवर्षीयाणाम् ।

సంస్కృతములోనికి అనువదించుము

రాముడు రఘు వంశీయులలో ముఖ్యుడు.

నేను రచయిత నుండి పుస్తకమును పొందితిని.

లక్ష్మి విష్ణువుయొక్క భార్య.

---

ప్రథమా ఏకవచనములో ఈ పదము చివరిలో స్ చేరును. लक्ष्मीः

[illegible] తన శ్రోతలనుండి క్షమాపణలను యాచించెను.

[illegible] తన మనువుల యొక్క రథమును చూచెను.

[illegible]నారాయణుడు హరియొక్క అల్లుని గుఱ్ఱములను చూసెను.

ఆర్యులు కురుదేశములో నివసించిరి.

వృక్షముపై ఒక చిలుక కూర్చున్నది.

హరియొక్క మనుమడి భృత్యుడు ఒకగ్రామమునకు వెళ్ళెను.

కర్ణుడు దాతలలో ప్రథముడు.

సింహము జంతువుల యొక్క ప్రభువు.

హరి రమ భర్తయొక్క స్నేహితుడు.

చంద్ర బింబము వృద్ధి చెందుచు క్షీణించుచుండును.

తన అన్నయగు రాముని ఆజ్ఞచే లక్ష్మణుడు సీతను అడవిలో వదిలిపెట్టెను.

సృష్టికర్తనుండి ప్రపంచము పుట్టినది.

ఆమె తన భర్తనుండి వార్తను అందుకొనెను.

తన బాహుబలంచేత అతడు శత్రువులను జయించెను.

పర్వతములకు తీవ్రమైన వాయువు నుండి కూడా భయంలేదు.

బుధజనులు శిశువులనుండి కూడా జ్ఞానము పొందెదరు.

ఓ శంభు ! పాపములు నాహృదయమును పీడించుచున్నవి.

దైవములయందు మిక్కిలిభక్తి మునులలో చూడబడును.

పక్షులు వృక్షములయొక్క కొమ్మలపై కూర్చుండును.

భృత్యులు తమప్రభువుల యొక్క ఆజ్ఞను ఉల్లంఘించరు.

ఆమె తనభర్తనుండి తన తల్లియింటికి పోవుటకు అనుమతిని
వైకుంఠంలో నివాసము విష్ణుభక్తులకు లభించును. పొందెను.

పరీక్ష

1.ఈ క్రింది శబ్దరూపములను వ్రాయండి .

(1) పుంలిఙ్గ శబ్దరూపమును నపుంసకలిఙ్గ శబ్దరూపములను వ్రాయుము. द्रष्टृ,मनु, जामातृ, धातृ , देवृ , नृ, शत्रु, विभु , वायु भ्रातृ , स्रष्टृ

(2) నపుంసకలిఙ్గ రూపములను వ్రాయుము.

मधु , अश्रु , वस्तु

2. ఉకారాంత, ఋకారాన్త పుంలిఙ్గ,నపుంసకలిఙ్గ శబ్దాలను ఇ కారాంతశబ్దములతో పోల్చిచూడండి.

3. ఋకారాంత పుంలిఙ్గ శబ్దములు మొదటి ఐదు రూపాలలో ఏమార్పులను పొందుతాయి.

4. ష్, ఛ్ గా ఎప్పుడు మారును? అదిఎప్పుడు నియతం, ఎప్పుడు ఐచ్ఛికం లేదా వైకల్పికము?

# ఇరువది ఒకటవ పాఠము

( నామవాచకములు - మరి కొన్ని )

इ,उ,ई,ऊ కారాంత స్త్రీలిఙ్గశబ్దములు.

ఊకారాంత స్త్రీలిఙ్గ శబ్దరూపములు, ఈకారాంత స్త్రీలిఙ్గ శబ్దములను పోలియుండును.

ఉదాహరణం - గౌరీ గౌర్యౌ గౌర్యః

వధూః వధ్వౌ వధ్వః

ఇకార, ఈకార, యకారముల స్థానంలో 'ఉ' కార ,' ఊ' కార 'వ 'కారములు వచ్చును.

ఊకారాంతస్త్రీలిఙ్గ ప్రథమైకవచనము చివరిలో स् వచ్చును.

ఉదా - वधूः - चमूः

ఇకారాంత , ఉకారాంత స్త్రీలిఙ్గశబ్దములలో తృతీయైకవచన ప్రత్యయం आ అగును. అట్లే ద్వితీయాబహువచన ప్రత్యయము स् అగును.

ఉదాహరణం - నద్యా - ధేన్వా

నదీః - ధేనూః

ఈ శబ్దముల ఇతర విభక్తి రూపములు ఇకారాంత ఉకారాంత పుంలిఙ్గ శబ్దములను పోలియుండును.

చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ, ఏకవచనరూప విషయంలో ఈకారాంత, ఊకారాంతస్త్రీలిఙ్గ శబ్దరూపములను పోలినరూపములే ఐచ్ఛికముగా వచ్చును.

ఉదాహరణం - మత్యై - మతయే చ.

మత్యాః - మతేః పం.

మత్యాః - మతేః ష

మత్యాం - మతౌ స

ఇక్కడ మత్యై మత్యాః మత్యాం అను రూపములు, ఈకారాంతమగు గౌరీశబ్దముయొక్క రూపములైన గౌర్యై, గౌర్యాః, గౌర్యాం అను వానిని పోలియున్నవి.

ఋకారాంత స్త్రీలిఙ్గశబ్దములలో బంధుత్వ వాచకములు స్వసృ - మాతృ - దుహితృ - ననాంధృ - యాతృ అనునవి అట్టి శబ్దములు. ఈశబ్దములలో ద్వితీయా బహువచనమునకు చివర స్ అను ప్రత్యయము వచ్చి అంతకుముందున్న ఋకారమునకు దీర్ఘము వచ్చును.

नॄः । स्वसॄः । मातॄः । ननान्दॄः । दुहितॄः यातॄः । అన్యథా స్వసృ శబ్దము పుంలిఙ్గములైన నప్తృ, గన్తృ శబ్దములను పోలియుండును.

स्वसा स्वसारौ स्वसारः ।

स्वसारम् स्वसारौ स्वसॄः ।

పౌత్రు దుహితృ వంటి తదితరశబ్దములు పితృశబ్దమును పోలియుండును.

माता मातरौ मातरः
दुहिता दुहितरौ दुहितरः

శ్రోతృ, గన్తృ వంటి ఋకారాన్తములైన విశేషణవాచక శబ్దములకు స్త్రీలిఙ్గములో ఈకారము వచ్చును.

ఉదా - శ్రోత్రీ - గన్త్రీ

श्वश्रू

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్రథమా | श्वश्रूः | श्वश्वौ | श्वश्वः |
| ద్వితీయా | श्वश्रूम् | श्वश्वौ | श्वश्रूः |
| తృతీయా | श्वश्वा | श्वश्रूभ्याम् | श्वश्रूभिः |
| చతుర్థీ | श्वश्वै | श्वश्रूभ्याम् | श्वश्रूभ्यः |
| పంచమీ | श्वश्वाः | श्वश्रूभ्याम् | श्वश्रूभ्यः |
| షష్ఠి | श्वश्वाः | श्वश्वोः | श्वश्रूणाम् |
| సప్తమీ | श्वश्वाम् | श्वश्वोः | श्वश्रूषु |
| సంబోధన | हे श्वश्रु | हे श्वश्वौ | हे श्वश्वः |

## मति

| | ఏక | ద్వి | బహుం |
|---|---|---|---|
| ప్రథమా | मतिः | मती | मतयः |
| ద్వితీయా | मतिम् | मती | मतीः |
| తృతీయా | मत्या | मतिभ्याम् | मतिभिः |
| చతుర్థీ | मत्यै, मतये | मतिभ्याम् | मतिभ्यः |
| పంచమీ | मत्याः, मतेः | मतिभ्याम् | मतिभ्यः |
| షష్ఠి | मत्याः, मतेः | मत्योः | मतीनाम् |
| సప్తమీ | मत्याम्, मतौ | मत्योः | मतिषु |
| సంబోధన | हे मते | हे मती | हे मतयः |

## धेनु

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | धेनुः | धेनू | धेनवः |
| ద్వితీయా | धेनुम् | धेनू | धेनूः |
| తృతియం | धेन्वा | धेनुभ्याम् | धेनुभिः |
| చతుర్థీ | धेन्वै, धेनवे | धेनुभ्याम् | धेनुभ्यः |
| పంచమీ | धेन्वाः, धेनोः | धेनुभ्याम् | धेनुभ्यः |
| షష్ఠి | धेन्वाः, धेनोः | धेन्वोः | धेनूनाम् |
| సప్తమీ | धेन्वाम्, धेनौ | धेन्वोः | धेनुषु |
| సంబోధన | हे धेनो | हे धेनू | हे धेनवः |

मातृ

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | माता | मातरौ | मातरः |
| ద్వితీయా | मातरम् | मातरौ | मातॄः |
| తృతీయా | मात्रा | मातृभ्याम् | मातृभिः |
| చతుర్థీ | मात्रे | मातृभ्याम् | मातृभ्यः |
| పంచమీ | मातुः | मातृभ्याम् | मातृभ्यः |
| షష్ఠీ | मातुः | मात्रोः | मातॄणाम् |
| సప్తమీ | मातरि | मात्रोः | मातृषु |
| సంబోధన | हे मातः | हे मातरौ | हे मातरः |

పదములు

స్త్రీలిఙ్గములు [1]

आङ्ग्लभूमि ఇంగ్లండు ननान्दृ భర్తయొక్క చెల్లెలు, అక్క मुक्ति విడుదల, మోక్షము

अनुरक्ति ప్రేమ नीति నీతి, రాజనీతి मूर्ति ప్రతిమ

---

1. పైన సూచించిన స్త్రీలిఙ్గపదములలో చాలవరకు 'క్తిన్' అనే ప్రత్యయమును ధాతువునకు చేర్చుటచే ఏర్పడినవే. నీతి, గతి, మతి, సృష్టి, బుద్ధి మున్నగునవి అట్టి పదములే. 'క్తిన్' ప్రత్యయాంతాలు స్త్రీలిఙ్గములు అని గుర్తుంచుకొనవలెను.

कान्ति కాంతి, సౌందర్యము
प्रकृति ప్రకృతి స్వభావము,తొలిరూపు
प्रतिकृति ప్రతిమా, ప్రతిరూపము
कीर्ति కీర్తి
यातृ తోటికోడలు
रात्रि రాత్రి
गति గమనము
प्रीति సంతోషము,
रति సంతోషము, మన్మథునిభార్య
जाति కులము
बुद्धि బుద్ధి
वधू యువతి,కోడలు
दुष्कृति చెడ్డపని
भक्ति భక్తి
वसति నివాసస్థలము
दुहितृ బిడ్డ,కూతురు
भूति ఐశ్వర్యము,సంపద
वृत्ति వృత్తి
धृति ధైర్యము
भूमि భూమి
स्मृति జ్ఞాపకంచేసుకొనుట హిందున్యాయశాస్త్రం ధర్మశాస్త్రము
धेनु ఆవు
मातृ తల్లి
श्वश्रू అత్త
सृष्टि సృష్టి
श्रुति వినుట, వేదము
सुकृति పుణ్యము, మంచిపని
स्वसृ అక్క, సోదరి
स्तुति స్తుతి, పొగడుట
आङ्ग्ल పుం. ఆంగ్లేయుడు
ऋष्यशृङ्ग పుం.దశరథుని అల్లుడు
ध्यान న.ధ్యానము
धीर పుం.ధైర్యవంతుడు
निन्दा స్త్రీ.నింద
बहु విణ. చాలా
आश्रम పుం.ఆశ్రమము
निपुण వి.నేర్పరి
मदन పుం.మదనుడు
मन्द వి.మెల్లిగా
पर విణ.గొప్ప
विकास పుం.అభివృద్ధి
विवर న.బొరియ

उद्+पद (చ.గ.ఆ.ప.) ఉత్పత్తిచేయుట    लोभ పుం.ఆశ

एलापुर న.పట్టణముపేరు ,వేలూరు    परिणाम పుం.ఫలితము

अधि + कृ గుర్తింపు अधिक्रियते(క.ప్ర)    पश्चात् అవ్య. తరువాత

पिण्ड పుం.పిండము, అన్నపుముద్ద    चिह्न న.చిహ్నము

चल् (ప.ప.ప్ర.గ.)చలిఇమ్పుట    शम्बूक పుం.ఒకవ్యక్తి

शान्ता స్త్రీ.రాముని చెల్లెలుపేరు    प्रकर्ष పుం.గొప్పదనము

शौर्य న.శౌర్యము    शूद्र పుం.శూద్రుడు

प्र + सृ పారుట, వ్యాపించుట    संनिधि పుం.సామీప్యము

सुजन పుం. మంచివ్యక్తి, మనుష్యుడు

आ + प्रच्छ्(पृच्छ)(ఆ.ప).సెలవు తీసుకొనుట

अभि + धा (धी)పిలువబడుట,పేరిడుట, अभिधीयते(క.ప్ర.)

आ + श्लिष् (చ..గ.ప.ప.) కౌగలిఇమ్పుట

नि + सद (सीद्)(निषीद्)(ప్ర.గ.ప.ప.) కూర్చొనుట.

स्निह् (చ..గ. ప.ప.)ప్రేమించుట, స్నేహముచేయుట

తెలుగులోనికి అనువదించుము.

सुजनस्य कीर्तिर्लोके प्रसरति ।    संकटे धीरो धृतिं न मुञ्चति ।

रामः प्रीत्या पुत्रमाश्लिष्यति ।    मुक्तये देवं भजति ।

यक्षाणां वसत्या आगच्छत् ।    दुःखं दुष्कृतेरुत्पद्यते ।

मदनो रतेर्वल्लभः ।    सृष्ट्या पालक ईश्वरः ।

बुद्धेः प्रकर्षः कीर्तये भवति । भूमौ निषीदति ।

रघोः पिता वसिष्ठस्य धेनुमरक्षत् । श्रुत्यां यज्ञः उपवर्ण्यते ।

नारायणस्य कृतयो हरेः प्रीत्यै न भवन्ति ।

मूर्खाणां स्तुतीर्निन्दां वा न गणयन्ति बुधाः ।

प्रकृतिभिः नृपः सेव्यते । गोपो धेनू रक्षति ।

वध्वो नद्या जलमानयन्ति । श्वश्रूर्जामातरि स्निह्यति ।

चन्द्रस्य कान्तिं पश्यसि । सुकृतीनां फलमनुभवति ।

लोभेन बुद्धिश्चलति । हरिः प्रकृत्या साधुर्भवति ।

रामः पितृभ्यः पिण्डानयच्छत् । स्मृत्यां धर्मः कथ्यते ।

जामातुर्ऋष्यशृङ्गस्याश्रमं रामस्य मातरोऽगच्छन् ।

यातॄर्ननान्दरं चापृच्छत्,सीता पश्चादगच्छत्पितुर्गृहम् ।

సంస్కృతములోనికి అనువదించుము.

సీత ఋష్యశృంగునకు నమస్కరించెను.

ఆయన సీతయొక్క ఆడపడుచుభర్త.

విశ్వామిత్రుడు కులము చేత క్షత్రియుడు. ఆతరువాత అతడు బ్రాహ్మణుడాయెను.

శంబూకుడు వృత్తిచేత కాపు.

సీత ఎల్లప్పుడు తనయొక్క అత్తను సంతోషపెట్టును.

రాజుయొక్క మంత్రి రాజనీతిలో నేర్పరి.

స్మృతులలో మనువు యొక్క స్మృతి ఉత్తమము.

మహారాష్ట్రలోని యువతుల వినమ్రత స్తుతియోగ్యమైనది.

రాముడు తన సోదరి శాంతను చూచెను. తల్లికి నమస్కరించెను.

రాముడు అతని కులమును గూర్చి ప్రశ్నించెను.

జనులు అభ్యుదయమును కోరెదరు.

ఆంగ్లేయులు ఆంగ్లదేశమునుండి ఇక్కడకు వత్తురు.

వేలూరు గ్రామంవద్ద వున్న గుహలలో పెక్కు దైవప్రతిమలు

హరి అనేక రాత్రులను ధ్యానములో గడిపెను. వున్నవి.

కృష్ణునికి [2]చాలామంది కుమార్తెలు ఉండిరి.

వీరత్వము యశమును కల్పించును.

మనిషి యొక్క స్వభావము అతని చేష్టల వలన తెలియును.

నారాయణుని యొక్క నాశనము అతని దుశ్చేష్టల ఫలితమే.

ధైర్యము మానవునకు గొప్ప అలంకారము.

భగవంతునియందు అప్రతిమానప్రేమయే భక్తి అనబడును.

సీతయొక్క ముఖము కాంతిమంతమగు చంద్రబింబమువలె వున్నది.

మానవునిలోని ప్రతిభావికాసము ఉపదేశ ఫలమే.

---

1 ఇక్కడ "నీ" ధాతువును ప్రయోగించవలెను.

2 ఇక్కడ కృష్ణ శబ్దమును షష్ఠీ విభక్తిలో, దుహితృ శబ్దాన్ని ప్రథమా విభక్తిలోనూ ప్రయోగించి 'అస్' ధాతువును ప్రయోగించవలెను.

ఏనుగు గతి మందముగా నుండును.

తండ్రి తన కుమార్తెలకు బహుధనము నిచ్చెను.

సోదరి ఇచ్చిన ఉపహారము ఆమె స్నేహ చిహ్నము.

అభ్యాసము

1. ఊకారాంతస్త్రీలిఙ్గశబ్దములను ఈకారాంత స్త్రీలిఙ్గ శబ్దములతో పోల్చిచూడండి.

(అ) ఇకారాంత, ఉకారాంత స్త్రీలిఙ్గ శబ్దములలోని మత్యై,ధేన్వై వంటి రూపములు ఏ రూపములను పోలియుండును.?

(ఆ) స్వసృ, మాతృ, పితృ, నప్తృ, గన్తృ మొదలగు వానిని పరస్పరం పోల్చండి.

2. ఉకార, ఋకారాంతములైన విశేషణవాచకశబ్దముల స్త్రీలిఙ్గ రూపములు ఎట్లు ఏర్పడును?

3. ననాంద్రృ, స్వసృ, రుచి, కీర్తి, వధూ, రజ్జు, నీతి, పృథు మొదలగు శబ్దరూపములను వ్రాయండి.

# ఇరువది రెండవపాఠము

క్రియలు "लोट्" (ఆజ్ఞార్థక ప్రయోగాలు)

పరస్మైపదప్రత్యయములు.

| | ఏక, | ద్వి, | బహు |
|---|---|---|---|
| ప్రథమ | तु ,तात् | ताम् | अन्तु |
| మధ్యమ | - , तात् | तम् | त |
| ఉత్తమ | आनि | आव | आम |

| | | | |
|---|---|---|---|
| ప్రథమ | वदतु , वदतात् | वदताम् | वदन्तु |
| మధ్యమ | वद , वदतात् | वदतम् | वदत |
| ఉత్తమ | वदानि | वदाव | वदाम |

ధాతువులకు లోట్ లకార ప్రత్యయమును చేర్చుటకు ముందు ఆయా వికరణ చిహ్నములు కూడచేరును.

ఉదా - वद् + अ + तु

పదములు

अनृत న.అసత్యము दुर्ग న.దాటరానిది पूज्य విశ.గౌరవించ దగిన
आभिधान న.పేరు दृढम् న.దృఢంగా దగ్గరగా प्रतिक्रिया స్త్రీ. ప్రతీకారము
पाठ పుం.పాఠము पितृ ద్వి. తల్లిదండ్రులు

**डिम्भ** పుం.శిశువు,పిల్లవాడు **रस** పుం.రసము **वि + श्रम्** విశ్రాంతి

**भद्र** న.మంచి కల్యాణము, శుభమునొందుట

**अनु + भू** అనుభవించుట **सत्त्व** న.మంచితనము, సత్యము

ఒక జీవము,జంతువు

**प्र + मद्**(చ.గ.ప.ప.) తప్పుట,పొరబడుట, ప్రమాదమునకులోనగుట

**मा** అ.లేదు,వలదు,కాదు, నిషేధార్థకం

**प्र +सद् ( सीद् )**ప్ర.గ.ప.ప.ప్రసన్నతను చెందుట

**वंश** పుం.వంశము **वत्स** పుం.పిల్లవాడు

**सुवर्णकार** పుం.స్వర్ణకారుడు, కంసాలి

**सर्वदा** అ.ఎల్లవేళల **रे रे** ఆశ్చర్యార్థకం ఓరి ! ఓరి !

**वयस्य** పుం. చెలికాడు **शङ्का** స్త్రీ. సంశయము

**सोम** పుం. యజ్ఞములలో ఉపయోగించు సోమరసము.

**अनु + स्था** నెరవేర్చుట,అనుష్ఠించుట

తెలుగులోనికి అనువదించుము.

सत्त्वं जयतु । वत्स पितरं प्रणम ।

अयोध्यां दूता गच्छन्तु । पुत्रावश्वमारोहताम् ।

रे रे मा विनयं त्यजत । सख्यौ पुष्पाण्यानयतम् ।

वयस्य!उपवनं प्रविशाव । जलं त्यज घृतं पिब ।

कथं व्याघ्राणां संनिधौ निवसानि । नराणां व्याधयो नश्यन्तु ।

लोको दुर्गाणि तरतु भद्राणि पश्यतु । बालका अनृतं मा वदत ।
मयूरौ प्रासादस्य शिखरे नृत्यताम् । आसनयोर्निषीदतम् ।
भूपतयः सर्वदा प्रजा धर्मेण रक्षन्तु । डिम्भ जननीमाह्वय ।
जनाः सदानन्दमनुभवन्तु । शत्रोः प्रतिक्रियामुपदिशत ।
पितरौ प्रसीदतम् । सत्यान्मा प्रमाद्याम ।
सुवर्णकारस्सुवर्णं तोलयतु । पित्रोर्गुरोश्च वचनमनुतिष्ठ ।
विश्राम्यन्तु पान्थास्तरोश्छायायाम् । पूज्यान्पूजय ।
क्षालयतां हस्तौ बालौ ।

సంస్కృతములోనికి అనువదించుము.

మీ సోదరుని నామము చెప్పుము.

బాలులారా ! పాఠశాలకు పోయి మీపాఠములను నేర్చుకొనుడు.

దేవుడు రాజును రక్షించుగాక !

మనము ధీమంతుల ఉపదేశము అనుసరించెదము గాక !

దేవతలు తృప్తినొందెదరుగాక !

ఓ హరీ ! ఓ మాధవా ! ప్రలాపములు చేయవద్దు.

రాముని యొక్క ఫలప్రాప్తి[1] గూర్చిన సందేహమును విడువుము.

ప్రజల శత్రువులు ఆ విధంగా నశించెదరు గాక !

పేదవారికి ధనము నివ్వుము.

---

1. ఇక్కడ సప్తమీ ప్రయోగముండును

మూర్ఖుడా అగ్నిని తాకవద్దు.

అతడు తనవంశముయొక్క గొప్పచరితములను స్మరించుగాక !

మనము జనుల స్తుతులకు అర్హులమగుదుము గాక !

మనము మన మిత్రుల తప్పులు క్షమించెదము గాక !

బాలకా ! నీ తండ్రిని గాఢముగా కౌగలిఞ్చుకొనుము.

హరి మనస్సు కోపంచేత క్షోభింప బడకుండుగాక !

బాలులారా ! మృగజంతువులను కష్టపెట్టవద్దు ! ( तुद् )

మనము పాపములో కొట్టుకొన కుందుము గాక ! ( लुठ )

గోపాలుడు గోవులను ఇంటికి తీసుకొని పోవుగాక !

జనులకు బంగారముపైనున్న దురాశ నశించుగాక !

కుమారులిద్దరు తమ తల్లిని ప్రసన్నురాలిని చేయుదురుగాక !

భిక్షుకులు ధాన్యమును ఏరుకొందురు గాక !

మూర్ఖులు ప్రగల్భములు పలుకుదురు గాక !

## ఇరవదిమూడవ పాఠము

క్రియలు

లోట్ ( ఆజ్ఞార్థకము )

ఆత్మనేపదరూపములు.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర.పు. | ताम् | इताम् | अन्ताम् |
| మ.పు. | स्व | इथाम् | ध्वम् |

| | | | |
|---|---|---|---|
| ఉ.పు. | ऐ | आवहै | आमहै |
| | मोदताम् | मोदेताम् | मोदन्ताम् |
| | मोदस्व | मोदेथाम् | मोदध्वम् |
| | मोदै | मोदावहै | मोदामहै |

## ధాతువులు

वि+जि ఆ.ప. జయించుట — प्रति+पद् అడుగిడుట
मन् చ.గ.ఆ.ప.ఆలోచించుట — పూనుకొనుట
अव्+लम्ब् ప్ర.గ.ఆ.ప.వ్రేలాడుట, అవలంబించుట
प्र+वृत् ప్రవర్తించుట

## పదములు

अभिलाष పు.కోరిక,అభిలాష — आचार పు.ఆచారము,ప్రవర్తన
ऋजुता స్త్రీ.సూటియైన స్వభావముగల — खल పు. దుష్టుడు
देवदत्त పు.ఒక వ్యక్తిపేరు — सूनु పు.కొడుకు
पात्र న.యోగ్యతగలవ్యక్తి, వస్తువు — प्रश्रय పు.మంచితనము
पार्थिव పు.రాజు — समृद्धि స్త్రీ.సమృద్ధి
विद्या స్త్రీ.విద్య

## తెలుగులోనికి అనువదించుము

शत्रुभिः सह युद्ध्यस्व । चित्तं स्वास्थ्यं लभताम् ।

प्रजाया हिताय पार्थिवाः प्रवर्तन्ताम् । कन्ये गीतं शिक्षेताम् ।
नरा धान्यस्य समृद्ध्या मोदन्ताम् । भर्तारं सेवेथाम् ।
जनानां धर्मेऽभिलाषो वर्धताम् । कथं दुःखं सहै ।
कीर्तये यतामहै । भूपते विजयस्व ।
भ्रातुर्गुणान् मा श्लाघध्वम् । आचारं प्रतिपद्येताम् ।
प्रकाशन्तां पराक्रमेण नृपस्य सूनवः। शृगालौ म्रियेताम् ।
शोभन्तां तरवः फलानामुद्गमेन । वार्ताः श्रूयन्ताम् ।
दुराचारेभ्यः कल्याणं मा शंसध्वम् । प्रश्रयमवलम्बस्व ।
रमतां चित्तं छात्राणां विद्यायाम् । सङ्गीतमारभामहै ।
प्रजानां कल्याणाय क्लेशाःसह्यन्तां नृपैः। प्रेक्षस्व वनस्य शोभाम् ।
संकटेऽप्यनृतं मा भाषावहै । मानिष्टमाशङ्केथाम् ।
शिष्या गुरून् वन्दध्वम् ।

సంస్కృతములోనికి అనువదించుము

రాజద్రోహులారా! భయముతో కంపించండి.

నీవు మామిడిపండును రుచిచూడుము.

మీరు సంస్కృత అధ్యయనము ప్రారంభింపుడు.

భగవంతుని ఆజ్ఞలను మనము శిరసావహించెదముగాక!.

చంద్రుడు ప్రకాశించుగాక!.

రెండు పుస్తకములను ఇక్కడకు తీసుకొవచ్చెదరుగాక !

మీరిద్దరు దేవదత్తుని శత్రువుగా భావించుట లేదా?,

జనుల అభ్యుదయము పట్ల సంతోషించుము.

ఓ మూర్ఖుడా! చావుము.

జనులు తమ దుష్టకార్యముల వలన సిగ్గుపడెదరుగాక!

ఔషధము యొక్క గుణము పరీక్షించ బడుగాక!

అర్థులకు సంపదలివ్వబడుగాక!

జనులు సత్యమును సర్వదా అన్వేషింతురుగాక!

పాపులను పొగడవద్దు.

వృక్షపు కొమ్మలనుండి పక్షులు ఎగురుగాక.

ఋజువర్తనమును చూసి ధూర్తులు (నవ్విన) నవ్వునివ్వు.

ధాన్యపురాశులు బ్రాహ్మణులకు యివ్వబడునుగాక!

రాజునకు పుత్రుడు జన్మించుగాక!

నీవు నీకోరికలను పొందెదవుగాక!

నేను మాతండ్రి ఆజ్ఞను ధిక్కరించకుండెదనుగాక!

మనమిద్దరము శత్రువులను జయింతుముగాక!

భృత్యుడు చేసిన తప్పులను యజమాని క్షమించునుగాక!

ధనమును కష్టపడి సంపాదించుము,యాచించవద్దు.

ఇద్దరు పిల్లలు అపూపమును రుచి చూచెదరుగాక!

మనమిద్దరము యుద్ధములో చంపబడక ఉండెదముగాక!

# ఇరువది నాల్గవపాఠము

ధాతువునకు కృత్ప్రత్యయములు చేర్చుటవలన ఏర్పడు రూపములకు కృదంతములని పేరు. అందులో ఒకటి ' క్త 'ప్రత్యయము. ధాతువునకు ' క్త ' ప్రత్యయమును చేర్చుట వలన ' క్త 'ప్రత్యయాంత రూపమేర్పడును. దీనినే నిష్ఠా రూపమని అందురు. ఇది భూత కాలకర్మణి ప్రయోగార్థమును తెలుపు కృదంతము. ఉదా - श्रु+त = श्रुत (క్తప్రత్యయములోని క్ లోపించును) ఈ కృదంత రూపమునకు సుప్ ప్రత్యయములు చేరి మూడు లిఙ్గములలో వీని శబ్దరూపములేర్పడును.

| పుం. | స్త్రీ. | న. |
|---|---|---|
| श्रुतः | श्रुता | श्रुतम् |
| (వినబడెను) | (వినబడెను) | (వినబడెను) |

పైమూడు శబ్దములు వరుసగా రామశబ్దమును రమాశబ్దమును జ్ఞానశబ్దమును పోలియుండును.

तुमुन् ప్రత్యయరూపము:- ధాతువునకు తుమున్ ప్రత్యయం చేరుటవలన ఈ రూపము ఏర్పడును.

श्रु+तुम् = श्रोतुम् ( వినుటకు ) ( దీనికి విభక్తిరూపములుండవు. ఇది అవ్యయ ప్రాయము. )

क्त्वा, ल्यप् ప్రత్యయములు - श्रु + त्वा = श्रुत्वा (విని) ' క్త్వా '

ప్రత్యయములోని ' क ' కారము లోపించును. ఒకవేళ ధాతువునకు ముందు ఉపసర్గచేరినచో ఇదే అర్థమును సూచించుటకు ' క్త్వా ' ప్రత్యయమునకు ' ल्यप् ' ఆదేశమగును.' ल्यप् ' ప్రత్యయంలో ' य ' కారము మాత్రమే మిగులును. अनु+भूय (అనుభవించి). ఒక వేళధాతువు చివర హ్రస్వమైన అచ్చుఉండి ధాతువుముందు ఉపసర్గ చేరినచో ఈ ल्यप् ప్రత్యయమునకు ముందు త్ అను ప్రత్యయము ఆగమంగా వచ్చి చేరును. अनु+कृ+त्य = अनुकृत्य, सं+हृ+त्य = संहृत्य क्त्वा, ल्यप् ప్రత్యయాంత రూపములు. తుమున్నంత రూపములవలెనే అవ్యయ ప్రాయములు. వీనికి విభక్తిరూపములుండవు.' य् ' కారము తప్ప తదితర కృత్ప్రత్యయములు చేర్చుటకు ముందు చాలా ధాతువులకు इट् (इ) ఆగమంగా వచ్చును. इट् ఆగమంగా వచ్చు ధాతువులను, सेट् ధాతువులని, इट् ఆగమంగా రాని ధాతువులను अनिट् ధాతువులని వ్యవహరింతురు. ప్రాయికముగా ధాతువుల చివరిలో హ్రస్వమైన అచ్చు వున్నచో వానికి इट् ఆగమము రాదు. ఈ అంశము చాలా విస్తృతమైనది. మున్ముందు గమనించవచ్చును. ' శతృ,శానచ్ ' ప్రత్యయములు రెండుకూడ వర్తమాన వాచక కృదంతములే. ఈ ప్రత్యయములను ఆయా ధాతువులకు చేర్చుటకు ముందు ధాతువుయొక్క ఆయాగణములకు చెందిన చిహ్నములను చేర్చవలెను. शतृ ప్రత్యయమును పరస్మై పద

ధాతువునకు शानच् ప్రత్యయమును ఆత్మనేపద ధాతువునకు చేర్చవలెను. शानच् లో आन అనురూపము మిగులును. ధాతువునకు చివర ఆయాగణముల చిహ్నములను చేర్చిన తరువాత ఆ రూపము ' అ ' కారాంతమైనచో आन ప్రత్యయమునకు ముందు ' మ ' కారముఆగమముగా వచ్చి అది. ' మాన ' ప్రత్యయముగా మారును. ఈ शतृ - शानच् ప్రత్యయాంతములు రెండుకూడ వర్తమానకాల అసమాపక క్రియా రూపములే.

ఉదా - गच्छ् + अ + शतृ ( अत् ) = गच्छत्

वर्त् + अ + मान = वर्तमान

ఈ शतृ - शानच् ప్రత్యయాంతములకు మూడు లిఙ్గములలోనూ విభక్తిరూపములుండును.ఉదా -

| పుం. | స్త్రీ. | నపుం. |
|---|---|---|
| गच्छन् | गच्छन्ती | गच्छत् |
| वर्तमान: | वर्तमाना | वर्तमानम् |

क्त ప్రత్యయముల (జాబితా) పట్టిక

अस् విసురుట अस्त

आप् పొందుట आप्त

कम् కోరుట कान्त

कृष् దున్నుట कृष्ट

क्रम् వెళ్లుట, क्रान्त

क्रुध् క్రోధము,వహించుట क्रुद्ध

क्रम् దాటిపోవుట क्रान्त

क्षुभ् కలతచెందుట क्षुब्ध

गम् వెళ్లుట गत

तुष् సంతోషించుట तुष्ट

दह् కాల్చుట दग्ध

दुष् దూషించుట दुष्ट

धा పెట్టుట,ధరించుట हित

नम् నమస్కరించుట नत

पच् వండుట पक्व

पुष् పోషించుట पुष्ट

बन्ध కట్టుట,ధరించుట बद्ध

भुज् తినుట,అనుభవించుట भुक्त

मस्ज् మునుగుట मग्न

मुह् మోహముచెందుట मूढ-मुग्ध

यज् పూజించుట इष्ट

रभ् ప్రారంభించుట रब्ध

रुह् మొలకెత్తుట रूढ

लुभ् లోభపడుట लुब्ध

वद् మాట్లాడుట उदित

वह् మోయుట ऊढ

क्षम् క్షమించుట क्षान्त

खन् త్రవ్వుట खात

गुह् దాచిపెట్టుట गूढ

त्यज् వదలిపెట్టుట त्यक्त

दिश् చూపించుట दिष्ट

दृश् చూచుట दृष्ट

धृष् గర్వించుట धृष्ट

नश् నశించుట नष्ट

पद् వెళ్లుట पन्न

प्रच्छ् అడుగుట पृष्ट

भज् తినుట,సేవించుట भक्त

मन् ఆలోచించుట मत

मुच् వదలిపెట్టుట मुक्त

मृ చచ్చుట मृत

युज् కలుపుట युक्त

रम् ఆడుట,రమించుట रत

लभ् పొందుట लब्ध

वच् మాట్లాడుట उक्त

वप् విత్తుట उप्त

विश् ప్రవేశించుట विष्ट

वृत् ఉండుట वृत्त
शम् శాంతించుట शान्त
सह् సహించుట,ఓర్చుకొనుట सोढ
स्पृश् స్పృశించుట स्पृष्ट
शंस् ప్రశంసించుట शस्त
श्लिष् కౌగలించుట श्लिष्ट
सृज् సృష్టించుట, వదిలివేయుట सृष्ट
हन् చంపుట हत

य व र ल లకు సంప్రసారణము అనే వ్యాకరణ కార్యము వచ్చినప్పుడు అవి క్రమముగా इ उ ऋ ऌ లు గా మారును.यज् - इष्ट ; वच् - उक्त

<u>పదములు</u>

अखिल విణ.సమస్తము
निर्+अस् వెదజల్లుట(निरस्त)
उद्यत (उद्+यम् క్తాంతము) సిద్ధము చేయబడిన,తయారుచేయబడిన
कुम्भकार పు.కుమ్మరి
क्षेत्र న.సాగుభూమి,క్షేత్రము
घट పు.ఘటము,కుండ
निर्+दिश् నిర్దేశించుట
उद्+धृ ప్ర.గ.ఉ.ప..ఉద్ధరించుట
अभिषेक పు.అభిషేకము
उटज పు.పర్ణశాల
उपाय పు.ఉపాయము
कारागृह న.కారాగారము, జైలు
कूप పు.బావి
उद्+खन् ప్ర.గ.ఉ.ప.తవ్వుట
तूष्णीम् అ.ఊరకనే,తూష్ణీ
नि+धा ఉంచుట <u>భావము</u>

निर्+नी విషయముగా ఉండుట | पङ्क పు.బురద
पीडा స్త్రీ.నొప్పి,బాధ | प्रातर् అ.ఉదయము
भज् ప్ర.గ.ఉ.ప. సేవించుట | प्रति+भाष् ప్రత్యుత్తరమిచ్చుట
అనుభవించుట | मति స్త్రీ.బుద్ధి
मद పు.గర్వము | मूल న.మూలము
मूर्च्छ् (ప్ర.గ.ప.ప.)మూర్ఛిల్లుట | यज्ञिय విశ.యజ్ఞసంబంధమైన
राजपुरुष పు.రాజపురుషుడు | आ+रुह् ఎక్కుట
प्रति+नि+वृत् తిరిగివచ్చుట, మరలుట
समर्थ వి.సమర్థము,శక్తిమంతము
सर्प పు.పాము | सम्यक् క్రి.వి.మంచిగా,బాగుగా
सारमेय పు.కుక్క | परि+हृ ప్ర.గ.ఉ.ప.తొలగించుట,
పారద్రోలుట,పరిహరించుట

తెలుగులోనికి అనువదించుము

जलं पातुं नदीमगच्छत् । | कुम्भकारेण घटः कृतः ।
हरिणा सर्पो दृष्टः । | ग्रामं गन्तुमिच्छामि ।
जनानां पीडा परिहर्तुमीश्वरः समर्थोऽस्ति ।
भार्यां त्यक्त्वा वनं गतः। | रामस्य पीडा नष्टा ।
गृहं प्रविष्टः किङ्करः । | उपायश्चिन्तितः ।
शम्बूकेन कथितां वार्तां श्रुत्वा रामोऽमुह्यत् ।

नद्यास्तीरे चिरं विहृत्योटजं निवृत्ता सीता ।

गृहं प्रविश्य क्व मातेत्यपृच्छत् ।     लक्ष्म्या मदेन स्पृष्टोऽसि ।

रामेण बहवः कूपास्तडागाश्चोत्खाताः।

एवमुक्तो हरिर्ब्राह्मणाय धनमयच्छत्।

अश्वमारोढुं मतिर्जाता ।     शत्रून् जित्वा नगरीं प्राविशत् ।

सखीभिः पृष्टा ललनाऽलज्जत ।     क्लेशः सोढः सीतया ।

पृथिव्यां चरितुं यज्ञियोऽश्वो मुक्तः।

वनात्प्रतिनिवृत्य रामो राज्यं कर्तुमारभत ।

पङ्के पतितां धेनुमुद्धरति ।     रक्षितोऽस्मि देवेन ।

बहूनि काव्यानि पठितानि हरिणा ।

आतपेन क्लान्तास्तरोर्मूलं भजामः ।

సంస్కృతములోనికి అనువదించుము

మేఘములు వాయువుచేత చెదరగొట్ట బడెను.(निरस्त)

క్షేత్రములు రైతులచే దున్నబడినవి. బీజములు విత్తబడినవి.(कृष्ट, उप्त)

ఆచార్యుడు శిష్యునికి విద్యాబోధచేసి వివాహమునకు అనుజ్ఞ నిచ్చెను.

సముద్రము వాయువు వలన కల్లోలితమైనది.(क्षुब्ध)

కుక్క యొక్క కాలి అడుగులను అనుసరించి అతడు నిర్దేశించ

బడిన ప్రదేశమునకు వచ్చెను.(अनुसृत्य, निर्दिष्ट)

రావణుని యొక్క భక్తిచేత శివుడు సంతుష్టుడయ్యెను.

దేవుడు మంచివారియొక్క హృదయములలో గుణములు

అనువిత్తనములను వుంచెను.(निहित)

మీశత్రువును జయించుటకు సిద్ధముగా నుండుము.

చాలామంది సైనికులు యుద్ధములో సంహరింపబడిరి.

ఆమె భర్తనుస్మరించి తిరిగిస్పృహను కోల్పోయినది.(स्मृत्वा, मूढ)

పట్టాభిషేక సమయంలో కారాగారమునుండి జనులందరు విముక్తిని

పొందిరి.(विमुक्त)

శిశువు చంద్రుని పట్టుకొనుటకు కోరును.( स्प्रष्टुम्)

నారాయణునిచేత తన శ్రమకు ఫలితము పొందబడినది.(लब्ध)

దేవతకు నమస్కరించి అతడు దేవాలయమునుండి తిరిగి

వచ్చెను.(निवृत्त)

హరియొక్క అపరాధములు అతని తండ్రిచే క్షమించబడినవి.(क्षान्त)

పర్వతమును అధిరోహించి అతడు సరస్సునుచూచెను.(अधिरुह्य)

భయమునకు కారణము పోయినది.

అతడు మూర్ఖులను మంచిమార్గములో నడిపించుటకు ప్రయత్నము

చేసెను.

శిశువు సముద్రతీరములో త్యజింపబడినది.(त्यक्त)

ప్రపంచముయొక్క బాధలను అనుభవించి అతడు సన్యాసి

అయ్యెను.(अनुभूय)

మార్గములో చాలా గ్రామములు సైనికులచే దహింపబడినవి.(दग्ध)

అతడు మిత్రునికి ప్రత్యుత్తరమునిచ్చి నిశ్శబ్దముగానుండెను.

హరిభార్యకు కొడుకుపుట్టెను.(जात)

ప్రాతఃకాలమున నిద్రలేచిన తరువాత మనుష్యులు

తమముఖములను కడుక్కొందురు.(उत्थाय)

రాజాధికారులచేత దొంగలు కట్టివేయబడినారు.(बद्ध)

అభ్యాసము

जीव्,ईक्ष्,जन्,स्पृश्,हृद्,स्था ధాతువులయొక్క पा,स्फुर्,अट्,निन्द्, शुभ्,अनुभ्,सह् ధాతువుల యొక్కయు 'కర్తరి', 'కర్మణి' లోట్ రూపములను వ్రాయుడు.

ఈ క్రిందివాటిని గుర్తించుము

అ. భూతకాలిక కర్మణి ప్రత్యయము- క్త ప్రత్యయాంతము.

ఆ. వర్తమాన కర్తరి ప్రత్యయము- శతృ ప్రత్యయాంతము.

ఇ. వర్తమాన కర్మణి ప్రత్యయము-.శతృ,శానచ్ లకు కర్మణి రూపములు.

ఈ. ప్రయోజనార్థక ప్రత్యయము-తుమున్నంత రూపము.

ఉ. ఉపసర్గతో ఉపసర్గలేకుండా భూతకాలిక కర్మణి ప్రత్యయము-క్త్వా,ల్యప్ ప్రత్యయాంతములు.

3) मन्,यज्,मुच्,खन्,दह्,सृज्,वह्,लभ्,रभ्,श्लिष्, మొదలగు ధాతువులకు పై ప్రత్యయములను చేర్చి రూపములను వ్రాయుడు.

4) स्था ముందున్న स కారమెప్పుడులోపించును?

# ఇరువది అయిదవపాఠము

సంస్కృత వ్యాకరణములో సాధారణంగా వుండే విభక్త్యంత ములు, ప్రత్యయములు ఏమార్పులేకుండా హలన్త పుంలిఙ్గ స్త్రీలిఙ్గశబ్దములకు చేరును. కాని ప్రాతిపదికకు కొన్ని మార్పులు కలుగ వచ్చును.వాటిని ముమ్ముందు గమనించెదము.

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్ర. | स् | औ | अस् |
| ద్వి. | अम् | औ | अस् |
| తృ. | आ | भ्याम् | भिस् |
| చ. | ए | भ्याम् | भ्यस् |
| పం. | अस् | भ्याम् | भ्यस् |
| ష. | अस् | ओस् | आम् |
| స. | इ | ओस् | सु, |

1. పుంలిఙ్గమైనా, స్త్రీలిఙ్గమైనా కొన్ని శబ్దములు మార్పులు పొందక

ఒకేరీతిగా రూపములను పొందును.

ఉదా - भूभृत् (పుం) मरुत् (పుం) दृषद् (స్త్రీ)

मरुत् పుంలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్ర.సం.ప్ర | मरुत्[1] | मरुतौ | मरुतः |
| ద్వి. | मरुतम् | मरुतौ | मरुतः |
| తృ. | मरुता | मरुद्भ्याम् | मरुद्भिः |
| చ. | मरुते | मरुद्भ्याम् | मरुद्भ्यः |
| పం. | मरुतः | मरुद्भ्याम् | मरुद्भ्यः |
| ష. | मरुतः | मरुतोः | मरुताम् |
| స. | मरुति | मरुतोः | मरुत्सु । |

वाच् స్త్రీలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్ర.సం.ప్ర | वाक्[2] | वाचौ | वाचः |
| ద్వి. | वाचम् | वाचौ | वाचः |

---

1. శబ్దము చివర ఒకటికంటె ఎక్కువగా హల్లులున్నచో మొదటిది తప్ప మిగిలినవి లోపించును. मरुत्+स् मरुत्स् स् లోపించగా मरुत् అను రూపమేర్పడును.

2. च् ज् అను అక్షరాలు పరుష వ్యంజనములకు ముందు क् గా, మృదు వ్యంజనములకు ముందు ग् గా మారుతాయి. ఇది అనునాసిక

| | | | |
|---|---|---|---|
| తృ | वाचा | वाग्भ्याम् | वाग्भि: |
| చ. | वाचे | वाग्भ्याम् | वाग्भ्य: |
| పం. | वाच: | वाग्भ्याम् | वाग्भ्य: |
| ష. | वाच: | वाचो: | वाचाम् |
| స. | वाचि | वाचो: | वाक्षु[1] |

भगवत् పుం.

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్ర. | भगवान्[2] | भगवन्तौ | भगवन्त: |
| ద్వి. | भगवन्तम् | भगवन्तौ | भगवत: |
| తృ. | भगवता | भगवद्भ्याम् | भगवद्भि: |
| చ. | भगवते | भगवद्भ्याम् | भगवद्भ्य: |

---

ములకు, य व र ल కు వర్తించదు. హలన్త శబ్దాలకు అనునాసికములు య व र ल పరంపైనప్పటికీ, ఇది వర్తిస్తుంది. ఉదా - वाच् + यत = वाग्यत అనునాసికము తప్ప మిగతా ఏ హల్లైనా శబ్దము చివరిలో తన వర్గము యొక్క మొదటి లేదా మూడవ అక్షరంగా మారును.

1.అ,ఆ లు తప్ప ఇతర అచ్చులకు పరమయిన సకారానికి షత్వము వస్తుంది. ఉదా-రామే + సు = రామేషు క వర్గకు రేఫకు పరమయిన సకారానికి షత్వము వస్తుంది. వాక్షు, ద్వార్షు .

2. वत् मत् లతో అంతమగు శబ్దాలకు పుంలిఙ్గంలో మొదటి ఐదు రూపాలలో చివరి त् కు ముందు न् కూడ చేరుతుంది.

| | | | |
|---|---|---|---|
| పం. | भगवतः | भगवद्भ्याम् | भगवद्भ्यः |
| ష. | भगवतः | भगवतोः | भगवताम् |
| స. | भगवति | भगवतोः | भगवत्सु |
| సం. | भगवन् | भगवन्तौ | भगवन्तः |

2భగవత్ శబ్దానికి వర్తమాన కాలిక शतृ ప్రత్యయాంత పుంలిఙ్గ రూపాలకు భేదము ప్రథమా ఏకవచనంలోనే ఉన్నది. भगवान् అనే రూపము లో దీర్ఘముండగా गच्छन् అను రూపములో హ్రస్వ ముంటుంది. गच्छन् गच्छन्तौ गच्छन्तः

3.. హలన్త నపుంసకలిఙ్గ శబ్దాల ప్రథమా, సంబోధన ప్రథమా, ద్వితీయా విభక్తులలో రూపాలిలా వుంటాయి.

जगत् जगती जगन्ति

4.ప్రథమ, చతుర్థ, దశమ గణాల ధాతువులకు వర్తమాన కాలిక 'శతృ' ప్రత్యయాన్ని చేర్చినపుడు చివరి त् కుముందు ప్రథమా, సంబోధన ప్రథమా, ద్వితీయా ద్వివచనములలో न् చేరును. ఆరవగణములోని ధాతువులకిది వైకల్పికము.

भवत् भवन्ती भवन्ति ప్ర.గ

विशत् - विशन्ती,विशती - विशन्ति ష.గ

పదములు

आपद् స్త్రీ.ఆపద आयुष्मत् వి.చిరకాలముజీవించువాడు

गुणवत् విణ.మంచిగుణములు కలవాడు,గుణవంతుడు

जगत् న.ప్రపంచము

दृषद् స్త్రీ.రాయి

धीमत् విణ.బుద్ధిమంతుడు

परवत् వి.పరాధీనుడు

प्रतिपद् స్త్రీ.పాడ్యమి

वियत् న.ఆకాశము

भगवत् విణ.పూజ్యుడు, కీర్తిమంతుడు,దేవుడు

भवत्(స.నా) మీరు,తమరు

शरद् స్త్రీ.శరత్కాలము

भूभृत् పు.రాజు

मरुत् పు.గాలి,వాయుదేవుడు

मूर्तिमत् విణ.రూపముకలది.

मृद् స్త్రీ.మట్టి భూమి

यशस्वत् విణ.గొప్పనైన,పేరుపొందిన

वाच् స్త్రీ.మాట,వాక్కు

विद्युत् న.మెరుపు

विपद् స్త్రీ.ఆపద

श्रीमत् విణ.సంపన్నమైనది

सम्पद् స్త్రీ.సంపద

सुखभाज् విణ.సంతోషముపొందువాడు

इह అ.ఇక్కడ

सुहृद् పు.స్నేహితుడు,మిత్రుడు

उच्चैस् అ.ఉన్నతముగా

हुतभुज् పు.అగ్ని,నిప్పు

अकाल పు. (अ+काल) సరికానివేళ,అకాలము

अत्यय పు.గడచుట నాశము

अधमर्ण పు.అప్పుచేసినవాడు

उद्भव పు.పుట్టుట

अन्तःकरण న.అంతఃకరణము(మనస్సు, బుద్ధి,అహంకారము)

अभि+अर्थ ద.గ.ఆ.ప.ప్రార్థించుట

जीवित న.జీవితము

उप+ईक्ष् లక్క చేయకుండుట,ఉపేక్షించుట

उद्धत (క్తాంతము) గర్వముగల

कार्तिक పు.కార్తీకమాసము

चञ्चल విణ.కదలుచున్న
नल పు.నలమహా రాజు
निषण्ण( नि+सद्)క్తాంతము. కూర్చున్న
प्रवृत्ति స్త్రీ.ప్రవర్తన
प्राणाः (పు.బ.వ.)ప్రాణములు
बहुशस् అ.తరుచుగా,సామాన్యముగా
महोत्सव పు.మహోత్సవము.పండుగ
मृदु విణ.మృదువైన
वासुदेव పు.కృష్ణుని పేరు
विकार పు.మార్పు
विद् (చ.గ.ఆ.ప).ఉండుట
विहित (वि+धा+क्त) విధానము చేయుట
वृन्त న.తొడిమ
श्लथ విణ.సడలిన
सन्देह పు.సందేహము
सर्वथा అ.అన్నిరకములుగా
होतृ పు.ఋగ్వేదపాఠకుడు,(హోత)

వర్తమాన అసమాపక్రియా రూపములు

कुर्वत् చేయుచున్న
गच्छत् వెళ్లుచున్న
चोदयत् నడిపించుచున్న
जयत् జయించుచున్న
पश्यत् చూచుచున్న
वसत् నివసించుచున్న
शासत्[1] శాసించుచున్న

---

1.శాస్ మొదటి ఐదు రూపాలలో త్ కు ముందు న్ చేరదు. కాని నపుంసక లిఙ్గరూపాలలో చివరి इ కి ముందు ప్రథమా, సంబోధన ద్వితీయా విభక్తి బహువచనంలో న్ వికల్పంగా చేరును.

పుం शासन् शासन्तौ शासन्तः

[illegible] (ధాతువునుండి ఏర్పడినది) వుంటున్న,మంచిగావుంటున్న

తెలుగులోనికి అనువదించుము

नृशंसेभ्यो गुणवतामपि भयं विद्यते ।

चन्द्रस्य प्रकाशः शरद्याह्लादको भवति। सुहृदोर्वचनमलङ्घनीयम् ।

विद्युता सह मेघो वियति वर्तते । वत्स आयुष्मान् भव।

धीमन्तो लोके यशस्वन्तो भवन्ति । रामो मूर्तिमान् धर्म इव ।

जयतः शत्रून् मोपेक्षस्व । मरुतां भर्तार्जुनं द्रष्टुमिच्छति।

भवद्भिरादिष्टः किंकरो नगरमगच्छत्। नमो भगवते वासुदेवाय ।

पश्यतो गुरोः शिष्येणाविनयः कृतः । विपद्युच्चैः स्थीयते सद्भिः ।

हुतभुजा दग्धमरण्यमपश्यन्नलः ।

दिनेषु गच्छत्सु नारायणः पण्डितोऽभवत्।

महीं शासति दशरथे भूभृति जनाः सुखभाजोऽभवन् ।

कवीनां वाक्षु माधुर्यमस्ति ।

भवन्तः पुत्रैः सहागच्छन्त्विति श्रीमतो देवस्याज्ञा ।

घटा मृदो विकारा अलङ्काराश्च सुवर्णस्य विकाराः।

प्राणानामत्ययेऽप्यसन्तः सद्भिर्नाभ्यर्थ्यन्ते ।

---

शासन्ताम् शासन्तौ

ఎ शासत् शासती शासन्ति

इह जगति पुत्रस्योद्भव उत्सवस्य हेतुः ।

सन्देहे सतामन्तःकरणस्य प्रवृत्तयः प्रमाणम् ।

दृषदि निषण्णो गुरुः शिष्यान् धर्ममुपादिशत् ।

अधमर्णाः सर्वथा परवन्तो भवन्ति ।

अकालो नास्ति धर्मस्य जीविते चञ्चले सति ।

### సంస్కృతములోనికి అనువదింపుము

నారాయణుడు పరులపైన ఆధారపడువాడు కాదు.

అరణ్యంలో శిలలపై మృగములు కూర్చుండును.

ఇంద్రుడు దేవతలకు అధిపతి.

కార్తిక మాసారంభంలో ఉత్సవము జరుగును.

నేను పాఠశాలకు వెళ్లుచున్న బాలుని చూచితిని.

సంపన్నుని బహుజనము అనుసరించెదరు.

ఆపదలో నున్న స్నేహితుని జనులు పరిత్యజించెదరు.

జనులు అశ్వములను చోదనము చేయుటను కృష్ణుడు చూచెను.

సన్న్యాసులు ప్రపంచమును అరణ్యముగా భావించెదరు.

దక్షుడైన నారాయణునిచే మంచిగ్రంథము వ్రాయబడినది.

దుష్టులచే గుణవంతులు కూడ నిందింప బడుదురు.

జనులు చిరకాలము జీవించుటకు కాంక్షించెదరు.

దివ్యుడైన మానవునిచే ఆ విధముగా ధర్మము విధించబడినది.

వృద్ధు భాషణముచే ఆగ్రహము చల్లబడును.

నారదుడు ఆకాశమునుండి అవతరించెను.

మంచివారు ధనము వలన అహంకారము పొందరు.

ఆచార్యుడు స్వర్గమునకు వెళ్లుచూ ఈవిధముగా ఉపదేశించెను.

అరణ్యంలో నివసించుచున్న రామలక్ష్మణులు పెక్కురు రాక్షసులను నాశనము చేసిరి.

నీ గౌరవమునకు నేను చాలా సంతసించితిని.

సుఖానుభవము పొందువారి సుఖేచ్ఛ తరచుగా సుఖమును అనుభవించు కొలది పెరుగును.

గాలి పుష్పమును దాని తొడిమనుండి వేరుచేసి తీసుకొని పోవును.

కవులచేత మెరుపు మేఘము యొక్క భార్యగా గణింపబడినది.

అగ్నిని తాకినట్లైతే నోతను కూడ అది దహించును.

రాముడు సుసంపన్నమగు అయోధ్యలో నివసించెను.

అభ్యాసము

1) సంస్కృత శబ్దములకు చేరు విభక్తి ప్రత్యయములను పేర్కొనుము.

2) वत् లేక मत् ప్రత్యయాంత నామవాచకముల విభక్తి రూపములను శత్రంత విభక్తి రూపములతో పోల్చుము. వీటిని भूभृत् వంటి హలంత శబ్దముల విభక్తి రూపములతో పోల్చుము.

3)శతృ ప్రత్యయాంత శబ్దముల స్త్రీలిఙ్గ రూపములు, నపుంసక లిఙ్గములలో ప్రథమా, సంబోధన ప్రథమా, ద్వితీయా రూపములు, वत्, मत् ప్రత్యయాంతములైన విశేషణ శబ్ద రూపములు ఎట్లేర్పడును ?

4) చ్ జ్ లకు పరుష వ్యంజనములు పరమయినప్పుడు, మృదు వ్యంజనములు పరమయినప్పుడు ఏ యే మార్పులు వచ్చును? ఈ అక్షరములు పదాంతమునందుండునప్పుడు ఎట్టి రూపము లేర్పడును?

5.స కారము ఏ సందర్భములో ష కారంగా మారుతుంది.?

6) प्रतिपद्, हुतभुज्, यशस्वत् పు.స్త్రీ.న कुर्वत् పు.స్త్రీ.న सुखभाज् పు.స్త్రీ.న. आयुष्मत् పు.న. दिशत् పు.స్త్రీ.న. परवत् పుం आपद्, चोदयत् పు.స్త్రీ.న. ఇత్యాది శబ్దముల విభక్తి రూపములను పేర్కొనుము.

7) సతి సప్తమీ సన్ షష్ఠీ కృదంత ప్రయోగములను సోదాహరణముగా వివరించుము.

# ఇరువది ఆరవపాఠము

## అన్నంత,ఇన్నంత నామవాచకములు

నియమములు -

1హలంత పుంలిఙ్గ, స్త్రీలిఙ్గ ప్రథమా, సంబోధన ప్రథమా, -ఏక వచనాలలో स् ప్రత్యయము లోపించును.

2. ప్రథమైక వచనమునందు హలాది విభక్త్యంత ప్రత్యయములకు ముందున్న न् కు లోపము వచ్చును.

3. సర్వనామస్థానము[1]లలో అన్నంత శబ్దములలోని అకారమునకు దీర్ఘము వచ్చును. ఇన్నంతశబ్దములలోని ఇ కారమునకు ప్రథమైక వచనంలో మాత్రమే దీర్ఘము వచ్చును. ఈ నియమము నపుంసక లిఙ్గశబ్దములకు వర్తించదు. కాని అన్నంత, ఇన్నంత శబ్దములైన నపుంసక లిఙ్గశబ్దములలో ప్రథమా, సంబోధన ప్రథమా, ద్వితీయా విభక్తుల బహువచన రూపములలో ఈ" అ" కార 'ఇ' కారములకు దీర్ఘము వచ్చును.

4. ద్వితీయా బహువచన ప్రత్యయమైన अस् ప్రత్యయం మొదలుకొని అజంతప్రత్యయములకు ముందు ఈ అన్నంత

---

1. ప్రథమా విభక్తి రూపములు. ద్వితీయా విభక్తిలోని ఏకవచన, ద్వివచనములకు సర్వనామస్థానములు అని పేరు.

ధాతువులలోని अ కారమునకు లోపము వచ్చును. కాని లోపించ బోవు ఈ "అ" కారము కంటే ముందు సంయుక్తాక్షర మున్నచో ఆ సంయుక్తాక్షరమునకు చివర म् व् లు కాని వున్నచో ఇట్టి లోపము వర్తించదు. ఇదే నియమము పుంలిఙ్గ నపుంసకలిఙ్గ శబ్దముల లోని సప్తమీ ఏకవచన రూపములకు ఐచ్ఛికముగా వర్తించును. అట్లే ఈ నియమము అన్నంతనపుంల్లిఙ్గశబ్దములలోని ప్రథమా,సంబోధన ప్రథమా,ద్వితీయ ల ద్వివచనములకున్నూ ఐచ్ఛికంగా వర్తించును.

5. అన్నంత ఇన్నంత శబ్దముల పుంలిఙ్గ రూపములలో సంబోధన ప్రథమైక వచనము ప్రాతిపదికను పోలియే వుండును. ఆత్మన్, రాజన్, దండిన్.

## राजन् పుంలిఙ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్ర.వి. | राजा | राजानौ | राजान: |
| ద్వి.వి | राजानम् | राजानौ | राज्ञ: |
| తృ.వి. | राज्ञा | राजभ्याम् | राजभि: |
| చ.వి. | राज्ञे | राजभ्याम् | राजभ्य: |
| పం.వి | राज्ञ: | राजभ्याम् | राजभ्य: |
| ష.వి. | राज्ञ: | राज्ञो: | राज्ञाम् |
| స.వి. | राज्ञि,राजनि | राज्ञो: | राजसु |
| సం.ప్ర | राजन् | राजानौ | राजान: |

आत्मन् పుంలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్ర.వి | आत्मा | आत्मानौ | आत्मान: |
| ద్వి.వి | आत्मानम् | आत्मानौ | आत्मन: |
| తృ.వి. | आत्मना | आत्मभ्याम् | आत्मभि: |
| చ.వి. | आत्मने | आत्मभ्याम् | आत्मभ्य: |
| పం.వి. | आत्मन: | आत्मभ्याम् | आत्मभ्य: |
| ష.వి. | आत्मन: | आत्मनो: | आत्मनाम् |
| స.వి. | आत्मनि | आत्मनो: | आत्मसु |
| సం.ప్ర. | आत्मन् | आत्मानौ | आत्मान: |

नामन् నపుంసకలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్ర.వి. | नाम | नामनी,नाम्नी | नामानि |
| ద్వి. | नाम | नामनी,नाम्नी | नामानि |
| తృ. | नाम्ना | नामभ्याम् | नामभि: |
| చ. | नाम्ने | नामभ्याम् | नामभ्य: |
| పం. | नाम्न: | नामभ्याम् | नामभ्य: |
| ష. | नाम्न: | नाम्नो: | नाम्नाम् |
| స. | नाम्नि,नामनि | नाम्नो: | नामसु |
| సం. | नामन्,नाम | नामनी,नाम्नी | नामानि. |

शशिन् పుంలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్ర. | शशी | शशिनौ | शशिनः |
| ద్వి. | शशिनम् | शशिनौ | शशिनः |
| తృ. | शशिना | शशिभ्याम् | शशिभिः |
| చ. | शशिने | शशिभ्याम् | शशिभ्यः |
| పం. | शशिनः | शशिभ्याम् | शशिभ्यः |
| ష. | शशिनः | शशिनोः | शशिनाम् |
| స. | शशिनि | शशिनोः | शशिषु |
| సం. | शशिन् | शशिनौ | शशिनः |

भाविन् నపుంసకలిఙ్గము.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | भावि | भाविनी | भावीनि |
| ద్వి. | भावि | भाविनी | भावीनि |
| సం. | भाविन्,भावि | भाविनी | भावीनि |

మిగతా విభక్తిరూపములు शशिन् శబ్దరూపముల వలెనే అన్వయించుకొనవలయును.

పదములు

अनुजीविन् పు.సేవకుడు,దాసుడు    अन्तरात्मन् పు.అంతఃకరణము

अपराधिन् పు.అపరాధి    अश्मन् పు.రాయి

आत्मन् పు.ఆత్మ    कर्मन् న.పని,కృత్యము

उत्सङ्गवर्तिन् విశే.(उत्सङ्ग పు.తొడ)తొడపై కూర్చున్నవాడు

कञ्चुकिन् పు.అంతః పురమునందలి సేవకుడు, పరిచారకుడు

कुशलिन् వి.నేర్పరి,కౌశలముగలవాడు    क्षयिन् వి.క్షీణించువాడు

क्षेत्रगामिन् వి.క్షేత్రమునకు వెళ్లువాడు    चर्मन् న.చర్మము,తోలు

नामन् న.పేరు,అభిధానము    पक्षिन् పు.పక్షి

प्राणिन् పు.ప్రాణి,మనుష్యాదులు    प्रेमन् న.ప్రీతి,స్నేహము

प्रियवादिन् విశే.ప్రియంగా మాట్లాడువాడు    मूर्धन् పు.తల

फलाशिन् విశే.పు.న.ఫలములు తినువాడు    राजन् పు.రాజు

ब्रह्मन् పు.బ్రహ్మదేవుడు,సృష్టికర్త    सद्मन् న.ఇల్లు

भाविन् విశే.జరుగనున్నది,భవిష్యత్తు    सीमन् స్త్రీ.హద్దు

महिमन् పు.గొప్పదనము,మహిమ,గొప్పవాడు    हेमन् న.బంగారము

लघिमन् పు.తేలిక, లఘుత్వము    स्वामिन् పు.యజమాని

वर्त्मन् న.మార్గము,బాట,తోవ    विश्वकर्मन् పు.దేవశిల్పి

मेधाविन्[1] వి.మేధావి,బుద్ధిమంతుడు    योगिन् పు.సాధువు,యోగి

शिखरिन् పు.పర్వతము,కొండ    शूलिन् పు.శివుడు

---

1. ఇన్నంత విశేషణములకు స్త్రీలిఙ్గములో ఇన్ కు ఈ చేర్చవలెను.
ఉదా - మేధావినీ - బుద్ధిమంతురాలు.స్త్రీ.

अनर्थ పు.నష్టము,దుఃఖము    अन्तःपुर న.రాణివాసము

अमात्य పు.మంత్రి    अम्बर న.ఆకాశము

अर्थ పు.వస్తువు,సంఘటన,సందర్భము

अवतरत् (అవ+తౄ శతృంతము) దిగుచున్న

आत्मजा స్త్రీ.పుత్రిక,బిడ్డ    आरम्भ పు.ప్రారంభించుట

उपकार పు.సహాయము చేయుట    उपानह्[1] స్త్రీ.కాలి చెప్పు

कुण्ठित (కుంఠ్+క్తాంతము) కుంటుబడిన

आविस्+कृ (आविष्कृ)ఆవిష్కరించుట,చూపుట బయట పెట్టుట

केवलम् క్రి.వి.కేవలము,అంతే

कैकेयी స్త్రీ.దశరథుని చిన్నభార్య    कौशल న.నేర్పు,నేర్పరితనము

क्रमेण క్రమ తృ.వి.ఏ.క్రమంగా

गण् ద.గ.లెక్కించుట    गुरु విశ.పొడవైనది,గురువైనది

जगत्कर्तृ పు.జగత్తును సృష్టించువాడు    जीविका స్త్రీ.జీవనోపాయము

दिन న.దినము    दुष्ट (దుష్+క్తాంతము) చెడు

दूर వి.దూరము    दैन्य న.దీనావస్థ

द्रु (ప.గ.ప.ప).ద్రవించుట    न कदापि ఎప్పుడును కాదు

---

1. ఈపదములో ह् కొన్నిచోట్ల त् గా మరికొన్ని చోట్ల దకారము द् గా మారుతుంది.

निर्मित (నిర్+మా+క్తాంతము) పుట్టించినది,నిర్మించబడినది

निवेशित(ని+విశ్+ క్తాంతం) ఉంచబడినది.

निर्वृतिमत् వి.సుఖవంతుడు

मधुरम् క్రి.వి.తీయని

परार्ध పు.రెండవసగము,రెండవది

पूर्वार्ध పు.మొదటిసగము

पश्चात् అ.తదుపరి,తరువాత

पुण्यवत् వి.పుణ్యవంతుడు

प्रसन्न (ప్ర+సద్+క్తాంతము) ప్రసన్నుడు

प्रियवादित्व న.ప్రియంగా పలుకుట

बुद्धि స్త్రీ.బుద్ధి,మతి

यात्रिक పు.యాత్రలు చేయువాడు

वृद्धिमत् వి.వృద్ధిపొందుచున్న

सम्+लक्ष् (ద.గ)చూచుట

लघु విణ.చిన్న, తేలికైన

वसुदेव పు.కృష్ణుని తండ్రి

विनाश పు.వినాశము

विशुद्धि స్త్రీ.విశుద్ధత,స్వచ్ఛత

व्याली స్త్రీ.ఆడపులి

विश्वास పు.విశ్వాసము,నమ్మకము

सुख న.సుఖము

शुभ విణ.మంచి,గుణవంతమైన

श्यामिका స్త్రీ.నలుపు

श्रवण న.వినుట

श्रीषेण పు.ఒక వ్యక్తిపేరు

साशङ्क విణ.సందేహముతో కూడిన

स्वप्न పు.కల

सोत्कण्ठ వి.ఉత్సుకతకలవాడు

తెలుగులోనికి అనువదించుము

योगिनः फलाशिनो भवन्ति ।

अपराधिनं मा क्षमस्व ।

अनुजीविने कुप्यति भर्ता ।

दशरथस्य पुत्रो नाम्ना रामः ।

ब्रह्मणः प्रजाः प्रजायन्ते । राजन् कुशली भव ।

कञ्चुकी राज्ञामान्तःपुरेऽधिकृतः पुरुषः।

भाविनोऽनर्थाञ्ज्ञातुं न समर्थोऽस्ति जनः ।

अश्मभिरश्वस्य गतिः कुण्ठिता ।

जगत्कर्तुर्महिम्नां फलं सर्वत्र दृश्यते ।

क्षेत्रगामिना वर्त्मना गच्छन्तं यात्रिकमपश्यम् ।

जनस्य कल्याणाय यतमानेन रामेणात्मा क्लेशमुपानीयत ।

आत्मनः पुत्राणां कर्मसु कौशलं प्रशंसति ।

कृष्णो वसुदेवस्य सद्मनि वसन्नम्बरादवतरन्तं नारदमपश्यत् ।

श्रीषेणस्य राज्ञो महिषी सूर्यं चन्द्रं चात्मन उत्सङ्गवर्तिनौ

स्वप्नेऽपश्यत् ।

अपराधिनः पुरुषान्दण्डयन्तु राजानः ।

अश्मनेव निर्मितं दुष्टानां हृदयं परकीयस्य दुःखस्य श्रवणेन न

कदापि द्रवति।

शुभानां कर्मणामारम्भः कल्याणाय ।

जगतः कुटुम्बिनं मन्यत + आत्मानं साधुः ।

प्राणिनामुपकारायैव साधूनां जगति जीवितम् ।

प्रियवादिनां प्रियवादित्वं दैन्यं गण्यते शठैः ।

अज्ञानादात्मनो विनाशायैव केवलं राज्ञा दशरथेन व्यालीव

कैकेय्यात्मनः सद्मनि निवेशिता ।

प्रसन्नो भवतोऽन्तरात्मा ।

दिनस्य पूर्वार्धे वृक्षाणां छाया आरम्भे गुर्व्यः क्रमेण च क्षयिण्यः

परार्धे तु पुरा लघवः पश्चाच्च वृद्धिमत्यः ।

हेम्नः संलक्ष्यते ह्यग्नौ विशुद्धिः श्यामिकापि वा ।

సంస్కృతములోనికి అనువదించుము

దేవదత్తుడు మేధావి.

తండ్రి(తన)కొడుకును ప్రేమతో కౌగలించుకొనెను.

నలుడు విశ్వకర్మ పుత్రుడు.

పక్షులు ఆకాశములో ఎగురును.

సేవకులు తమ ప్రభువును అనుసరింతురు.

చెట్లు పర్వతములపై పెరుగును.

నేను పిల్లల పేర్లను గుర్తు తెచ్చుకొనుటలేదు.

చెప్పులు చర్మముతో చేయబడును.

హరినాశము అతని దుష్కృతముల పరిణామమే.

అపరాధులైన మానవుల యొక్క మనస్సులు ఎప్పుడును

శంకించుచునే యుండును.

రాణిసందేశము కంచుకిచే రాజునకు వినిపించబడినది.

మధురముగా మాట్లాడుచునే నిజమును చెప్పుతాను.

ఈ సమస్తసృష్టి బ్రహ్మనుండి ఆవిర్భవించినదే.

నరులు జరగబోవుదానిని తెలుసుకొనుటయందు ఆసక్తిగలవారై వుందురు.

యతులచేత తన అంతఃకరణములలో శివుడు వెతకబడును.

రాజు శత్రువుల శిరస్సుపై తనపాదములనుంచెను.

సుశిక్షితుడైన వ్యక్తి సత్ప్రవర్తననుండి తొలగడు.

దూరదేశములో ఉన్న పుత్రుల కుశలవార్తవిని అతడు ప్రమోదము నొందెను.

తన సంతానముపై ప్రేమ కలిగి యుండుట జంతువులలో కూడ యున్నది.

ఫలాహారులకు అరణ్యములో జీవిక సులభము.

అతడు అతిథులను తన ఇంటిలో దేవతలవలె పూజించెను.

మానవుడు బుద్ధికుశలత వలన గొప్పవాడగును.

ప్రజల విశ్వాసము చూరగొన్న రాజే మంచిరాజు.

మనుష్యుల సంకుచితత్వము (వారల) పనులచే బయట పెట్టబడును.

బ్రహ్మ పర్వతములను పశువులను ఆకాశమును సృజించెను.

పరీక్ష

1. 'అన్నంత' నామవాచకాలలోని నకారమెప్పుడు లోపించును? ఎప్పుడు ఆ కారములోపించదు. ఉదాహరణములను చూపించండి.

(అన్ అంతమందు న్నది అన్నంతము)

2. అన్నంత నామవాచకములను శబ్దములను పేర్కొని వానిని ఇన్నంత (ఇన్ అంతముందున్నది) శబ్దములతో పోల్చుము.

3. मूर्धन् ఇత్యాది శబ్దముల విభక్తి రూపములను పేర్కొనుము.

4. ఇన్నంత విశేషణ వాచక స్త్రీలిఙ్గ శబ్దములు ఎట్లు ఏర్పడును?

5. ఙ, ణ, నకారములు ఎప్పుడు ద్విత్వమునొందును?

6. నామవాచక అథవా క్రియావాచక పదములు ఏ ఐ ఓ ఔలతో అంతమై అచ్చు పరముగ వున్నచో ఏ మార్పులుకలుగును?

# ఇరువది ఏడవపాఠము

నామవాచకములు

సకారాంతములు वस् ईयस् ईयस् ప్రత్యయాంత నామవాచకములు.

1.సకారాంత నామవాచకముల ప్రథమైకవచన స్ ప్రత్యయము లోపించును. దానికి ముందు హ్రస్వ అకారమున్నచో అది దీర్ఘమగును. ప్రాతిపదికయందలి స కారము విసర్గగా మారుతుంది.

2. హలాదులైన విభక్త్యంత ప్రత్యయముల ముందున్న స కారము విసర్గగా మారుతుంది. ఆ విసర్గ విభక్త్యంతములతో చేరి సంధి నియమముల ప్రకారము మళ్లీ మారుతుంది. సంధినియమములు

ईयस् एयस् ప్రత్యయాంతనామవాచకములకు గూడా వర్తించును.

3. वस् ప్రత్యయాంతములు మరియు ईयस् లేదా एयस् ప్రత్యయాంత నామవాచకముల పుంలిఙ్గ ప్రథమా విభక్తి మూడు వచనములు ద్వితీయా విభక్తి ఏక, ద్వివచనములు ఈ ఐదింటి యందు (సర్వనామస్థానములందు) చివరి స కారమునకు ముందు నకారము ఆగమంగా వస్తుంది. ప్రక్కనేవున్న హ్రస్వ అకారము దీర్ఘమౌతుంది. కావున ప్రథమైకవచనము वान् మరియు यान् లుగా మారుతాయి..

4. సకారాంతపుంలిఙ్గ శబ్దములలో ద్వితీయా బహువచన ప్రత్యయము మొదలుకొని అజాది విభక్త్యంతములందున్న ప్రత్యయములకు నపుంసకలిఙ్గ శబ్దముల ప్రథమా సం.ప్రథమా, ద్వితీయా, ద్వివచన రూపముల చివరనున్న ఈకారమునకున్నూ, వస్ ప్రత్యయములోని "వ" కారమునకు ఉ కారము ఆదేశముగును.

5. నపుంసకలిఙ్గ నామవాచకముల ప్రథమా,సం.ప్రథమా, ద్వితీయా ఏకవచన రూపములందు సకారముకంటే ముందున్న హ్రస్వ అకారము దీర్ఘముకాదు. బహువచన ఇకారముకంటే పూర్వమున్న ఉపాంత్యముగు(penultimate) అచ్చుకూడా దీర్ఘముకాదు మరియు

దానిముందు అనునాసికము ఆగమంగా వస్తుంది.

6. ఈ పైన పేర్కొనిన అన్ని నామవాచకములలో సంబోధన ఏకవచనమునందు ఉపాంత్యస్వరము దీర్ఘముకాదు. ఉదా - చంద్రమస్, విద్వస్ ఇత్యాదులు

ఉపాంత్యము=ఉపధ(penultimate).

चन्द्रमस् పుంలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | चन्द्रमाः | चन्द्रमसौ | चन्द्रमसः |
| ద్వితీయా | चन्द्रमसम् | चन्द्रमसौ | चन्द्रमसः |
| తృతీయా | चन्द्रमसा | चन्द्रमोभ्याम् | चन्द्रमोभिः |
| చతుర్థీ | चन्द्रमसे | चन्द्रमोभ्याम् | चन्द्रमोभ्यः |
| పంచమీ | चन्द्रमसः | चन्द्रमोभ्याम् | चन्द्रमोभ्यः |
| షష్ఠీ | चनद्रमसः | चन्द्रमसोः | चन्द्रमसाम् |
| సప్తమీ | चन्द्रमसि | चन्द्रमसोः | चन्द्रमःसु-स्सु |
| సంబోధన | चन्द्रमः | चन्द्रमसौ | चन्द्रमसः |

विद्वस् పుంలిగము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | विद्वान् | विद्वांसौ | विद्वांसः |
| ద్వితీయా | विद्वांसम् | विद्वांसौ | विदुषः |

| | | | |
|---|---|---|---|
| తృతీయం | विदुषा | विद्वद्भ्याम् | विद्वद्भिः |
| చతుర్థీ | विदुषे | विद्वद्भ्याम् | विद्वद्भ्यः |
| పంచమీ | विदुषः | विद्वद्भ्याम् | विद्वद्भ्यः |
| షష్ఠీ | विदुषः | विदुषोः | विदुषाम् |
| సప్తమీ | विदुषि | विदुषोः | विद्वत्सु |
| సంబోధన | विद्वन् | विद्वांसौ | विद्वांसः |

श्रेयस् పుం.

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | श्रेयान् | श्रेयांसौ | श्रेयांसः |
| ద్వితీయా | श्रेयांसम् | श्रेयांसौ | श्रेयसः |
| తృతీయం | श्रेयसा | श्रेयोभ्याम् | श्रेयोभिः |
| చతుర్థీ | श्रेयसे | श्रेयोभ्याम् | श्रेयोभ्यः |
| పంచమీ | श्रेयसः | श्रेयोभ्याम् | श्रेयोभ्यः |
| షష్ఠీ | श्रेयसः | श्रेयसोः | श्रेयसाम् |
| సప్తమీ | श्रेयसि | श्रेयसोः | श्रेयःसु-स्सु |
| సంబోధన | श्रेयन् | श्रेयांसौ | श्रेयांसः |

## मनस् నపుంసకలిఙ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | | | |
| సం.ప్రథమా | मनः | मनसी | मनांसि |
| ద్వితీయా | | | |

మిగిలిన రూపములు చంద్రమస్ శబ్దమును పోలియుండును.

## तस्थिवस् నపుంసకలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | | | |
| సం.ప్రథమా | तस्थिवत् | तस्थुषी | तस्थिवांसि |
| ద్వితీయా | | | |

మిగిలిన రూపములు విద్వస్ శబ్దమును పోలియుండును

## अर्चिस् స్త్రీలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | अर्चिः | अर्चिषौ | अर्चिषः |
| ద్వితీయా | अर्चिषम् | अर्चिषौ | अर्चिषः |
| తృతీయా | अर्चिषा | अर्चिभ्याम् | अर्चिर्भिः |
| చతుర్థీ | अर्चिषे | अर्चिभ्याम् | अर्चिभ्यः |
| పంచమీ | अर्चिषः | अर्चिभ्याम् | अर्चिभ्यः |
| షష్ఠీ | अर्चिषः | अर्चिषोः | अर्चिषाम् |

సప్తమీ अर्चिषि अर्चिषोः अर्चिःषु - ष्षु

సంబోధనా अर्चिः अर्चिषौ अर्चिषः

పదములు

अध्यूषिवस् విణ. నివసించినవాడు

चक्षुस् న. కన్ను

छन्दस् న. వేదము

ज्यायस् విణ. ఒకరికంటె పెద్దవాడు

तस्थिवस् విణ.కూర్చున్నవాడు

दिवौकस् పుం. స్వర్గనివాసి

दुर्वासस् పుం. దుర్వాస ఋషి

पयस् న. నీరు

भूयस् న. చాలాగొప్పవాడు

यशस् న. కీర్తి

रजस् న. ధూళి, పరాగము, పుప్పొడి

वचस् న. మాట, పలుకు

वयस् న. వయస్సు

विद्वस् విణ. విద్వాంసుడు

शिरस् న. తల

सरस् న. సరస్సు

कनीयस् విణ. చిన్న

चन्द्रमस् పుం. చంద్రుడు

तपस् న. తపస్సు

तमस् న. చీకటి

तेजस् న. కాంతి, ప్రకాశము

धनुस् న. ధనుస్సు

नभस् న. ఆకాశము

प्रेयस् విణ.మిక్కిలి ఇష్టుడు

मनस् న. మనస్సు, చిత్తము

रक्षस् న. రాక్షసుడు

वक्षस् న. వక్షఃస్థలము

वनौकस् విణ. వనవాసి

वासस् న. వస్త్రము

वेधस् పుం. బ్రహ్మ

श्रेयस् విణ. శ్రేయస్సు

हविस् న. హోమద్రవ్యము

अविचलित (अ+ वि+चल् +क्त) చలించనిది

अधर्म పుం. అధర్మము

अभूमि స్త్రీ. స్థానముకానిది

कीचक పుం. కీచకుడు

कृत. कृ+क्त చేయబడిన

गुणिन् గుణవంతుడు

दरिद्र విణ. బీదవాడు, దరిద్రుడు

द्वारका స్త్రీ. ఒకనగరము

निश्चेष्ट విణ. అచేతనము

पूजास्थान న. పూజాస్థానము

प्रियंवदा స్త్రీ. బాగుగామాట్లాడునది.

भगीरथ పుం. సూర్యవంశపురాజు

महाराज పుం. మహారాజు

श्वेत విణ. తెల్లనివాడు

संतप्त सम् + तप्+क्त తపించిన

सहसा అ.అనాలోచితముగా, వెంటనే

उद् + यत् శతృ.ప్ర. ఉదయించుచున్న

आ + श्रि ప్ర.గ.ఉ.ప.ఆశ్రయించుట

आ + हृ ప్ర.గ.ప.ప. తినుట, బలిఇచ్చుట. కూర్చుట

अनन्तरम् క్రి.వి. తరువాత

कण्टक పుం.న. ముల్లు

कुश పుం. రాముని కుమారుడు

कृते అ.కొరకు

जीर्ण, जॄ+क्त జీర్ణమైన

दारुण విణ. భయంకరము

नव విణ. క్రొత్తది

परिहित (परि + धा) धा+क्त ఉంచిన, ధరించిన

वर పుం. వరము

शाखा స్త్రీ. కొమ్మ

लिङ्ग న. లిఙ్గము

प्र + अस् విసరివేయుట

हरण న. తీసుకొనిపోవుట

वि + आप् వ్యాపించుట

व्रज् (ప్ర.గ.ప.ప.) వెళ్ళుట

తెలుగులోనికి అనువదించుము

मुनयो वनौकसोऽभवन् । देवान् दिवौकसो वदन्ति ।

कनीयांसं भ्रातरमाह्वय । कुशो लवस्य ज्यायान् भ्राता ।

प्रेयसो जनान् स्मरति । उद्यन्तं चन्द्रमसं प्रेक्षस्व ।

तमोभिर्नभो व्याप्यते । वाससी परिहिते कन्यया ।

विद्वद्भिरुपदिष्टो दशरथो यज्ञमाहरत् । श्रेयसे यतते ।

बहूनि हवींष्यग्नौ प्रास्यति ।

नगरस्य समीपे तस्थिवद्राजसैन्यमपश्यम् ।

भीमेन वक्षसि ताडितः कीचकोऽमुह्यत् ।

सूर्यस्य तेजसा सन्तप्तः पान्थश्छायामाश्रयते ।

द्वारकामध्युषुषो जनस्य सम्पदो मनसोऽप्यभूमिरभवन् ।

वसिष्ठस्य वचांसि श्रुत्वा विश्वामित्रेण सह रामस्य गमनं दशरथोऽन्वमन्यत ।

गुणाः पूजास्थानं गुणिषु न च लिङ्गं न च वयः ।

कैकेय्याः दारुणं वचः श्रुत्वा महाराजो दशरथः सहसा भूमावपतन्निश्चेष्टश्चाभवत् ।

సంస్కృతములోనికి అనువదించుము.

హరి తన మాటలతో (తన) తల్లిని సాంత్వనపరచెను.

నారాయణుని తమ్ముడు కాశిలో వున్నాడు.

పాణిని మహర్షి వేదములను ఛందస్సులని పేర్కొనెను.

గాలి పువ్వులనుండి పుప్పొడిని కొనివచ్చెను.

రాజుయొక్క కీర్తిభూమి యంతట వ్యాపించుగాక !

ప్రియంవద దుర్వాసునివద్దకు వెళ్లి క్షమాభిక్షను కోరెను.

హరి (తన) కన్నులతో గుర్రములను నడుపుతున్న సారథిని చూచెను.

రాముడు (తన) తమ్ములచే సేవింపబడెను.

వనములలో నివసించు ఋషుల ఆశ్రమములు వృక్షముల కొమ్మలతోను, ఆకులతోను నిర్మింపబడును.

భగీరథుడు (తన) తపస్సుచే బ్రహ్మదేవుని సంతోషపరచెను.

సరస్సులలోని నీటిలో కమలములున్నవి.

రాజు విద్వాంసులను గౌరవించును.

నరుడు జీర్ణములైన పాతబట్టలను వదిలిపెట్టి కొత్తవానిని ధరించినట్లు ఆత్మపాతశరీరములను వదిలి కొత్తవానిలో ప్రవేశించును.

రఘుమహారాజు తన ధనుర్బాణములతో, భూమిని జయించెను.

అగ్నిలో వేసిన హోమద్రవ్యములను అగ్నిఇతరదేవతలకందించును.

అయోధ్యలో నివసించు ప్రజలు సుఖముగా నుండిరి.

వెలుతురు తరువాత చీకటి, చీకటి తరువాత వెలుతురు వస్తుంది.

ముళ్ళపైనున్న వలను వదిలిపెట్టి పక్షులు ఆకాశములోకి ఎగిరిపోయినవి.

బీదల ద్రవ్యమును హరించుట మహాపాపము.

యోధులు కీర్తికొరకు మృత్యువుకైనను భయపడరు.

తమ్ముడు, అన్నను అనుసరించినాడు.

అతడు దేవతలనుండి అనేక వరములను పొందినాడు.

గుణవంతులకు ప్రాణం కంటే సత్యము ప్రియమైనది.

దేవుడు స్థిరచిత్తులైన భక్తులచే పొందదగినవాడు.

విద్వాంసుడు అన్నిచోట్ల (ఎల్లయెడల) గౌరవింపబడును.

అభ్యాసము

1. अस्, इस्, ईयस्, एयस्, वस्, ఈ ప్రత్యయములు చివరనున్న శబ్దములయొక్క విభక్తిరూపములను తులనాత్మకంగా పేర్కొనుము.

2. वस् ప్రత్యయమునందలి వకారము ఉ గా ఎప్పుడుమారును.

3. वस्, ईयस्, एयस् ప్రత్యయాంతసంజ్ఞావాచకముల స్త్రీలిఙ్గ రూపములను పేర్కొనుము.

4. नभस्, धनुस्, जग्मिवस् పుం - స్త్రీ - న. लघीयस् పుం. స్త్రీ. पयस् चकृवस् పుం.స్త్రీ.న. ज्यायस् పుం.స్త్రీ.న. चक्षुस्, वनौकस् పుం.స్త్రీ, सेदिवस् పుం. స్త్రీ. న. మొదలగు శబ్దములను వ్రాయుము.

# ఇరువది ఎనిమిదవ పాఠము

క్రియలు - విధ్యర్థకములు

పరస్మైపదము[1]

| | విధిలిఙ్ | | | అనద్యతనభూతకాలము లఙ్ | | |
|---|---|---|---|---|---|---|
| | ఏ.వ | ద్వి.వ | బ.వ | ఏ.వ | ద్వి.వ | బ.వ |
| ప్ర.పు. | ईत् | ईताम् | ईयुस् | त् | ताम् | अन् |
| మ.పు. | ईस् | ईतम् | ईत | स् | तम् | त |
| ఉ.పు. | ईयम् | ईव | ईम | अम् | व | म |

ఆత్మనేపదము

| | విధిలిఙ్ | | | అనద్యతనభూతకాలము లఙ్ | | |
|---|---|---|---|---|---|---|
| ప్ర.పు. | ईत | ईयाताम् | ईरन् | त | इताम् | अन्त |
| మ.పు. | ईथाः | ईयाथाम् | ईध्वम् | थाः | इथाम् | ध्वम् |
| ఉ.పు. | ईय | ईवहि | ईमहि | इ | वहि | महि |

---

1. ఈ విధిలిఙ్ ప్రత్యయములు, అనద్యతనభూతకాల ప్రత్యయములను పోలి యున్నవి. పరస్మైపదములో విధిలిఙ్లోని 'ఇ' అనే అంశమును తొలగిస్తే ఇవి భూతకాలిక ప్రత్యయములతో సమానము. ప్ర.పు.బ.వ. మాత్రము ईयुस् అనే ప్రత్యయము ఉన్నది.

విధ్యర్థకప్రత్యయములు చేర్చుటకు ముందు ఆయాగణములకు సంబంధించిన చిహ్నములను చేర్చవలెను.

పరస్మైపదము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్ర.పు. | वसेत् | वसेताम् | वसेयु: |
| మ.పు. | वसे: | वसेतम् | वसेत |
| ఉ.పు. | वसेयम् | वसेव | वसेम |

ఆత్మనేపదము

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | युध्येत | युध्येयाताम् | युध्येरन् |
| మ.పు. | युध्येथा: | युध्येयाथाम् | युध्येध्वम् |
| ఉ.పు. | युध्येय | युध्येवहि | युध्येमहि |

संभावना, आज्ञा, प्रार्थना, इच्छा, आशा మొదలగు అర్థములలో లేక అట్టి అర్థములను ద్యోతింపజేయు విషయములలోను ఒక విషయము ఇంకొక విషయముపై, మరియొక కారణముపై పరిస్థితిపై ఆధారపడియున్న సాపేక్షకవాక్యములలోను విధ్యర్థకము ప్రయోగింపబడును. చివరిరెండు విషయములు ఆంగ్లములోని సంశయార్థ ప్రయోగములను( Subjunctive) అనుకరించు చున్నవి.

పదములు

[illegible] పుం (अध्वन्)పుం. మార్గము,खेद పుం. ఆయాసము [illegible]యాసము.

अनुरञ्जन న. మనోరంజనము, ఆనందపరచునది

अपाय పుం. నష్టము,అపాయము अपण्डित పుం. మూర్ఖుడు

अभिभूत (अभि + भू + क्त) తిరస్కరింపబడినవాడు

अहित న. ఉపద్రవము, అనిష్టము आवरण న. కప్పు

उत అ. అథవా, ఒకవేళ क्लृप् ప్ర.గ.ఆ.ప.కల్పించుట ,

अव + गाह् ప్ర.గ.ఆ.ప.స్నానముచేయుట दारिद्र्य న. బీదతనము

जायापती పుం.ద్వి.వ. భార్యాభర్తలు तृषित విశే. దప్పికొన్న

तप् ప్ర.గ.ప.ప. ప్రకాశించుట, వేడెక్కుట दुर्दशा స్త్రీ. దుర్దశ

तमिस्रा స్త్రీ. రాత్రి, కాళరాత్రి दीन విశే. దీనుడు

द्रुह् చ.గ.ప.ప. ద్రోహముచేయుట धीर విశే. ధీరుడు

निस् + पद् (निषद्) నిష్పన్నమగుట परकीय విశే.ఇతరులది

नीचैराख्य విశే.(नीचैस् आख्या స్త్రీ.నీచైఃఅనుపేరుగల

न्यायसभा స్త్రీ.(न्याय పుం.న్యాయము सभा స్త్రీ. సభా.కచ్చేరి. న్యాయసభ

प्रतिहत (प्रति + हन्+क्त) అడ్డగింపబడిన

प्राप्त( प्र+आप्+क्त) పొందినవాడు,ప్రాప్తించినది

प्रथमसुकृत న.प्रथम వి .सुकृत న. మంచిపని, తొలి మంచిపని

**बहिस्** అవ్య. వెలుపల, పంచమీవిభక్తితో వాడబడుతుంది.

**अधि + वस्** పైనకూర్చొనుట,అధివసించుట

**विश्रामहेतोः**పుం.**विश्राम**పుం.విశ్రాంతి**हेतुः**పుం.కారణము పుం.

విశ్రామమును గూర్చి

**भागीरथी** స్త్రీ. గంగానది

**भोस्** అవ్య. సంబోధనావాచకము

**रक्षण** న. రక్షించుట, పాలించుట

**विघ्न** పుం. విఘ్నము. అడ్డంకు

**विमार्ग** పుం. చెడుత్రోవ,చెడుశీలము

**शोभन** విను. మంచిది,మంచివాడు

**सुकृत** న.మంచిపని

**समाज** పుం. మండలి, సమాజము

**सुवृत्त** విణ. నీతిమంతుడు, ఉత్తముడు

**भूरि** విణ. పుష్కలం

**रज्जु** స్త్రీ. త్రాడు

**वि + स्मृ** మరచుట

**विपत्ति** స్త్రీ. ఆపద

**विमुख** విణ. పరాఙ్ముఖుడు

**संश्रय** పుం. విశ్రాంతిస్థానము

**सुचरित** న. మంచినడవడిక

**सुरभि** వి.సుగంధయుక్తము

తెలుగులోనికి అనువదించుము

विपदाभिभूतोऽपि न धर्मं त्यजेयम् ।

इच्छामि सोमं पिबेद् भवान् ।

किं भो नृत्यं शिक्षेयोत गानम् ।

भूरिणा प्रयत्नेन तत्त्वमवगच्छेः ।

रज्जुं सर्पं न मन्येध्वम् ।

पुत्राः सुचरितैः पितरौ प्रीणयेयुः ।

शिष्यस्याविनयं गुरुर्न सहेत ।

ईश्वरस्य पूजया शान्तिं विन्देवहि ।

दुर्दशां गते नरि क्षुद्रोऽप्यहितमाचरेत् ।

वर्धमानं व्याधिं जयन्तं शत्रुं च नोपेक्षेत ।

पण्डितानां समाजेऽपण्डिताः मौनं भजेयुः ।

कुसुमैः सुरभिणि हर्म्येऽध्वखेदं नयेथाः ।

प्रजानामनुरञ्जनाय राजानो यतेरन् ।

सुवृत्ताय नृपतये प्रजा न द्रुह्येयुः ।

यदि हरिर्विमार्गान्निवर्तेत शोभनं भवेत् ।

धर्मे रताः प्रज्ञा हरिं पश्येयुः ।

वत्सौ मातुराज्ञामनुरुध्येयाथाम् ।

धैर्यमवलम्ब्य शत्रुभिः सह युध्येथाः ।

नारायणस्यालस्यद्दारिद्र्यं निष्पद्येत ।

विपत्तौ धीरो न मुह्येद्धर्मं वा न परित्यजेत् ।

इच्छामि पुनरपि पुण्यां भागीरथीमवगाहेवहीत्यवदद्रामं सीता ।

संश्रयाय प्राप्ते मित्रेप्रथमसुकृतानि स्मृत्वा क्षुद्रोऽपि न विमुखोभवेत् ।

तृषिताय जलं यच्छेद्धरेद्दीनस्य चापदम् ।

नीचैराख्यं गिरिमधिवसेस्तत्र विश्रामहेतोः ।

सूर्ये तपत्यावरणाय दृष्टेः कल्पेत लोकस्य कथं तमिस्रा ।

సంస్కృతములోనికి అనువదించుము

(మీరిద్దరు) ఇంటికివచ్చిన తరువాత (మీ) కాళ్లుచేతులు కడుగు కొనగలరు.

మానవులు (తమ) మిత్రులను మరువరాదు.

విషాన్ని రుచిచూచినచో (నీవు) మరణించెదవు.

(రెండు) చేతులలో (రెండు) పుస్తకాలను తీసుకుపోవచ్చును.

(మీరిద్దరు) మీ గురువునుండి న్యాయశాస్త్రాన్ని నేర్చుకొనగలరు.

(మీరు) ఈ చెట్టునీడలో కూర్చొనగలరు.

రాజులు (తమ) ప్రజలను కష్టములనుండి రక్షించవలెను.

(మనము) నిర్మలాంతఃకరణముతో దేవుని పూజింపగలము.

(నీవు) బీదలకు ధనము నివ్వగలవు.

(నీవు) (నీ) ధర్మమునుండి తప్పుకొనవద్దు.

మానవులు కారణములేకుండా కలతనొందరాదు.

మానవులు ఇతరుల సంపత్తిని కోరుకోకూడదు.

రాజు ఇద్దరు ధూర్తులను కొట్టుటకు ఆజ్ఞాపించెను.

(మనము) మనదేశ రక్షణకై మరణించినచో కీర్తి లభించగలదు.

న్యాయాలయమున సాక్షి నిజాన్ని చెప్పవలెను.

(నేను) కాశికి వెళ్లినచో చాలాసంస్కృత పుస్తకాలను తెచ్చెదను.

(నీవు) అసత్యమును పలికినచో (నీ) ప్రభువులు నిన్ను కొట్టగలరు.

శత్రువులతో పోరాడదలచి రాజు సైనికులను పట్టణమువెలుపలికి పంపెను.

నేను పాపము చేసినటుల నా ప్రభువులు చూచినచో నన్ను దండింపగలరు.

దరిద్రులు పట్టణంలో భిక్షమడిగినచో వారికి ధనము లభించునా !

నా తల్లిదండ్రులు సంతోషింపవలయునని నేను నా సోదరికి చాలాధనమునిచ్చితిని.

భార్యాభర్తలు ప్రతిదినము ఇంటిలో అగ్నిని పూజింపవలయును.

మానవుడు ధర్మాచరణమున శ్రమను లెక్కించకూడదు

విద్యార్థులు గురువుకు నమస్కరింపవలెను.

సంకటములడ్డువచ్చినను ఆరంభించిన పనిని వదలరాదు.

అభ్యాసము

1. అనద్యతనభూతకాలము लङ् విధ్యర్థకముల యొక్క ప్రత్యయములను తులనాత్మకంగా పరిశీలింపుము.

2. ఏ ఏ అర్థములలో విధ్యర్థకములు ఉపయోగింపబడును?

3. भोस् లోని स् ఎప్పుడు లోపించును?

4.( ఏ.) ఈక్రింది ధాతువుల విధ్యర్థక రూపములను కర్తరి ప్రయోగంలో వ్రాయుడు मृ, ईक्ष्, नि + मन्त्र, सृज्, हृ

(బి.) ఈక్రింది ధాతువుల విధ్యర్థక కర్తరి, కర్మణి, ప్రయోగములను వ్రాయుడు मृग्, स्था, जन्, पा, अनु + भू, मुच्

(సి.) कृ,श्रु, ధాతువుల విధ్యర్థకకర్మణి రూపములను వ్రాయుడు.

# ఇరవై తొమ్మిదవ పాఠము

సర్వనామములు

సంస్కృత భాషలో ముఖ్యసర్వనామములు - सर्व अందరు, అన్ని तद् అది, వాడు, यद् ఎవడు, ఏది, ప్రశ్నార్థకము अस्मद् నేను, మేము, युष्मद् నీవు మీరు, इदम् ఇది, ఇతను, अदस् ఇది లేక అది. అకారాంత పుంలిఙ్గ సర్వనామశబ్దములకు క్రింద పేర్కొనబోవు అయిదు ప్రత్యయములు మాత్రమే ప్రత్యేకములు. ఇతర ప్రత్యయ ములు అకారాంత పుంలిఙ్గ శబ్దములవలె చెప్పుకొనవలయును.

| | | |
|---|---|---|
| ప్రథమా | బ.వ | ई |
| చతుర్థీ | ఏ.వ | स्मै |
| పంచమీ | ఏ.వ | स्मात् |
| షష్ఠీ | బ.వ | इषाम्. |
| సప్తమీ | ఏ.వ | स्मिन् |

सर्व సమస్తము పుంలిఙ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | सर्वः | सर्वौ | सर्वे |
| ద్వితీయా | सर्वम् | सर्वौ | सर्वान् |
| తృతీయా | सर्वेण | सर्वाभ्याम् | सर्वैः |

| | | | |
|---|---|---|---|
| చతుర్థీ | सर्वस्मै | सर्वाभ्याम् | सर्वेभ्यः |
| పంచమీ | सर्वस्मात् | सर्वाभ्याम् | सर्वेभ्यः |
| షష్ఠీ | सर्वस्य | सर्वयोः | सर्वेषाम् |
| సప్తమీ | सर्वस्मिन् | सर्वयोः | सर्वेषु |

2".ఆ" కారాంత స్త్రీలిఙ్గ సర్వనామ శబ్దములకు క్రింద పేర్కొనబోవు ఐదు ప్రత్యయములు మాత్రమే ప్రత్యేకములు. ఈ ప్రత్యయములకు ముందున్న आ హ్రస్వంగా మారును. साम्అను షష్ఠీ బహువచన రూపము ముందుమాత్రము మారదు. ఇతరప్రత్యయములు "ఆ" కారాంత శబ్దము వలెనే చెప్పుకొనవలయును.

| | | |
|---|---|---|
| చతుర్థీ | ఏ.వ | स्यै |
| పంచమీ | ఏ.వ | स्याः |
| షష్ఠీ | ఏ.వ | स्याः |
| షష్ఠీ | బ.వ | साम् |
| సప్తమీ | ఏ.వ | स्याम् |

सर्व సమస్తము - స్త్రీలిఙ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | सर्वा | सर्वे | सर्वाः |

| | | | |
|---|---|---|---|
| ద్వితీయా | सर्वाम् | सर्वे | सर्वाः |
| తృతీయా | सर्वया | सर्वाभ्याम् | सर्वाभिः |
| చతుర్థీ | सर्वस्यै | सर्वाभ्याम् | सर्वाभ्यः |
| పంచమీ | सर्वस्याः | सर्वाभ्याम् | सर्वाभ्यः |
| షష్ఠీ | सर्वस्याः | सर्वयोः | सर्वासाम् |
| సప్తమీ | सर्वस्याम् | सर्वयोः | सर्वासु |

నపుంసకలిఙ్గ సర్వశబ్ద ప్రథమ, ద్వితీయా విభక్తులు

सर्वम्    सर्वे    सर्वाणि

మిగిలిన రూపములు పుంలిఙ్గశబ్దమువలెనే వుండును.

3 तद्, एतद्, यद्, किं, శబ్దములకు त एत य क అంతమునందున్న శబ్దములవలె పుంలిఙ్గ రూపములను చెప్పవలయును. అకారాంత సర్వనామ శబ్దములవలె చెప్పవలెనని తాత్పర్యము. तद्, एतद्, పుంలిఙ్గ ప్రథమా ఏకవచన రూపము లను మాత్రమే सः एषः అని చెప్పవలెను.

ఉదా - सः    तौ    ते

एषः    एषौ    एते

4. तद् एतद् यद् किम् సర్వనామముల స్త్రీలిఙ్గ రూపములు ता एता या का అని आ కారాంత శబ్దములవలె చెప్పవలెను. ता एता ల యొక్క ప్రథమైకవచనము రూపములు క్రమంగా सा एषा అని చెప్పవలెను.

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| నపుంసకలిఙ్గ ప్రథమా | तत् | ते | तानि |
| ద్వితీయా విభక్తులు | एतत् | एते | एतानि |
| | यत् | ये | यानि |
| | किम् | के | कानि |

ద్వితీయా విభక్తి మూడువచనములలో, తృతీయైక వచనములలో, షష్ఠీ, సప్తమీ ద్వివచనాలలో అన్నిలిఙ్గములలో एत కు (బదులు) एन వికల్పంగా చెప్పవలెను.

పుంలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ద్వితీయం | एतम् | एतौ | एतान् |
| | एनम् | एनौ | एनान् |
| తృతీయా ఏ.వ | एतेन, एनेन | | |
| షష్ఠీ, సప్తమీ ద్వి.వ | एतयोः, एनयोः | | |

స్త్రీలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ద్వితీయా | एताम् | एते | एताः |
| | एनाम् | एने | एनाः |

తృతీయా ఏ,వ एतया, एनया

షష్ఠీ, సప్తమీద్వి.వ एतयोः, एनयोः

నపుంసకలిఙ్గ ద్వితీయా एतत् एते एतानि

एनद् एने एनानि

పదములు

अक्षर విశ. నాశనములేనిది, అక్షరము अखिल విశ. సర్వము

अटवी స్త్రీ. అడవి कपिल పుం. ఒకఋషి

अल्प విశ. చిన్నది, కొంచెము काञ्चन న. బంగారము

अवदात విశ. శుద్ధము, గౌరము आत्मज పుం. కుమారుడు

आयास పుం. శ్రమ, ఆయాసము जाल्म పుం. మోసకారి

कुलीन విశ. మంచివంశములో పుట్టిన दर्शनीय విశ. సుందరమైన

चारु విశ. అందమైన, సుందరమైన चौर्य న. దొంగతనము

दक्षिणा స్త్రీ. బ్రాహ్మణులకిచ్చు ధనము दिश् స్త్రీ. దిక్కు

गुणज्ञ విశ.గుణమును (యోగ్యతను)తెలుసు కొనువాడు.

प्र + अर्थ (ద.గ.ఆ.ప.) కోరుట, ప్రార్థించుట

इष्ट (इष् + क्त) నచ్చినవాడు, ఇష్టమయినది

द्यावापृथिवी స్త్రీ. ద్వి. వ. పృథివ్యాకాశములు

प्रपन्न (प्र+पद्+क्त)ముందుకుపోవుట,భక్తితోప్రసన్నుడగుట

दुराप విశ. పొందశక్యముగాని दुर्गा స్త్రీ. దుర్గాదేవత

देवायतन న. దేవాలయము, గుడి
नाट् ప.గ.ఉ.ప. నటించుట
निष्णात విశ. నిపుణుడు
पुराण న. పురాణము
पूत (पू+क्त) శుద్ధము, పవిత్రము
प्रयाग న. అలహాబాదు
ब्रह्मविद् విశ. బ్రహ్మవేత్త, తత్త్వవేత్త
महत् విశ. గొప్ప
मेदिनी స్త్రీ. భూమి
राजपुत्र పుం. రాకుమారుడు
राज्ञी స్త్రీ. రాణి
रोदन న. ఏడ్పు
वि + धृत (धृ+क्त) ధరింపబడిన
वित्त న. ధనము
साध्य విశ. సాధింప సులభము
सामर्थ्य న. శక్తి,సామర్థ్యము
श्रद्धेय విశ. శ్రద్ధగలవాడు, విశ్వాసపాత్రుడు
श्रुतिमत् విశ. వేదము తెలిసినవాడు
सगर పుం. సూర్యవంశపురాజు

తెలుగులోనికి అనువదించుము

कोऽत्रागतः ।
कस्यैतानि पुस्तकानि ?
कस्याः पुत्रा एते ।
यं पुरुषं ह्योऽपश्यं तमेवाह्वयामि ।
सा बाला न किंचिदवदत् ।
तेभ्यो ब्राह्मणेभ्यो दक्षिणामयच्छम् ।
कस्मान्नगराद्दूत आगतः ।
एतेषां यद्यादिष्टं तत्तत्क्रियताम् ।
याः कथाः पुराणेषु श्रूयन्ते ता एवैते नाटयन्ति ।
स एवैष प्रदेशो यस्मिन् प्रियया सह चिरमवसम् ।
येनैतदखिलं जगन्निरमीयत तस्मै नम ईश्वराय ।

तेषु तेषु शास्त्रेषु निष्णातैः पण्डितैः सह राजाऽभाषत ।

कयोस्ते वाससी ।

ययात्मानं पूतं मन्यते वसिष्ठस्तामरुन्धतीं वन्दस्व ।

सर्वासु कलासु प्रावीण्यमुपगतो राजपुत्रः ।

यया महिषासुरो हतस्तस्यै दुर्गायै नमः ।

ते नद्यौ प्रयागे सङ्गच्छेते ।

याभ्यां चौर्यं कृतं तौ पुरुषौ राजाऽदण्डयत् ।

एतस्यामटव्यां पुरा ब्रह्मविदो मुनयो न्यवसन् ।

यैर्मेदिन्युत्खाता ये च कपिलस्य कोपेन दग्धास्तान् सगरस्यात्मजान्
भगीरथो गङ्गाया जलेनोदधरत् ।

यासां विवाहाः स्वपुत्रैः सह समजायन्त ताभिर्जनकस्य कन्याभिः

प्रपन्नो राजा दशरथोऽयोध्यामगच्छत् ।

न दृश्यतेऽत्र कोऽपि रोदनं तु श्रूयते ।

पुरा यानि वस्तूनि महता श्रमेण साध्यान्यासंस्तान्यधुना यन्त्राणां
सामर्थ्यादल्पेनैवायासेन साध्यानि ।

किं तया धेन्वा क्रियते यस्या दुग्धं नोपलभ्यते ।

यस्यास्ति वित्तं स नरः कुलीनः
स पण्डितः स श्रुतिमान् गुणज्ञः ।
स एव वक्ता स च दर्शनीयः
सर्वे गुणाः काञ्चनमाश्रयन्ति ॥

సంస్కృతములోనికి అనువదించుము

మీరెవరు ? మీ వ్యాపారమేమి ?

ఆమె హరి కూతురు. ఆమె పేరేమి ?

అతడు గోవిందుని సోదరుడు. ఆ నదిలో చేపలున్నవి.

నేను అతనితో పాఠశాలకు వెళ్లినాను.

నారాయణుడు ఆ పిల్లలతో ఆడుచుండగా అతడు చూచినాడు.

అతని మిత్రులలో ఎవరిని అతడు గుర్తు తెచ్చుకున్నాడు?

ఆమె అతనిని అనుసరించినది.

ఆ గ్రామములనుండి వచ్చిన మనుష్యులు ఎక్కడ వున్నారు?

శూద్రకుడు రాజుగా వున్నదేశమునుండి వారలు వచ్చినారు.

తన దాసీలలో ఎవరైతే తనకు దగ్గరగా వున్నారో వారిని పూలు

తీసుకునిరావడానికి రాణి ఆజ్ఞాపించినది.

మహారాష్ట్రరాజు ఈ ఇంటిలో నివసించెను.

ఈ బాలికలలో ఎవతె పాటపాడును?

ఎవరిచే ఈపుస్తకము పెట్టబడినది.

ఆకాశము,భూమి ఈ అక్షరపరబ్రహ్మ శక్తిచేత ధరించ బడుచున్నవి.

ఈ ఇద్దరిచేత ఒక్క మంచిపని కూడ చేయబడలేదు

ఆ ఆరణ్యంలో నేను చాలా కాలం నివసించినాను.

ఆ దుష్టుడు ఏమార్గమున వెళ్లినాడు.

ఆ దేవాలయంలో అందమైన లక్ష్మివిగ్రహమున్నది.

హరి అతనికి నమ్మశక్యంగాని కథను చెప్పినాడు.

ఎవరినైతే లక్ష్మి కోరుకొనుచున్నదో అతడు ఆమెకు దొరకుట కష్టమెట్లు?

## అభ్యాసము

1. నామవాచకముల సర్వనామముల విభక్తిరూపములకు గల భేదములను పేర్కొనుము.

2. నిర్దేశకము,సాపేక్షములు ప్రశ్నార్థకములు అయిన సర్వనామముల రూపములు అజంతములా ? హలంతములా ? వాని విభక్తి రూపములు అజంత నామవాచక విభక్తిరూపములతో సమములా ! లేదా హలన్త నామవాచక విభక్తి రూపములతో సమములా పేర్కొనుము.

3. వాక్యము మధ్యలో నున్న सः, एषः, లయొక్క విసర్గ ఏమగును?

4.यद्, तद्, किम्, एतद् శబ్దరూపములను మూడులిఙ్గములలోను महत् శబ్దమును పుం, నపుంసకలిఙ్గములలోను दिश् శబ్దమును స్త్రీలిఙ్గములోను వ్రాయండి

# ముప్పదియవ పాఠము

సర్వనామములు

ఉత్తమ,మధ్యమ పురుషములు

अस्मद् ( నేను లేదా మేము )

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | अहम् | आवाम् | वयम् |
| ద్వితీయా | माम्,मा | अवाम्,नौ | अस्मान्,नः |
| తృతీయా | मया | आवाभ्याम् | अस्माभिः |
| చతుర్థీ | मह्यम्,मे | आवाभ्याम्,नौ | अस्मभ्यम्,नः |
| పంచమీ | मत् | आवाभ्याम् | अस्मत् |
| షష్ఠీ | मम,मे | आवयोः,नौ | अस्माकम्,नः |
| సప్తమీ | मयि | आवयोः | अस्मासु |

युष्मद्

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | त्वम् | युवाम् | यूयम् |
| ద్వితీయా | त्वाम्,त्वा | युवाम्,वाम् | युष्मान्,वः |
| తృతీయా | त्वया | युवाभ्याम् | युष्माभिः |
| చతుర్థీ | तुभ्यम्,ते | युवाभ्याम्,वाम् | युष्मभ्यम्,वः |
| పంచమీ | त्वत् | युवाभ्याम् | युष्मत् |
| షష్ఠీ | तव,ते | युवयोःवाम् | युष्माकम्,वः |

| | | | |
|---|---|---|---|
| సప్తమీ | त्वयि | युवयोः | युष्मासु |

పదములు

अपराधलव పుం.చిన్నతప్పు    अव् ప్ర.గ.ప.ప.రక్షించుట

अविश्वास्य విణ.విశ్వసించదగని    आर्या స్త్రీ.పూజ్యురాలు

उचित విణ.యోగ్యమైన    ऋत्विज् పుం.ఋత్విక్కు

एतादृश విణ.ఇటువంటి    कारुणिक విణ.దయాళువు

शरणं गत वशं गत విణ. శరణము పొందిన,వశమునొందిన    जेतृ పుం.జయశీలుడు,విజేత

ताडन న.కొట్టుట,దెబ్బ

त्वर् ప్ర.గ.ఆ.ప.తొందరపడుట    दासजन పుం.నౌకరు,దాసజనము

दूरम् క్రి.వి.దూరము    दैव న.ప్రారబ్ధము,భాగ్యము

नन्दिनी స్త్రీ.బాలిక,ఆనందింపజేయునది    निष्फल విణ.ప్రయోజనములేని, నిష్ఫలమైన

निमित्त న.కారణము

आ+पत् కలుగుట,వచ్చిపడుట    पर्याकुल విణ.వ్యాకులమైన

पार् ద.గ.ఉ.ప.దాటుట,గట్టెక్కుట    प्रतनु విణ.చిన్నది,కృశించినది

भूतार्थ పుం.యథార్థము    मति స్త్రీ.బుద్ధి

मानिनी స్త్రీ.మానవతి,మానిని    मेघजाल న.మేఘసమూహము

रघुनाथ పుం.శ్రీరాముడు    लव పుం.అణువు

वियोग పుం.వియోగము,ఎడబాటు    शिव న.క్షేమము,మంగళము

सवितृ పుం.సూర్యుడు    साक्षिन् పుం.సాక్షి

सोमवासरः పుం.సోమవారము

తెలుగులోనికి అనువదించుము

नाहमपराधी । रघुनाथः स्निह्यत्यावयोः ।
कुत्रास्ति मे पुत्रकः ? भगवति ! त्वामहं वन्दे ।
मास्मानवधीरय । विष्णुर्वोऽवतु ।
त्वया सह उपवनं गन्तुमिच्छामि । आर्ये कथयामि ते भूतार्थम् ।
मह्यं धनं न यच्छसि । शिवो वः शिवाय भवतु ।
बालकौ ! युवयोः पिता क्वास्ति ?
पृथिवीं रक्षत्सु युष्मासु कुतो नो भयम् ।
युष्मदधिगतां वार्तां सर्वेभ्यः शंसामि।
तस्य पीडां हर्तुमस्माभिश्चिन्तितः उपायो निष्फलोऽभवत् ।
तव अस्माकमश्व एषः ।
सुचरितं ममेव प्रतनु यतो नदीर्घकालमावां सुखमन्वभवाव ।
क्व गता ते माता?
त्वरते मम मनोऽध्ययनाय ।
एतस्य वृत्तान्तस्य श्रवणेन पर्याकुलमावयोर्मनः ।
दीनेष्वस्मास्वप्येतादृशो भवतः स्नेहः ।
मरुता मेघजालमिव दैवेनास्माकं सर्वे मनोरथा निरस्ताः ।
किं तव पापे रामेण मया वा पापं कृतमित्यपृच्छत् क्रुद्धो दशरथः
केन निमित्तेन तस्यैवं त्वमनर्थायाद्योद्यता । कैकेयीम् ।

[1]कमपराधलवं मयि पश्यसि त्यजसि मानिनि दासजनं यतः ।

[2]तेषां वधूस्त्वमसि नन्दिनि पार्थिवानाम् ।

येषां कुलेषु सविता च गुरुर्वयं च ।।

यूयं वयं वयं यूयमित्यासीन्मतिरावयोः ।

किं जातमधुना येन यूयं यूयं वयं वयम् ।।

సంస్కృతములోనికి అనువదించుము

నీవు బుద్ధిమంతుడవు.

నన్ను నీవు విశ్వాసహీనునిగా సందేహించుచుంటివా?

ఈ కథను ఎవరు చెప్పినారు.

మా తండ్రి కాశికి పోయెను, అతడు తిరిగి వచ్చినపుడు చాలా

పుస్తకములను తెచ్చెను.

నీవు పర్వతము నారోహించినపుడు నీమార్గదర్శకుడెవరు?

అక్కడ ఏమిజరిగినదో మాకు చెప్పుము.

నాపుస్తకమెక్కడున్నదని నిన్నడిగినాను.

మానుండి దూరమైనందుకు బాధపడకుము.

మీకృపతో అన్ని కష్టాలను దాటినాము.

ఆ సమయంలో నీవలన ఏమి జరిగినదో నాకు గుర్తున్నది.

---

1. భర్త భార్యతో పలుకు అనునయవాక్యములు.

2. వసిష్ఠమహర్షి సీతాదేవితో పలికిన పలుకులు.

సోమవారము రావలసినదిగా సాక్షులు నాచే ఆజ్ఞాపించబడినారు..

నీవు మాయింటికి వచ్చినపుడు నేను ప్రోగుచేసిన ధాన్యము.

నిచ్చినాను

మీరిద్దరు అందరిని నిందించెదరు.

నీవు ఓడిపోయినందులకు(अप+जि) నీ సైనికులు విజేతకు

లొంగిపోయిరి.

నీకు నేను ఆ బహుమతినిస్తాను.

మేమిద్దరము అనేక ఋషుల ఆశ్రమములను  చూచితిమి.

ఈ ఫలాలు మాయిద్దరిచే తీసుకొని రాబడినవి.

అతడు బుద్ధికుశలతను నానుండే పొందినాడు.

నేను మీనుండే సాధుజనుల మార్గమును నేర్చుకున్నాను.

దయా శాలివైన ఓతండ్రీ ! మీపిల్లలమైన మాపై కోపించకుము.

ఋత్విక్కులు ఏఅపరాధము లేకయే నన్ను కొట్టిరి.

అతడు మిత్రులమైన మానుండి దూరంగా తిరుగు చున్నాడు.

మీచేత కుక్కను కొట్టుట అను అకార్యము చేయబడినది.

నీవు రక్షకుడవై వుండగా ప్రజలు దుఃఖితులు ఎందుకయ్యేదరు?

మా అందరిలో హరి ఉత్తముడు.

# ముప్పదిఒకటవ పాఠము

## अदस् అది,ఇది  इदम् ఇది

### अदस् అది,ఇది

పుంలిజ్గము

| | ఏ.వ | ద్వి.వ | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | असौ | अमू | अमी |
| ద్వితీయా | अमुम् | अमू | अमून् |
| తృతీయా | अमुना | अमूभ्याम् | अमीभिः |
| చతుర్థీ | अमुष्मै | अमूभ्याम् | अमीभ्यः |
| పంచమీ | अमुष्मात् | अमूभ्याम् | अमीभ्यः |
| షష్ఠీ | अमुष्य | अमुयोः | अमीषाम् |
| సప్తమీ | अमुष्मिन् | अमुयोः | अमीषु |

స్త్రీలిజ్గము

| | | | |
|---|---|---|---|
| ప్రథమా | असौ | अमू | अमूः |
| ద్వితీయా | अमूम् | अमू | अमूः |
| తృతీయా | अमुया | अमूभ्याम् | अमूभिः |
| చతుర్థీ | अमुष्यै | अमूभ्याम् | अमूभ्यः |
| పంచమీ | अमुष्याः | अमूभ्याम् | अमूभ्यः |

షష్ఠీ अमुष्याः अमुयोः अमूषाम्

సప్తమీ अमुष्याम् अमुयोः अमूषु

## నపుంసకలిఙ్గము

ఏ.వ ద్వి.వ బ.వ

ప్ర.&ద్వితీయ अदः अमू अमूनि

తక్కిన రూపములు పుంలిఙ్గరూపముల మాదిరిగానే వుంటాయి.

इदम् ఇది

పుంలిఙ్గము

ప్ర. अयम् इमौ इमे

ద్వి. इमम्, एनम् इमौ, एनौ इमान्, एनान्

తృ. अनेन, एनेन आभ्याम् एभिः

చ. अस्मै आभ्याम् एभ्यः

పం. अस्मात् आभ्याम् एभ्यः

ష. अस्य अनयोः,एनयोः एषाम्

స. अस्मिन् अनयोः,एनयोः एषु.

స్త్రీలిఙ్గము

ప్ర. इयम् इमे इमाः

| | | | |
|---|---|---|---|
| ద్వి. | इमाम्, एनाम् | इमे, एने | इमाः, एनाः |
| తృ. | अनया,एनया | आभ्याम् | आभिः |
| చ. | अस्यै | आभ्याम् | आभ्यः |
| పం. | अस्याः | आभ्याम् | आभ्यः |
| ష. | अस्याः | अनयोः,एनयोः | आसाम् |
| స. | अस्याम् | अनयोः,एनयोः | आसु. |

నపుంసకలిఙ్గము

| | | | |
|---|---|---|---|
| ప్ర.&ద్వితీయా | इदम् | इमे | इमानि |

మిగిలినరూపములు పుంలిఙ్గ రూపములను పోలియుండును.

పదములు

अक्षमा స్త్రీ.స్పర్ధ,ఈర్ష్య

अथवा అ.లేదా

उर्वशी స్త్రీ.అప్సరస ,

कदर्य పు.కృపణుడు

कवीश పు.(कवि కవి ईश పు.దేవుడు) కవీశ్వరుడు కవిశ్రేష్ఠుడు.

किल అ.అట్లు ఉన్నదట

अलं+कृ అలంకరించుట

गर्तः పుం.గుంట,గర్తము

गृध्रराज పు.జటాయువు, గద్దలకురాజు

छन्न (छद्+क्त)కప్పబడినది.

जव పు.గతి.వేగము

दुःखित విణ.దుఃఖితుడు,ఖిన్నుడు

दृश्य విణ.కనిపించునది.దృశ్యము

देवदारु పు.ఒక వృక్షముపేరు

द्रुतम् క్రి.వి.శీఘ్రముగా

पुरः అ.ముందు,ఎదురుగా

पुष्पधारिन् విణ.పూలను ధరించువాడు

प्रदेय విణ.ఇవ్వదగినది

प्रियतमा స్త్రీ.ప్రేయసి

भिक्षा స్త్రీ.భిక్ష

भीरु విణ.స్త్రీ.భయపడునది

मदिराक्षी స్త్రీ.మత్తెక్కించు కన్నులున్న స్త్రీ

वि+रम् (ప.గ ).విరమించుకొనుట

लतागृह న.పొదరిల్లు

वशा స్త్రీ.భార్య,వశములోనున్నది

वास పు.నివాసము

वीथि\वीथी స్త్రీ.మార్గము

व्याख्येय వి.వ్యాఖ్యాన యోగ్యము

संगत న.మైత్రి, సాహచర్యము

संगमोत्सुक విణ.కలియవలెనను కోరికగల

सारंग పు.చాతకపక్షి,నెమలి,జింక,కోకిల, రంగు కలది

स्त्रीरत्न న.స్త్రీరత్నము

पुत्रीकृत విణ.పుత్రుడుగా గ్రహింపబడినవాడు

पूर् ద.గ.నింపుట, పూరించుట

प्रभव పు.పుట్టుక

प्रियाप्रवृत्ति స్త్రీ.प्रिया ప్రేయసి, प्रवृत्ति వృత్తాంతము ప్రేయసిని గూర్చిన వార్త

मधुकर పు.తుమ్మెద

रथ्य పు.గుర్రము

रीति స్త్రీ.పద్ధతి,మార్గము

वरतनु వి.సుందరమైన తనువుకలిగినది

विप्रिय వి. అప్రియము,తప్పు

वृषभध्वज పు.శివుడు

शिवालय న.శివాలయము

संगम పు.సంయోగము, సంగమము

साहस న.వీరకృత్యము

स्वादु వి.మధురము

తెలుగులోనికి అనువదించుము

इदमासनमलंक्रियतां भवता ।

मृगस्य जवस्याक्षमयेवामी रथ्या धावन्ति ।

अनया रीत्या व्याख्येयोऽयं ग्रन्थः ।

वत्स विरमास्मात्साहसात् ।

अमू तौ तरू यौ ह्योऽपश्यत् ।

अस्मै विदुषे ब्राह्मणाय दक्षिणां प्रयच्छ ।

अनयोः कन्ययोः संगतं मे रोचते ।

[1]इमं सारङ्गं प्रियाप्रवृत्तयेऽभ्यर्थये ।

[2]अयं स ते तिष्ठति संगमोत्सुको
विशङ्कसे भीरु यतोऽवधीरणाम् ।

[3]अमुं पुरः पश्यसि देवदारुं पुत्रीकृतोऽसौ वृषभध्वजेन ।

स्त्रीरत्नेषु ममोर्वशी प्रियतमा यूथे तवेयं वशा ।

---

1) ఉద్యానవనంలో ప్రేయసితో సంచరిస్తున్న ఒక రాజు అకస్మాత్తుగా ప్రేయసి అదృశ్యం కాగా పశువులు పక్షులు తన ప్రేయసిని గురించి చెప్పగలవన్న ఆశతో వాటిని అడుగుతున్న సందర్భములోనిది.

2) తన ప్రియుడు ధిక్కరిస్తాడన్న భయమొందుచున్న స్త్రీతో ప్రియుడు పలికిన పలుకులివి.

3) శివునకు ప్రీతి పాత్రమైన ఒక వృక్షమును కూర్చి ఒక సింహము దిలీపునితో చెప్పుచున్న మాటలివి.

मधुकर मदिराक्ष्याः शंस तस्याः प्रवृत्तिं
बरतनुरथवासौ नैव दृष्टा त्वया मे ।

हंस प्रयच्छ मे कान्तां गतिरस्यास्त्वया हृता ।

अस्मिन्नेव लतागृहे त्वमभवः ।

अस्यैवासीन् महति शिखरे गृध्रराजस्य वासः ।

मनोहरा अमी वृक्षा दृश्यन्ते पुष्पधारिणः ।

अगच्छदमुया वीथ्या दास्यमूं द्रुतमानय ।

कृतं किमेभिस्तव विप्रियं
यदनिष्टमेषामसि कर्तुमुद्यतः ।

पादानमीषां प्रणतो यतोऽसौ
भद्रं ततोऽमीभिरमुष्य कार्यम् ।

पूर्यां पुराऽस्यां किल कालिदासो
नाम्नाभवद्यो न्यवसत्कवीशः ।

यदि प्रसन्ना भगवतीमं वरं याचे ।

अस्मिँल्लोके यत्क्रियते तस्य फलममुष्मिँल्लोकेऽनुभूयते ।

एभिर्वचोभिः सान्त्वय मे दुःखितां भार्याम् ।

हे सीते पुत्राविमौ ते ।

---

1.దంత్యమైన హల్లునకు 'ల్' పరమయినచో లకారానికి ద్విత్వమువచ్చి, అందుకు పూర్వమున్న న కారమును సూచించు అర్ధచంద్రచిహ్నము వచ్చును.

## సంస్కృతములోనికి అనువదించుము

ఇది నా పుస్తకము.

తమరాజు విజయంవల్ల వారు ఆనందించుచున్నారు.

ఈ బాలికలు నాట్యము నేర్చుకొన్నారు.

ఈ కళ్లతో నేను చూడను.

ఈ చెట్టుపై ఒక కోతి ఉన్నది.

ఈ నదులలో చాలా జలమున్నది.

ఈ పర్వతములనుండి పెక్కు రాళ్లుపడెను.

కర్రలతో దొంగను కొట్టెదను.

ఈ స్త్రీలను శివాలయములో చూచితిని.

ఈ నదులకు జన్మస్థానము హిమాలయము.

ఈ బాలబాలికలకు మోదకములనిమ్ము.

పర్వతాగ్రమునుండి క్రిందికివచ్చుచున్న వ్యాఘ్రమును చూసినాను.

ఈ ఇద్దరు దొంగలనుండి నాబంగారమును రక్షించినాను.

యుద్ధరంగమునుండి పారిపోవుచున్న ఆ సైనికుని చూసినాను.

యాత్రికుడు ఆతోవనే వెళ్లెను.

ఈ రెండు గుంటలను మట్టితో పూడ్చుము.

నేను కృపణుని నుండి భిక్షను అపేక్షించను.

రాజ భవనము నదినుండి రెండు కోసుల దూరమున నున్నది.

మధురమైన ఆమామిడి పండును నాకిమ్ము.

ఈ లేడిచేత ఏతప్పు(అపరాధము) చేయబడినది?

ఈ రెండునదుల సంగమము పవిత్రము.

ఈ బట్టతో కప్పబడి నేను అదృశ్యుడనగుదును.

ఈ ఇద్దరు కన్యలు కూడ వివాహమునలో (వరులకు) ఇవ్వదగినవారే.

ఈ గ్రామములలో పెక్కుమంది విద్వాంసులు నివసించెదరు

## పరీక్ష

1. ఏ సర్వనామములయొక్క విభక్తి రూపములు అనియతములో పేర్కొనుము.

2. పుం.స్త్రీ.నపుంసకలిఙ్గములలో అదస్, ఇదమ్, అస్మద్, యుష్మద్ శబ్దములను వ్రాయుము.

3. అదస్ శబ్దము యొక్క విభక్తిరూప ప్రక్రియను సులభంగా గుర్తుంచుకొను పద్ధతిని పేర్కొనుము.

4.దంత్యములైనహల్లులకు 'ల్' పరమయినపుడు ఏమార్పువచ్చును

# ముప్పది రెండవపాఠము

కొన్ని సుభాషితములు

పద్య భాగము

विद्वत्त्वं च नृपत्त्वं च नैव तुल्यं कदाचन ।

स्वदेशे पूज्यते राजा विद्वान् सर्वत्र पूज्यते ॥ १ ॥

वरमेको गुणी पुत्रो न च मूर्खशतान्यपि ।
एकश्चन्द्रस्तमो हन्ति न च तारागणोऽपि च ।। २ ।।

[1]एकेनापि सुवृक्षेण पुष्पितेन सुगन्धिना ।
वासितं तद्वनं सर्वं सुपुत्रेण कुलं यथा ।। ३ ।।

उत्सवे व्यसने चैव दुर्भिक्षे शत्रुविग्रहे ।
राजद्वारे श्मशाने च यस्तिष्ठति स बान्धवः ।। ४ ।।

दुर्जनः प्रियवादी च नैतद्विश्वासकारणम् ।
मधु तिष्ठति जिह्वाग्रे हृदये तु हलाहलम् ।। ५ ।।

दुर्जनः परिहर्तव्यो विद्ययालंकृतोऽपि सन् ।
मणिना भूषितः सर्पः किमसौ न भयंकरः ।। ६ ।।

कुलीनैः सह संपर्कं पण्डितैः सह मित्रताम् ।
ज्ञातिभिश्च समं मेलं कुर्वाणो न विनश्यति ।। ७ ।।

------------------------------

ఏక అను సర్వనామమునకు సర్వశబ్దమువలె విభక్తిరూపములువచ్చును.

यो ध्रुवाणि परित्यज्य अध्रुवं परिषेवते ।
ध्रुवाणि तस्य नश्यन्ति अध्रुवं नष्टमेव च ।। ८ ।।

पादपानां भयं वातः पद्मानां शिशिरो भयम् ।
पर्वतानां भयं वज्रः साधूनां दुर्जनो भयम् ।। ९ ।।

तस्मात्स्वविषये रक्षा कर्तव्या भूतिमिच्छता ।
यज्ञैर्नावाप्यते स्वर्गो रक्षणात्प्राप्यते यथा ।। १० ।।

यथा फलानां पक्कानां नान्यत्र पतनाद्भयम् ।
एवं नरस्य जातस्य नान्यत्र मरणाद्भयम् ।। ११ ।।

न भीतो मरणादस्मि केवलं दूषितं यशः ।
विशुद्धस्य हि मे मृत्युः पुत्रजन्मसमः किल ।। १२ ।।

अपापानां कुले जाते मयि पापं न विद्यते ।
यदि संभाव्यते पापमपापेन च किं मया ।। १३ ।।

अर्थमनर्थं भावय नित्यं नास्ति ततः सुखलेशः सत्यम् ।
पुत्रादपि धनभाजां भीतिः सर्वत्रैषा विहिता रीतिः ।। १४ ।।

का तव कान्ता कस्ते पुत्रः संसारोऽयमतीव विचित्रः ।
कस्य त्वं वा कुत आयातस्तत्त्वं चिन्तय तदिदं भ्रातः ।। १५ ।।

शत्रौ मित्रे पुत्रे बन्धौ मा कुरु यत्नं विग्रहसन्धौ ।
भव समचित्तः सर्वत्र त्वं वाञ्छस्यचिराद्यदि सत्तत्त्वम् ।। १६ ।।

महता पुण्यपण्येन क्रीतेयं कायनौस्त्वया ।
पारं दुःखोदधेर्गन्तुं तर यावन्न भिद्यते ।। १७ ।।

धैर्यं यस्य पिता क्षमा च जननी शान्तिश्चिरं गेहिनी
सत्यं सूनुरयं दया च भगिनी भ्राता मनःसंयमः ।
शय्या भूमितलं दिशोऽपि वसनं ज्ञानामृतं भोजन -
मेते यस्य कुटुम्बिनो वद सखे[1] कस्माद्भयं योगिनः ।। १८ ।।

विपदि धैर्यमथाभ्युदये क्षमा
सदसि वाक्पटुता युधि विक्रमः ।
यशसि चाभिरुचिर्व्यसनं श्रुतौ
प्रकृतिसिद्धमिदं हि महात्मनाम् ।। १९ ।।

---

1.సఖి శబ్దముయొక్క విభక్తిరూపములు విశిష్టముగ ఉండును.

